


# AKSHARASILPULU

Telugu title of this book **AKSHARASILPULU** means **SCULPTORS OF LETTERS.**

This book contains the personal and literary details of .Muslim Writers-Poets and Translators who are writing in Telugu language. It gives not only details of the each sculptors of letters but also Photos and their Address, Email ID with the cell and Land Line Phone numbers.

It was the strenuous work to two years. And able to secure the details of 333 Muslim Telugu writers.

This Book contains total 184 pages of $1/8^{th}$ Demmy Size with Multi colour title. It was published in the year 2010.

# అక్షరశిల్పులు

(ముస్లిం కవులు-రచయితల సంక్షిప్త పరిచయం)

## సయ్యద్ నశీర్ అహమ్మద్

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్**
**వినుకొండ - 522647**

**అక్షరశిల్పులు**

(ముస్లిం కవులు-రచయితల సంక్షిప్త పరిచయం)

AKSHARASILPULU

(Brief Introduction of Muslim Poets and Writers of AP)


కూర్పు :

**సయ్యద్ నశీర్ అహమ్మద్**

Compilation :

Syed Naseer Ahamed





ప్రచురణ సంఖ్య : 9

ప్రథమ ముద్రణ : 2010

ముఖపత్రాలంకరణ : వజ్రగిరి జెస్టిస్, వినుకొండ, 9848469694

ముద్రణ : శ్రీజయదీప్తి గ్రాఫిక్స్, వినుకొండ. 9908429395

**పుస్తకాలకు :**

ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్, శివప్రసాద్ వీధి, కొత్తపేట,
వినుకొండ-522 647, గుంటూరు జిల్లా.
సంచారవాణి : 9440241727, 9396429722

**సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :**

తెలుగు బుక్ హౌస్, 3-3-862, కాచిగూడా ఎక్స్ రోడ్స్
హైదరాబాద్-500 027,
సంచారవాణి: 9247446497, దూరవాణి: 040-65347374

మరియు

**అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో లభ్యం.**

**వెల : రు.150-00**

బహుముఖ ప్రజ్ఞాశాలి,

బహు భాషాపండితులు,

బహు గ్రంథకర్త,



## డాక్టర్ ఉమర్ అలీషా గారికి

**(1885 - 1945)**

## అంకితం.

## ఇందులో...



**ఆచార్య షేక్ మస్తాన్** M.A(Tel).,M.A(Lin).,Ph.D.
అధ్యక్షులు: ఆధునిక భారతీయ భాషల విభాగం
అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం
అలీఘర్, ఉత్తరప్రదేశ్.

# ముందు మాట

తెలుగు సారస్వత రంగానికి ముస్లింల సేవ అమూల్యం. అపురూప గ్రంథాలను అసంఖ్యాకంగా తెలుగు పాఠకులకు అందించారు. తెలుగు సాహిత్య రంగానికి వన్నెతెచ్చిన అవధాన ప్రక్రియను సైతం అలవోకగా నిర్వహిస్తూ, అద్భుతంగా పద్యరచన గావిస్తూ చక్కని విద్వత్తును, గొప్ప ధారణా శక్తిని ప్రదర్శించి పండితులు–ప్రజల చేత శభాష్ అన్పించుకున్నారు. తెలుగు సాహిత్య క్షేత్రంలో పండుతున్న అన్నిరకాల సాహిత్య పంటలను పండించడం మాత్రమే కాకుండా సొంత బాణిలో 'రెక్కలు' లాంటి ప్రత్యేక సాహిత్య రచనా ప్రక్రియలకు అంకురార్పణ చేసి తెలుగు సాహిత్యరంగాన్ని సుసంపన్నం చేయడంలో తమదైన ప్రత్యేక భాగస్వామ్యాన్ని అందిస్తున్నారు.

తెలుగు 'తల్లిభాష' కానప్పటికి తెలుగు భాష మీద మంచి సాధికారత సాధించి అద్భుతమైన ప్రతిభను ప్రదర్శించారు. ప్రతిభ అద్వితీయంగా ఉన్నా, సృష్టించిన సాహిత్యం అనితర సాధ్యమైనా ముస్లిం కవులు, రచయితలకు తగినంత గుర్తింపు లభించడం లేదన్నది జగమెరిగిన సత్యం. తెలుగు వాఙ్మయ చరిత్రకారులకు, తెలుగు భాషా వైతాళికుల గ్రంథకర్తలకు తెలుగు ముస్లిం కవులు, రచయితల పట్ల చిన్నచూపుంది. తెలుగు సాహిత్య చరిత్రకారులు రూపొందించిన గ్రంథాలను పరిశీలిస్తే ముస్లిం కవులు, రచయితల పట్ల గల 'వివక్ష–విస్మరణ' స్పష్టం అవుతుంది.

బహుభాషా పండితులు, బహుగ్రంథకర్త, స్వాతంత్ర్య సమరయోధులు, ఆధ్యాత్మిక గురువులు, ప్రజాప్రతినిధి, అవధాని, మహాకవి డాక్టర్ ఉమర్ అలీషాను పరిచయం చేయడానికి తెలుగు వాఙ్మయ చరిత్రకారులకు తమ గ్రంథాలలో సముచిత స్థానం దొరకలేదు. మౌల్వీ ఉమర్ అలీషా మాత్రమే కాదు తెలుగు సాహిత్య ప్రక్రియలన్నిటిలో తమదైన ప్రతిభను కనపర్చిన కవులు, రచయితలు షేక్ బుడన్ సాహెబ్, తక్కళ్ళపల్లి పాపా సాహెబ్, అచ్చుకట్ల దస్తగిరి, షేక్ అలీ, షేక్ మహమ్మద్ హుస్సేన్, షేక్ దావూద్ సాహెబ్ లాంటి వారు కూడా ఇటువంటి 'వివక్ష–విస్మరణ'కు గురికాకపోలేదు. ఆ కారణంగా తెలుగు సాహిత్య చరిత్ర గ్రంథాలలో ముస్లిం కవులు, రచయితల పరిచయాలు అత్యల్పంగా కన్పిస్తాయి, అక్కడక్కడా ఒకటీ రెండూ కన్పించినా ఆయా కవులు రచయితల గురించి, వారి రచనల గురించిన సమాచారం నామమాత్రమే.

భాషాశాస్త్ర నిపుణులు, ఉత్తమ సాహిత్య విమర్శకులు ఆచార్య తూమాటి దోణప్ప (నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు) గారి ప్రోత్సాహంతో తెలుగు సాహిత్యానికి ముస్లింలు అందచేసిన సేవల మీద పరిశోధన జరిపే అవకాశం నాకు లభించింది. ఆ అవకాశాన్ని వినియోగించుకుని 'తెలుగు సాహిత్యం : ముస్లింల సేవ' సిద్ధాంత వ్యాసాన్ని నాగార్జున విశ్వవిద్యాలయానికి సమర్పించి 'పి.హెచ్‌డి' పట్టాను పొందాను. ఆ పరిశోధన సమయంలో 1984 వరకు ముస్లిం కవులు, రచయితలు తెలుగు సాహిత్యానికి అందించిన సేవలు నా పరిశోధన పరిధిలోకి వచ్చాయి. నా యీ సిద్ధాంత వ్యాసాన్ని 1991లో ప్రచురించాను.

ఈ గ్రంథం వెలువడ్డాక, అద్భుతమైన తెలుగు సాహిత్యాన్ని సృష్టించిన ముస్లిం కవులు, రచయితల లౌకిక దృక్పథం, జాతీయత, దేశభక్తి తదితర విషయాలు గురించి తెలుగు పాఠకుల ఎరుకలోకి వచ్చాయి. 'ఏకత్వంలో భిన్నత్వం' అంత:సూత్రంగా సాగుతున్న భారతీయ జన జీవన ప్రవంతిలో ముస్లింలు పాలు–తేనెగా కలసిపోయి భిన్నత్వంలో ఏకత్వాన్ని సజీవంగా నిలుపుతున్న తీరుతెన్నులను వెల్లడి చేసింది.

'తెలుగు సాహిత్యం : ముస్లింల సేవ' ప్రచురణ తరువాత సాగిన రెండు దశాబ్దాల కాలంలో తెలుగు సాహిత్య రంగంలో ముస్లింల ప్రవేశం, ప్రమేయం అత్యధికమని చెప్పవచ్చు. నా రచన తరువాత ఎందరో ముస్లిం కవులు, రచయితలు తెలుగు సాహిత్య వెలుగును ప్రకాశింప చేశారన్నది సత్యదూరం కాదు. ఒకవైపు తమ తల్లి భాష 'ఉర్దూ'ను విస్మరించకుండానే ప్రాంతీయ భాష తెలుగును కూడా వంట బట్టించుకుని, తెలుగు సాహిత్య ప్రక్రియలను అధ్యయనం చేస్తూ అన్నిరకాల సాహిత్య ప్రక్రియలలో ప్రవేశం సంపాదించి ఉత్తమ సాహిత్యాన్ని సృజియిస్తున్నారు. గతంతో పోల్చుకుంటే వర్తమానంలో ముస్లిం కవులు, రచయితల సంఖ్య దినదిన ప్రవర్ధమానమౌతూ వచ్చింది. సమకాలీన సమాజంలో పాఠకుల ఆదరణ పొందిన ప్రతి ప్రక్రియలో అద్భుతమైన వస్తు పరంగా, భాష పరంగా నైపుణ్యాన్ని సాధించి చక్కని గ్రంథాలను అందిస్తున్నారు.

సమాజంలో ప్రచురణ ప్రసార సాధనాల ఉధృతం ఎంతగా ఉన్నా పాఠకుల ఆదరణ అంతకంటె ఎక్కువగా ఉండడంతో సాహిత్య గ్రంథాల వెల్లువ ఏమాత్రం తగ్గలేదు. ముస్లిం కవులు, రచయితలు కూడా వ్యక్తిగతంగా తమ సాహిత్య ప్రక్రియలను పెద్ద సంఖ్యలో వెలువరించడం ఆనందించ దగిన విషయం. కవులు, రచయితలు వ్యక్తిగతంగా కవితా–కథా –వ్యాస సంపుటాలను వెలువరించడం మాత్రమే కాకుండా  తెలుగులో రాస్తున్న ముస్లిం కవులు, రచయితల ఉత్తమ రచనలు సేకరించి సంకలనాలను కూడా ప్రచురించడం ఆహ్వానించదగిన పరిణామం. ఆ తరువాత ముస్లిం సమాజం ఎదుర్కొంటున్న సమకాలీన సమస్యల తీవ్రతను బట్టి ఆయా సమస్యలను ప్రధాన వస్తువుగా స్వీకరించి కవితా సంకలనాలు, కథా సంకలనాలు అధిక సంఖ్యలో వెలువడటం ప్రధాన జీవన స్రవంతిలో భాగంగా సాహిత్య ప్రపంచానికి ముస్లిం సమాజం అందిస్తున్న అత్యంత విలువైన భాగస్వామ్యాన్ని వెలుగు చేస్తున్నాయి.

ఈ క్రమంలో ప్రస్తుతం 'అక్షరశిల్పులు' గ్రంథాన్ని వెలువరించిన  సయ్యద్ నశీర్ అహమ్మద్ చరిత్రకారులుగా, రచయితగా, బహు గ్రంథకర్తగా లబ్దప్రతిష్టులు. ఈయన రచనలు రాసిలోనూ వాసిలోనూ, ప్రసిద్ధివహించాయి. ముస్లిం సమాజ ప్రతిష్ట పునఃస్థాపన ప్రధాన లక్ష్యంగా వెలువడిన ఈయన గ్రంథాలు విభిన్న సాంఘిక సముదాయాలున్న భారతీయ సమాజంలో  సద్భావన, సదవగాహన మరింతగా పునఃస్థాపన కావడానికి దోహదపడతాయి. సుస్పష్టమైన అవగాహనతో సాధికారమైన రచనలు చేయడంలో నశీర్ సిద్ధహస్తులు. భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్రను వెలుగు చేస్తూ ఆయన రాసిన గ్రంథాలు ముస్లింల మీద అసంకల్పితంగా ఉద్భవించిన సంశయాలను, సందేహాలను, ఉద్దేశ్యపూర్వకంగా ప్రచారం చేయబడుతున్న అసత్యాలను, అర్థసత్యాలను పఠాపంచలు చేసి ముస్లింల అస్థిత్వాన్ని ధృడపర్చి, ముస్లింల దేశభక్తికి కాగడా పడుతుంటాయి.

'అక్షరశిల్పులు' రచన సాహిత్య సంబంధమైనది. చారిత్రక రచన ఒక ఎత్తయితే సాహిత్య చరిత్ర రచన మరో ఎత్తు. ఇది చరిత్రకారుడైన నశీర్ గారి భావవై విధ్యానికి నికశోఫలంగా నిర్ధారించవచ్చు. ఈ రచన తెలుగులో రాసిన/రాస్తున్న ముస్లిం కవులు, రచయితల రచనలు, వారి జీవిత రేఖలకు దర్పణం లాంటిది. ముస్లిం తెలుగు రచయితలు తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేస్తూ సృష్టించిన రచనల వివరాలను, ఆయా కవులు, రచయితల జీవిత విశేషాలను వివరించే కార్యభారాన్ని మోసేందుకు నశీర్ అహమ్మద్ పూనుకోవడం ఆయన చారిత్రక, సాహిత్యాభిలాషకు నిదర్శనం. ఈ కార్యనిర్వహణకు కంకణం కట్టుకుని ఆయన కార్యసాధకులయ్యారు. ఇదొక క్లిష్టమైన మహత్తర కార్యం. యీ కార్యసాఫల్యానికి కడు వ్యయప్రయాసలకు లోనైఉంటారన్నది నగ్నసత్యం. ఇటువంటి గ్రంథ రచనలకు సంబంధించిన విషయ సేకరణకు ఎంతో ఓపిక, ఓర్పు, సహనం అవసరం. పలు ఒడు దుడుకులను, కష్టనష్టాలను సైతం భరించక తప్పదు. యీలాంటి బృహత్కర కార్యభారాన్ని చేపట్టి పట్టువదలని విక్రమార్కుడిలా అహర్నిశలు కృషి చేసి 333 మంది కవులు, రచయితల వివరాలతో 'అక్షరశిల్పులు' వెలువరించడం ముదావహం. యీ గ్రంథం ద్వారా ముస్లిం కవులు, రచయితలు వారి రచనలు మరుగున పడి మటుమాయం కాకుండా నశీర్ నిక్షిప్తం చేశారు. భావి తరాలకు, సాహిత్య చరిత్ర పరిశోధకులకు అక్షరశిల్పులు ఎంతగానో ఉపకరిస్తుందనటం ఏమాత్రం అతిశయోక్తికాదు.

యీ గ్రంథాన్ని ప్రముఖ కవి మౌల్వీ ఉమర్ అలీషాకు అంకితం ఇవ్వడం హర్షదాయకం. ఉత్తమ కవులు, రచయితలు పట్ల నశీర్ గారికి ఉన్న గౌరవభావానికి ఇది నిదర్శనం. ఈ గ్రంథానికి వీలైనంతగా శాశ్వత భద్రత కల్పించాలని, సాహిత్య చరిత్ర పరిశోధకులకు సర్వదా అందుబాటులో ఉంచాలన్న లక్ష్యంతో ప్రముఖ గ్రంథాలయాలకు, రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలకు, ప్రచార సాధనాల వ్యవస్థలకు ఉచితంగా అందచేయాలని నిర్ణయించడం మహోన్నతమయింది. అక్షరశిల్పులు ప్రచురణను వాణిజ్య వ్యవహారంగా కాకుండా ముస్లిం సమాజానికి, తెలుగు సాహిత్య ప్రపంచానికి మేలు కలుగచేయడమే ప్రధానమన్న సంకల్పం కలిగిన నశీర్ అహమ్మద్‌ను అభినందనీయులు. ఆర్థిక ఒనరులు పుష్కలంగా ఉన్న విశ్వవిద్యాలయాలు, సాహిత్య అధ్యయన సంస్థలు, సాహిత్య పీఠాలు మాత్రమే చేయగల పనిని నశీర్ వ్యక్తిగతంగా పూనుకుని అనుకూల–ప్రతికూల పరిస్థితులను కూడా సమానంగా సహనంతో ఆహ్వానించి ఒంటి చేత్తో పూర్తిచేయడం ప్రసంశనీయం. సత్యశోధకులు, సాహిత్యాభిలాషి నశీర్ లాంటి వ్యక్తికి ప్రజలు, ప్రభుత్వాలు, విశ్వ విద్యాలయాలు కించిత్తు తోడ్పాటు అందించినా అద్భుతాలను సృష్టించగలడన్నది నిర్వివాదాంశం.

ఈ గ్రంథానికి ముందుమాట రాయడం నాకు లభించిన గౌరవంగా భావిస్తున్నాను. ప్రజలకు, పాఠకులకు ప్రధానంగా సారస్వత సమాజానికి ఉపయుక్తంకాగల బృహత్తర కార్యభారాన్ని చేపట్టి 'అక్షరశిల్పులు' గ్రంథాన్ని అందించిన సయ్యద్ నశీర్ అహమ్మద్ ముమ్ముందు తెలుగు సాహిత్య చరిత్ర రంగాన్ని మరింత సంపన్నం చేయగల గ్రంథాలను ప్రచురిస్తారని ఆశిద్దాం, ఆహ్వానిద్దాం, ఆశీర్వదిద్దాం. ◆




**డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వర రావు**
ప్రముఖ పాత్రికేయులు
హైదరాబాద్


# శుభాభినందనలు

శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ జర్నలిస్టుగా, రచయితగా నాకు చాలా కాలంగా తెలిసినవారు, అంతకుమించి హితులు. అభిరుచి కారణంగా పత్రికారంగంలో ప్రవేశించి, విలేఖరి స్థాయి నుండి సంపాదకుడు స్థాయికి స్వయం కృషితో ఎదిగిన ప్రతిభావంతుడాయన. రాసే సామర్థ్యం, గీసే ప్రజ్ఞ కలగలిసి ఉన్న జర్నలిస్టులు చాలా అరుదు. అలా అరుదైన వారిలో ఆయన ఒకరు. గీసే సామర్థ్యంలోనూ ఆయన ప్రజ్ఞ అసాధారణం. చిత్ర రచన చేయగలరు, వ్యంగ్య చిత్రాలూ వేయగలరు. ఇంతటి శక్తి సామర్థ్యాలు కలిగిన నశీర్‌గారు జీవిక కోసం న్యాయవాద వృత్తిని ఎంచుకున్నారు. జర్నలిస్టు, రచయితగానే కాక ఆయనను నేను అభిమానించడానికి ఒక ముఖ్య కారణం అయన త్రికరణశుద్ధిగా సమాజంలోని అన్ని వర్గాలవారు, అన్ని విశ్వాసాల వారు పరస్పరం గౌరవంతో, ప్రేమాభిమానాలతో కలసి జీవించాలని ప్రగాఢంగా ఆశిస్తున్నారు, అందుకోసం నిరంతరం కృషి చేస్తున్నారు.

భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిములు నిర్వహించిన మహత్తర పాత్రను వివరిస్తూ శ్రీ నశీర్ పత్రికల్లో వ్యాసాలు వ్రాసి, ఆ క్రమంలో పలు ప్రామాణిక, పరిశోధనాత్మక గ్రంథాలను వరుసగా వెలువరిస్తున్నారు. ఈ గ్రంథాలు వెలువడ్డప్పుడల్లా సంతోషించిన వారిలో నేనూ ఒకడిని. ఆయన గ్రంథాలు దేశభక్తిని ప్రబోధించడమే కాక మాతృదేశం కోసం ముస్లిములు ఎంతటి మహత్తర త్యాగాలు చేశారో, స్వాతంత్ర్యోద్యమంలో మిగతా వారందరితో భుజం భుజం కలిపి ఎలా మమేకమై పోరాడారో తెలియజేసే చరిత్ర గ్రంథాలవి.

ముస్లిం స్వాతంత్ర్య సమరయోధుల సమాచారం సేకరించడానికి పడిన శ్రమ కంటె మరింతగా కష్టపడి శ్రీ నశీర్ అహమ్మద్ ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న 'అక్షరశిల్పులు' గ్రంథాన్ని నిర్మించారు. తెలుగు సాహిత్య చరిత్ర రచయితలకు, పరిశోధకులకు బాగా ఉపయోగపడగల మంచి రచన ఇది. ఈ గ్రంథలోని కవులు,రచయితలు, అనువాదకుల పరిచయాలు సంక్షిప్తంగా ఉన్నా ప్రామాణికంగా ఉన్నాయి. తెలుగు సాహిత్యానికి, ముస్లిం సమాజానికీ కూడా 'అక్షరశిల్పులు' ద్వారా శ్రీ నశీర్ గొప్ప సేవ చేశారు.

ఈ గ్రంథంలో పేర్కొన్న రచయితలలో నేను అభిమానించిన వారు, నాకు వ్యక్తిగతంగా తెలిసిన వారు కొందరున్నారు. వారిని గురించి చదివినప్పుడు రచయిత కొద్ది పంక్తుల్లోనే చెప్పవలసిన ముఖ్యవిశేషాలన్నిటినీ చెప్పారన్న భావన కలిగింది. డాక్టర్ ఉమర్ అలీషా అనువాదం చేసిన ఉమర్ ఖయ్యాం రుబాయిలు తెలుగు సాహిత్యంలో చిరకాలం నిలుస్తాయి. నా చిన్నతనంలో ఆయన పద్యాలను కంఠస్థం చేసిన వాళ్ళం చాలామంది ఉండేవాళ్లం. కాని ఇరవై ఒకటవ శతాబ్దం ఆరంభంలో ఉమర్ అలీషా గురించి తెలిసినవారు బహు కొద్దిమంది. ఆయన గురించి సమకాలీన సమాజం తెలుసుకొనవలసిన అవసరం ఉంది. ఈయన మీద ఇప్పటికే శ్రీ నశీర్ అహమ్మద్ రాసిన పలు వ్యాసాలు ఆ కొరతను తీర్చుతున్నాయి. అలాగే శ్రీ జైనుల్ అబిదీన్ ఖుర్ఆన్, భగవద్గీతను కూడా అధ్యయనం చేసి సాధికారిక ఉపన్యాసాలు ఇస్తుండేవారు. తెలుగు పాఠకులకు ఇస్లాం గురించి వీలయినంత ఎక్కువ అవగాహన కలిగించాలన్న లక్ష్యంతో కృషిచేస్తున్న శ్రీ యస్.ఎం మలిక్ నాకు సన్నిహితంగా తెలిసినవారు. అలాంటివారే ఖుర్ఆన్‌ను తెలుగులోకి అనువాదం చేసిన హమీదుల్లా షరీఫ్ గారు. జర్నలిస్టు మిత్రులు దేవీప్రియ, రచయిత అబ్దుల్ రజా హుస్సేన్, ప్రసిద్ధ కవులు మహమ్మద్ ఇస్మాయిల్, చెట్టు ఇస్మాయిల్ గార్ల సమాచారం చదువుతున్నప్పుడు నాకు చాలా సంతోషం, సంతృప్తి కలిగాయి.

ఈ గ్రంథాన్ని రూపొందించేందుకు ఎంతగా శ్రమించవలసి వచ్చిందీ ఊహించదగిన విషయమే అయినా శ్రీ నశీర్ అహమ్మద్ 'మీతో నా మాట' లో ఆ కష్టాలను స్వయంగా వివరించారు. ఈ గ్రంథం ఆయన కష్టానికి తగిన ప్రతిఫలం అనిపించింది. దానిని అనుభవించ వలసింది పాఠకులు. మొక్కనాటి చెట్టును పెంచి, కాయలు కాయించేది ఇతరుల కోసమే గదా! ఇంత మంచి ప్రయోజనాత్మక గ్రంథాన్ని రూపొందించిన శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ ముమ్మాటికీ అభినందనీయులు.

తెలుగులో రాసిన, ప్రస్తుతం రాస్తున్న సుమారు 333 మంది కవులు, రచయితలు, అనువాదకుల వ్యక్తిగత, సాహిత్య విశేషాలను సమకూర్చడం చాలా శ్రమతో కూడుకున్నది. ఈ తరహా గ్రంథాల రూపకల్పన విశ్వవిద్యాలయాలు, వ్యవస్థలు, అధ్యయన సంస్థలు మాత్రమే చేయగలవు. అటువంటి బృహత్తర బాధ్యతలను వ్యక్తిగా శ్రీ నశీర్ అహమ్మద్ ఒంటి చేత్తో విజయవంతంగా నిర్వహించడం ఆయన శ్రమ, కృషి, పరిశోధనాత్మక దృష్టికి తార్కాణం. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న వందలాది ముస్లిం యోధుల జీవిత విశేషాలను తెలుగు పాఠకులకు అందించిన చరిత్రకారుడుగా ఖ్యాతిగాంచిన శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ తెలుగు సాహిత్యంలో అపూర్వం అనదగ్గ స్థాయిలో సాహిత్యకారుల, అనువాదకుల వ్యక్తిగత, సాహిత్య వివరాలను మన ముందుంచేందుకు చేసిన బృహత్ ప్రయత్నానికి హృదయ పూర్వక శుభాభినందనలు. ◆




**సయ్యద్ నశీర్ అహమ్మద్**

శివప్రసాద్ వీధి, కొత్తపేట,

వినుకొండ–522647, గుంటూరు జిల్లా,

సంచారవాణి: 9440241727. 9396429700.


# నా మాట

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ముస్లింల పాత్రను వివరిస్తూ రాసిన గ్రంథాల గురించి 'ఎండి.సౌజన్య'గా సుప్రసిద్ధులైన ప్రముఖ రచయిత ముహమ్మద్ నఫీజుద్దీన్ (తెనాలి) గారితో 2002లో ప్రస్తావన వచ్చింది. అ సందర్భంగా రాష్ట్రంలోని ముస్లిం కవులు–రచయితలు–అనువాదకుల వివరాలతో కూడిన ఒక గ్రంథాన్ని వెలువరిస్తే బాగుంటుందని ఆయన సలహా ఇచ్చారు. ఆయా కవులు–రచయితల సాహిత్యం, శైలి, వస్తువు తీరుతెన్నుల గురించి బాగా పరిచయం ఉంటే తప్ప ఆ ప్రయత్నానికి న్యాయం చేయలేనని భావించిన నేను అప్పట్లో నిస్సహాయత వ్యక్తంచేశాను.

## పునరాలోచన :

ఆ తరువాత 2004 అక్టోబర్ 9న భారత స్వాతంత్ర్యోద్యంలో పాల్గొన్న ముస్లిం యోధుల చిత్రపటాల ప్రదర్శన కార్యక్రమంలో పాల్గొనేందుకు రాజమండ్రి వెళ్ళాను. తెలుగు సాహిత్యరంగంలో 'స్మైల్' గా విఖ్యాతులైన ప్రముఖ కవి ముహమ్మద్ ఇస్మాయిల్ గారి అతిథిగా ఆయన ఇంట రెండు రోజులున్నాను. ఆ సందర్భంగా తెలుగులో రాసిన, రాస్తున్న ముస్లిం కవులు–రచయితలు, అనువాదకుల వివరాలను నమోదు చేసే ప్రాజెక్టును చేపట్టాల్సి అవసరాన్ని వివరిస్తూ ఆ ప్రయత్నం చేయమని ఆయన మరోమారు సూచించారు.

భారత స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ఆంధ్రప్రదేశ్ ముస్లింల చరిత్రను గ్రంథస్థం చేసేందుకు సమాచారాన్ని సేకరిస్తున్న సందర్భంగా నేను చాలా ఇబ్బందులను, చేదు అనుభవాలను ఎదుర్కొన్నాను. ఆ అనుభవంతో రానున్న రోజులలో ముస్లిం కవులు–రచయితల సమాచారం కోసం శోధిస్తున్న పరిశోధకులకు, సాహితీవేత్తలకు, సాహిత్య చరిత్రకారులకు ఎటువంటి ఇబ్బందులు ఎదురు కాకుండా చూడాలన్పించింది. కవులు –రచయితలకు సంబంధించిన ప్రాథమిక సమాచారాన్ని ఒక్కచోట అందుబాటులో ఉంచితే తెలుగు సాహిత్య చరిత్రను అధ్యయనం చేస్తున్న పరిశోధకులకు మాత్రమే కాకుండా ఆసక్తిగల ఇతరులకు కూడా ఎంతోకొంత వెసులుబాటు లభించగలదని అన్పించింది.

## చరిత్ర :

తెలుగు భాషలో సాహిత్య సృష్టి చేస్తున్న కవులు, రచయితల వివరాలతో ప్రచురితం అవుతున్న గ్రంథాలు చూస్తే ముస్లిం కవులు–రచయితల పరిచయాల నమోదుకు నాకు తెలిసినంతలో ప్రముఖ కవి ముహమ్మద్ జైనుల్ ఆబెదీన్ ప్రయత్నం చేశారు. ఆయన రాష్ట్ర ప్రభుత్వ వ్యవసాయశాఖలో 'జాయింట్ డైరక్టర్' గా హైదరాబాద్‌లో బాధ్యతలు నిర్వహించారు. ఆ తరువాత ఆయన 1972లో ఉద్యోగ విరమణ చేశారు. ఉద్యోగ విరమణ చేశాక ముస్లిం కవులు, రచయితలందర్నీ ఒక చోట సమావేశపర్చాలన్న ప్రయత్నంలో భాగంగా రాష్ట్రరాజధానిలో 1972లో 'ముస్లిం తెలుగు రచయితల సభలు' నిర్వహించారు. ఆ తరువాత ముస్లిం కవులు రాస్తున్న గ్రంథాల ప్రచురణకు తోడ్పడాలన్న లక్ష్యంతో 'తెలుగు ఇస్లామిక్ ఎకాడమి' అను సంస్థను కూడా ఆయన స్థాపించారు. ఈ సందర్భానికి సంబంధించిన వివరాలను, విశేషాలను వెల్లడిచేయగల పత్రాలు ప్రస్తుతం అందుబాటులో లేవు.

1982లో హైదరాబాద్‌లో 'ఆంధ్రప్రదేశ్ ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనం' జరిగింది. ఈ సమ్మేళనం నిర్వహణకు షేక్ జవాద్ హుసేన్, యస్.ఏ.సమద్, యూసుఫ్ ఘోరీ తదితరులు నడుంకట్టి విజయవంతంగా నిర్వహించారు. ఈ కార్యక్రమం నిర్వహణకు ముహమ్మద్ జైనుల్ అబెదీన్, ఎం.సైఫుల్లా బేగ్, ఎం.ఏ అజీజ్, డాక్టర్ సి.నారాయణ రెడ్డి, ఎం.బాగా రెడ్డి, అల్లాడి పెంటయ్య లాంటి పెద్దలు మార్గదర్శకత్వం వహించారు. ఈ సందర్భంగా 'తెలుగు దివ్వెలు' అను ప్రత్యేక సంచికను తెచ్చారు. ఈ సంచికలో 36 మంది కవులు, రచయితల వ్యాసాలు, కవితలు, పద్యాలు, గేయాలు ఉన్నాయి. ఈ ప్రత్యేక సంచికలో ప్రచురణకు తమ రచనలు అందించిన కవులు, రచయితల వివరాలను చాలా క్లుప్తంగా పొందుపర్చారు.

1984లో ఆచార్య తూమాటి దోణప్ప (నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు) ప్రోత్సాహంతో తెలుగు సాహిత్యానికి ముస్లింలు అందచేసిన సేవల మీద డాక్టర్ షేక్ మస్తాన్ పరిశోధన జరిపారు. ఆ సిద్ధాంత వ్యాసానికి నాగార్జున విశ్వవిద్యాలయం నుండి ఆయన 'పి.హెచ్.డి' పట్టాను పొందారు. ఈ సిద్ధాంత వ్యాసాన్ని 1991లో 'తెలుగు సాహిత్యం : ముస్లింల సేవ' పేరుతో గ్రంథంగా వెలువరించారు. ఈ గ్రంథంలో 1984 వరకు తెలుగులో రాసిన ముస్లిం కవులు, రచయితల వివరాలను సంక్షిప్తంగా పొందుపర్చారు.

డాక్టర్ ఎస్ షమీవుల్లా 'మైనారిటీ కవిత్వం తాత్విక నేపథ్యం' అను గ్రంథాన్ని వెలువరించినా, అది తాత్విక నేపథ్యం మీద చర్చ వరకే పరిమితమయ్యింది. ప్రముఖ కవి ఎండి. ఖాజా 'ముస్లిం వాద తాత్విక సిద్ధాంతం–సాహిత్యం' అను గ్రంథాన్ని తెచ్చారు. ఈ గ్రంథంలో కూడా ముస్లింవాద తాత్విక సిద్ధాంతం తదితర విషయాల మీద చర్చించారు.

అటు తరువాత గత దశాబ్ది కాలంలో పలు కవితా, కథా సంకలనాలు వెలువడ్డాయి. ఈ సంకలనాలను వెలువరించిన సంకలనకర్తలు, సంపాదకులలో కొందరు తమకు రచనలు అందచేసిన కవులు, రచయితల చిరునామాలను మాత్రమే పొందుపర్చారు.

## అవసరమన్పించింది :

ఆ కారణంగా ముస్లిం కవులు రచయితల వ్యక్తిగత, సాహిత్య వివరాలతో కూడిన గ్రంథం తీసుకరావాల్సిన అవసరం ఎంతో ఉందన్పించింది. తెలుగు వాఙ్మయ చరిత్రను వెల్లడిస్తున్న చాలా గ్రంథాలలో ముస్లిం కవులు, రచయితల, అనువాదకుల వివరాలు చాలా అరుదుగా ఉంటున్నాయి. ఆ కారణంగా ముస్లిం కవులు, రచయితల వ్యక్తిగత, సాహిత్య పరమైన వివరాలతో గ్రంథం తీసుకరావాలన్పించింది. ఈ ప్రయత్నం చాలా శ్రమతో కూడినది, పరిమితులు నాకు తెలుసు. ఆ కారణంగా ముస్లిం కవులు-రచయితలు సృజించిన సాహిత్యం, తీరుతెన్నుల జోలికి వెళ్ళకుండా కవులు-రచయితలు, అనువాదకుల వ్యక్తిగత-సాహిత్య పరిచయాన్ని సంక్షిప్తంగా నమోదు చేయాలని నిర్ణయించుకుని 'అక్షరశిల్పులు' రూపకల్పనకు సిద్ధపడ్డాను.

## ప్రోత్సాహం :

అక్షరశిల్పులు గ్రంథాన్ని తీసుకురావాలన్న ఆలోచన బాగుందంటూ ప్రొఫెసర్ షేక్ మస్తాన్ (అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం, అలీఘర్), డాక్టర్ యాకూబ్ (పరీక్షల నియంత్రణాధికారి, ద్రవిడ విశ్వవిద్యాలయం, కుప్పం), మహబూబ్ బాషా (చరిత్ర శాఖాధిపతి, బాబా సాహెబ్ భీంరావ్ అంబేద్కర్ కేంద్రీయ విద్యాలయం, లక్నో), ఆంధ్రప్రదేశ్ ముస్లిం సంక్షేమ సంఘాల సమాఖ్య అధ్యక్షులు డాక్టర్ ఎం.ఎ.రహమాన్ (విజయవాడ), ప్రముఖ కవులు డాక్టర్ ఇక్బాల్‌చంద్ (బెంగుళూరు), డాక్టర్ షేక్ ముహమ్మద్ ముస్తఫా, ఎసి దస్తగిరి (ప్రొద్దుటూరు), సత్యాగ్ని హుసేన్ (కడప), ప్రముఖ రచయిత ఇనగంటి దావూద్ (హైదరాబాద్), పాత్రికేయ మిత్రులు అబ్దుల్ వాహెద్ (గీటురాయి, వారపత్రిక, హైదరాబాద్), ఎం.డి షఫీ అహమ్మద్ (వార్త, దినపత్రిక, విజయవాడ), కవి మిత్రులు సయ్యద్ ఖుర్షీద్ (మహబూబాబాద్), షేక్ కరీముల్లా (వినుకొండ), షేక్ లతీఫ్ కుట్టీ (నెల్లూరు) తదితరులు ప్రోత్సహించారు.

## ఆహ్వానం :

ఈ మేరకు రాష్ట్రంలోని ముస్లిం కవులు, రచయితలు, అనువాదకుల వివరాలను ఆహ్వానిస్తూ 2008 మార్చిలో ప్రకటన విడుదల చేశాను. ఈ ప్రకటన రాష్ట్రంలోని అన్ని తెలుగు, ఉర్దూ పత్రికలలో ప్రచురితమైంది. జిల్లా కేంద్రాలలో ఉన్న మిత్రుల సహకారంతో వివిధ దినపత్రికల జిల్లా ఎడిషన్‌లలో కూడా ప్రకటన విడుదల చేయించాను. ఈ ప్రకటన రాష్ట్రంలోని 13 జిల్లాలలోని అన్ని దినపత్రికల జిల్లా ఎడిషన్లలో ప్రచురితం కావడమే కాకుండా ఆయా ప్రాంతాల నుండి వెలువడుతున్న ప్రాంతీయ పత్రికలలో కూడా ప్రచురితమై నా ప్రయత్నానికి బహుళ ప్రచారం కల్పించింది. ఆ ప్రయత్నాన్ని అంతటితో ఆపకుండా నాకు తెలిసిన ప్రతి ఒక్కరికి స్వయంగా తెలియజేశాను, లేఖలు రాశాను. దూరవాణి, సంచారవాణి ద్వారా విషయం తెలుపుతూ వివరాలను కోరాను. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో ఉన్న మిత్రుల ద్వారా కూడా ఈ విషయాన్ని కవులు, రచయితలకు తెలియపర్చే ప్రయత్నం చేశాను.

## ప్రతిస్పందన :

ఈ ప్రయత్నంలో భాగంగా, మార్చి 2008లో ఆరంభించిన సమాచార సేకరణ కార్యక్రమాన్ని 2010 మార్చి చివరి వరకు సాగించాను. ఈ ప్రయత్నంలో భాగంగా కవులు, రచయితలను తమ వివరాలు పంపాల్సిందిగా పలుమార్లు కోరాను. 'అక్షరశిల్పులు' గ్రంథాన్ని వెలువరిస్తున్న విషయం 'ఇండియా' మాసపత్రికలో వరుసగా 2010 ఫిబ్రవరి వరకు ప్రతి మాసం ప్రకటిస్తూ రావడం వలన విషయం తెలుసుకున్న చాలా మంది 'ప్రొఫార్మా' లో నిర్దేశించిన విధంగా తమ సమాచారాన్ని, ఫొటోలను, తమ రచనలను, గ్రంథాలను పంపించారు. ఈ విధంగా 2010 ఏప్రిల్ చివరి వారం వరకు కూడా పంపుతూ వచ్చారు. అతి కొద్దిమంది మాత్రం వారి సమాచారం కోరిన ప్రతిసారి పంపుతామని చెబుతూ వచ్చినా, చివరికి పంపలేదు. ఈ విధంగా కొందరు పంపకపోయినా అత్యధికులు సానుకూలంగా ప్రతిస్పందిస్తూ సహకరించడం వలన 'అక్షరశిల్పులు' 2010 ఏప్రిల్ మాసాంతానికి పూర్తి చేయగలిగాను.

## రూపకల్పనకు అనుసరించిన విధానం :

అక్షరశిల్పులు రూపకల్పన విధివిధానాల గురించి పలువురు సాహిత్యవేత్తలను సంప్రదించాను, మిత్రులతో చర్చించాను. ఈ విషయమై చాలా మందితో తర్జనభర్జనలు చేశాను. పర్యవసానంగా వెల్లడైన అభిప్రాయాలు పెద్దలు చేసిన సూచనలు, సలహాలను పాటిస్తూ ఒక నిర్ణయానికి వచ్చాను. ఆ నిర్ణయం ప్రకారంగా, వివిధాంశాల మీద గ్రంథాలు ప్రచురించిన కవులు, రచయితలు, అనువాదకులతోపాటుగా రాష్ట్రంలో వెలువడుతున్న తెలుగు పత్రికల్లో, కవితా సంకలనాలో కనీసం ఐదు (కవితలు, కథానికలు, కథలు, వ్యాసాలు) రచనలు ప్రచురితమైఉన్న వారి వివరాలను మాత్రమే పొందుపర్చాలని నిర్ణయించడమైనది. ఆ తరువాత పాటలు, నాటికలు, నాటకాలు రాసిన రచయితలను కూడా పరిగణలోకి

తీసుకుని వారి రచనలు ఆకాశవాణి, టివీ ఛానెల్స్‌లో ప్రసారమైఉన్నా, ప్రజా బాహుళ్యం సమక్షంలో పలుమార్లు ప్రదర్శించి ఉన్నా అటువంటి సాహిత్య ప్రక్రియలను రూపొందించిన రచయితలు, కవులను కూడా 'అక్షరశిల్పులు' లో స్థానం కల్పించాలన్న విధానాన్ని రూపొందించుకుని, పాటించాను.

## పుస్తకం గురించి :

ఈ పుస్తకంలో మొత్తం మీద 333 కవులు, రచయితలు, అనువాదకుల వివరాలను పొందుపర్చగలిగాను. అక్షరశిల్పులు కోసం 2008 మార్చిలో ప్రకటన విడుదల చేసిన్పటి నుండి చివరి వరకు సుమారు 242 మంది నేరుగా వివరాలు పంపారు. ఈ విధంగా నేరుగా నాకు అందిన, నేను ఇతర గ్రంథాల నుండి సేకరించిన వారి పూర్తి వివరాలను 'ఇందులోని కవులు, రచయితల జాబితా' లో పేర్కొన్నాను. ఈ కవులు, రచయితలు, అనువాదకులను సాధారణంగా ఏ పేరుతోనైతే పిలుస్తుంటారో ఆ పేర్లను పరిగణలోకి తీసుకుని ఆంగ్ల భాషలోని అక్షర క్రమం ప్రకారం వరుసగా పొందుపర్చాను. ఈ వివరాలు కాకుండా నాకు అందని, నాకు లభించని మరికొందరి కవులు, రచయితల రచనలు వివిధ గ్రంథాలలో ప్రచురితమై ఉన్నందున అటువంటి వారి వివరాలను కూడా ఆయా గ్రంథాల నుండి సేకరించాను. ఆ వివరాలను రచయిత పేరు, రాసిన కవిత/వ్యాసం శీర్షిక, అది ప్రచురితమైన గ్రంథం, ఆ గ్రంథం సంకలనకర్త/ప్రచురణకర్త తదితర వివరాలను 'అనుబంధం-1' క్రింద పట్టిక రూపంలో ఇచ్చాను. అక్షరశిల్పులు కోసం సమాచారం కోరుతూ విడుదల చేసిన ప్రకటనను 'అనుబంధం -2' గా, సమాచారం కోసం ప్రత్యేకంగా తయారు చేసిన 'ప్రొఫార్మా' 'అనుబంధం-3' గా పాఠకుల సమాచారం నిమిత్తం పేర్కొన్నాను.

## ధన్యవాదాలు :

నా ప్రయత్నాలకు చేయూతనిస్తూ నేను విడుదల చేసిన ప్రకటనను తమ జిల్లాలలోని వివిధ దినపత్రికల్లో ప్రచురితమయ్యేట్టు శ్రద్ధ తీసుకోవడం మాత్రమే కాకుండా, ఆయా జిల్లాల నుండి వెలువడుతున్న ప్రాంతీయ పత్రికలలో కూడా ఈ ప్రకటన ప్రచురితం అయ్యేట్టు మిత్రులు సయ్యద్ అబ్దుల్ సమద్ (నంద్యాల, కర్నూలు), షేక్ మహబూబ్ జాన్ (ఒంగోలు, ప్రకాశం), హబీబుర్ రెహమాన్ (విజయవాడ,కృష్ణా), ఎం.ఎ అఫ్జల్ (చాగల్లు,గోదావరి జిల్లాలు), సయ్యద్ మక్సూద్ (జహీరాబాద్,మెదక్), ఎం.డి ఫశీవుద్దీన్ (విశాఖపట్నం), ఎం.డి నజీరుద్దీన్ (నల్గొండ), షేక్ అబ్దుల్లా (శ్రీకాకుళం), వై.ఫక్రుద్దీన్ (అనంతపురం), శ్రీమతి సాజిదా సికిందర్ (మహబూబ్‌నగర్), సికిందర్ అలీఖాన్ (మదనపల్లి, చిత్తూరు), షేక్ అబ్దుల్ షకూర్ (నెల్లూరు), షేక్ మగ్బూల్ బాషా (కడప), షేక్ అబ్దుల్ అజీద్ (హైదరాబాద్), ఎం.ఏ సాలార్ (వినుకొండ, గుంటూరు), అబుల్ ఫౌజాన్ (కరీంనగర్) సహకరించారు.

నాకు ఉపయుక్తమని భావించిన వివిధ గ్రంథాలను, సమాచారాన్ని, డాక్టర్ బద్దేలి ఖాశిం సాహెబ్ (ప్రొద్దుటూరు, కడప), డాక్టర్ యన్.రామచంద్ర (పొద్దుటూరు), 'సాహిత్య నేత్రం' త్రైమాస పత్రిక సంపాదకులు షేక్ బేపారి రహమతుల్లా (శశిశ్రీ) లు అందించారు. ఆ తరువాత విశ్రాంత తెలుగు అధ్యాపకులు, షేక్ అలీ (కావూరు లింగంగుంట్ల, గుంటూరు జిల్లా) తన ఇంటికి ఆహ్వానించి తన గ్రంథాలయంలోని గ్రంథాలను, ప్రత్యేక సాహిత్య సంచికలను అందచేయడం మాత్రమే కాకుండా చాలా వివరాలు సేకరించి నాకు పంపారు. రాష్ట్రంలోని పలు ప్రాంతాలలో ఉన్న కవులు-రచయితల సమాచారం రాబట్టడంలో ఆయా ప్రాంతాలలోని షేక్ అబ్దుల్ హకీం జాని (తెనాలి), సయ్యద్ ఖుర్షీద్ (మహబూబాబాద్), ఎం.ఎ. సాలార్ (వినుకొండ), ఎండి. ఉస్మాన్ ఖాన్ (ఎన్. జగన్నాధపురం), ఎస్.పి గఫార్ (పోరుమామిళ్ళ) లాంటి మిత్రులు సహకరించారు. నా ప్రకటన వివిధ ఉర్దూ పత్రికల్లో కూడా ప్రచురితం అయ్యేట్టుగా రచయిత అబుల్ ఫౌజాన్ (కరీంనగర్) శ్రద్ధ తీసుకున్నారు. ఈ విధంగా నాకు సహాయపడిన ప్రతి ఒక్కరికి నా ప్రత్యేక ధన్యవాదాలు.

నా వినతి మేరకు అక్షరశిల్పులు గ్రంథానికి 'ముందుమాట' రాసిచ్చిన డాక్టర్ షేక్ మస్తాన్ (అలీఘర్), 'శుభాభినందనలు' తెలిపిన గురుతుల్యులు, ప్రముఖ పాత్రికేయులు డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వరరావు (హైదరాబాద్) లకు, నా ప్రతి పుస్తకాన్ని ఎంతో ఓపికతో చదివి విలువైన సలహాలు-సూచనలు అందచేస్తూ సహకరిస్తున్న మిత్రులు, సద్విమర్శకులు, ప్రముఖ రచయిత, నా ఆప్తమిత్రులు పెద్ది సాంబశివరావు (గుంటూరు), ఈ గ్రంథానికి చక్కని ముఖపత్రాలంకరణ గావించిన ప్రముఖ చిత్రకారులు వజ్రగిరి జెస్టిస్ (వినుకొండ), ఈ పుస్తకం గెటప్‌కు సంబంధించి పలు సూచనలు చేసిన ప్రముఖ చిత్రకారులు అబ్దుల్లా (విజయవాడ), గ్రంథ ప్రచురణకు సాంకేతిక సహాయం అందించిన మిత్రులు ఎన్. జయరాజ్ (శ్రీజయదీప్తి గ్రాఫిక్స్, వినుకొండ) గార్లకు నా కృతజ్ఞతలు.

ఈ గ్రంథం రూపుదిద్దుకోడానికి అవసరమైన సమాచారాన్ని పంపించి నా ప్రయత్నం సఫలమయ్యేందుకు సహకరించిన కవులు-రచయితలు-అనువాదకులు, నా ప్రతి ప్రయత్నానికి చేదోడు-వాదోడుగా నిలిచే నా భార్య శ్రీమతి షేక్ రమిజా బాను, అక్షరశిల్పులు ప్రచురణ బాధ్యత స్వీకరించిన 'ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్' ఛైర్మన్ హాజీ షేక్ పీర్ అహమ్మద్ (హైదరాబాద్) గార్లకు హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

◆◆◆

## ఇందులోని కవులు, రచయితల జాబితా

## ఇంకా ...

(కవితా సంకలనాలు, సావినీర్లు, పత్రికల్లో కవితలు, వ్యాసాలు రాసిన కవులు, రచయితల పేర్లు (అనుబంధం-1 లో సంక్షిప్త వివరాలు ఉన్నాయి)

ఎం.ఎ అజీజ్, అహమ్మద్ ఎస్, ఇషాక్ అహమ్మద్, ఎం.ఏ బాసిత్, షేక్ నాసర్ వలి, ఫరీదాబాను, రుబినా సుల్తానా, సయ్యద్ అమీర్, గౌసియా రెహమాన్, సయ్యద్ ఫిరోజ్, ఖదిర్, షేక్ పీరా బోరెవాలా, ఆజం, ఆఫ్రీన్, గులాం మహమ్మద్, సమి ఖాద్రి, షెహనాజ్ ఆజం, బాజి, ఎం.టి ఖాన్, రజియాబేగం, గౌస్, జబీర్ బాషా, అలీ ముహమ్మద్, మహబూబ్, షేక్ ఖాశిం, సియన్‌యఫ్ షరీఫ్, సర్తాజ్, నస్రీన్ బేగం, డిఎన్ బషీర్, ఎండి. మహబూబ్ అలీ, మహబూబ్ సాహెబ్ టి, హుస్సేన్ సాహెబ్ పి, అబ్దుల్ ఖాదర్ సాహెబ్, అబ్దుల్ గఫార్ ఖురేషి, షా ముహమ్మద్, మౌలానా ఎండి. యూసుఫ్ ఇస్లాహి, మున్నీ జావెద్, జావెద్, ఎస్. సిరాజుద్దీన్, హుస్సేన్, షంషాద్ బేగం, దస్తగిరి అహమ్మద్, ఎస్. యూసుఫ్ అలీ, ఎం. యూసుఫ్ అలీ, షేక్ జహంగీర్, ఎస్ఎం. షంషుద్దీన్, ఆసిఫా కౌసర్, ముచ్చెర్ల ఇబ్రహీం, షుకూర్, ఇలియాజ్, షఫీ, అబ్బాస్, ఎండి. యూకూబ్ బాషా, షేక్ హాజి నూరాని, షాహిర్, ఫరీదాబాను, మౌలానా నూరుల్లా ఖాద్రి, షేక్ అబ్దుల్ ఖాదర్, షేక్ మహబూబ్ ఖాన్, షేక్ నసీరుద్దీన్, జాకెరా, యాస్మిన్ బేగం, ఎమ్.ఎస్. బేగం, నూరుల్లా, వలి హుసేన్, బిలాల్, ఎస్. అహమ్మద్, పి.కరీమున్నీసా, పి. అజీజ్. ◆

**అబ్బాదుల్లా :** అబ్బాదుల్లా కడప జిల్లా కొమ్మర్ల కాల్వ గ్రామంలో 1937 నవంబరు 24న రసూల్‌బి, షేక్ మహబూబ్ సాహెబ్‌లకు జన్మించారు. బిఎ (ఆనర్స్) చేసి రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగంలో చేరి రాష్ట్రంలోని పలు ప్రాంతాలలో పనిచేశారు. 1976లో రచనా వ్యాసంగాన్ని ఆరంభించి 'ధర్మ సంస్థాపన' అనువాద గ్రంథాన్ని ప్రచురించారు. ఆ క్రమంలో 20కి పైగా ఉర్దూ ఆధ్యాత్మిక గ్రంథాలను తెలుగులోకి అనువదించారు. 1992లో 'ఇస్లాం ప్రబోధిని' (నాలుగు సంపుటాలు) అనువాద గ్రంథం మంచి పేరు తెచ్చి పెట్టింది. ధార్మిక, సామాజిక అంశాల మీద వ్యాసాలు రాశారు. 'తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్' సంస్థకు సంచాలకులుగా పది సంవత్సరాలు బాధ్యతలు నిర్వహించారు. ప్రింట్ ఎలక్ట్రానిక్ మీడియాలో యువతకు అవకాశాలు కల్పించాలన్న లక్ష్యంతో 'తెలుగు స్కూల్ ఆఫ్ జర్నలిజం అండ్ మాస్ కమ్యూనికేషన్' సంస్థను ఆరంభించి 2009 వరకు మార్గదర్శకం వహించారు. 'గీటురాయి' వారపత్రికను దినపత్రికగా తీర్చిదిద్దాలన్న సంకల్పంతో ప్రయత్నించారు. 2009 సెప్టెంబర్ 27న అబ్బాదుల్లా హైదరాబాద్‌లో కన్నుమూశారు.



**అబ్బాస్ ముహమ్మద్ :** వరంగల్ జిల్లా జాఫర్‌నగర్ మండలం తమ్మడపల్లి గ్రామంలో 1975 జనవరి 16న జన్మించారు. తల్లి తండ్రులు : మొహిద్దీన్ బీ, ఇస్మాయిల్ సాహెబ్. చదువు: బి.ఎ. వ్యాపకం: సామాజిక కార్యకర్త. 1975లో సాహిత్య రంగ ప్రవేశం. కవితలు, వ్యాసాలు ప్రచురితం. రచనలు: 'భారత దేశం ముస్లింల ఆర్థిక సామాజిక, విద్యా స్థితిగతులు' (జస్టిస్ రాజేంద్ర సచార్ కమిటీ నివేదిక సంక్షిప్త అనువాదం), లక్ష్యం: సమసమాజం దిశగా ప్రజలను చైతన్య వంతుల్ని చేయడం. **చిరునామా: ఎం.డి అబ్బాస్, 1-7-139/44, ఎస్.వి.బి. స్మారక కేంద్రం, ఎస్.ఆర్.కె.నగర్, రిసాలగడ్డ, జమిస్తాన్‌పూర్, హైదరాబాద్-500020, సంచారవాణి: 99599 05016.** Email: mohammedabbas @yahoo.com









**అబ్దుల్ ఆజాద్ ఖాన్ పఠాన్ :** ప్రకాశం జిల్లా రాచర్ల గ్రామంలో 1971 జూన్ ఒకటిన జన్మించారు. తల్లితండ్రులు: ఇమాంబి, మహబూబ్ ఖాన్. చదువు: బి.ఎ(తెలుగు)., విద్వాన్ (హిందీ). 2003లో ప్రచురితమైన 'ఓ గులాబీ ప్రేమగీతం' కవితతో సాహిత్య వ్యాసంగం ఆరంభం. కవితలు, వ్యాసాలు పత్రికలలో ప్రచురితం. పలు సత్కారాలు పొందారు. సాహిత్య-సాంస్కృతిక కార్యక్రమాల ఏర్పాటు పట్ల ఆసక్తి. మతసామరస్యం ప్రధాన ప్రాతిపదికగా సర్వమత సమ్మేళనాల నిర్వహణ పట్ల ప్రత్యేక శ్రద్ధ. ప్రస్తుతం ప్రజాశక్తి దినపత్రికకు విలేఖరిగా పనిచేస్తున్న ఆయనకు సామాజిక, రాజకీయాంశాల మీద రచనలు చేయడం ఇష్టం. **చిరునామా: పఠాన్ అబ్దుల్ ఆజాద్ ఖాన్, రాచర్ల గ్రామం, రాచర్ల మండలం, ప్రకాశంజిల్లా, 523368, దూరవాణి: 08405-247414, సంచారవాణి: 93916 74562.**



**అబ్దుల్ అజీజ్ ముహమ్మద్ :** విశాఖపట్నం జిల్లా ఎస్.రాయవరంలో 1970 మార్చి 21న జన్మించారు. తల్లితండ్రులు: మదీనా, కాశింబీబి. ఉద్యోగం: విశాఖపట్నం నావెల్‌డాక్ యార్డ్‌లో టెక్నీషియన్. ముస్లిం గురువు షేక్ సత్తార్ ప్రోత్సాహంతో 1979లో 'శంఖుస్థాపన' కవిత రాయడంతో సాహిత్యరంగ ప్రవేశం. కలంపేర్లు: మహోదయ, హరిఃఓమ్. కవితలు, కథానికలు, వ్యాసాలు ప్రచురితం. పలు కవితలు ఆంగ్లం లోకి అనువాదం. 'శంఖుస్థాపన' కవిత 2000లో ఆంగ్లంలోకి, 'గుజరాత్‌గాయం' కవితా సంపుటిలోని 'ఖబర్దార్' కవిత పలు జాతీయ భాషల్లో తర్జుమా అయ్యింది. అవార్డులు- పురస్కారాలు: సాహితీ సరస్వతి (విశాఖ పట్నం), వచనకవితా సురభి (మచిలీపట్నం). ఆధ్యాత్మిక ప్రసంగాలు చేయడం, శ్రీమద్రామాయణం, శ్రీమద్భాగవతం, హరికథలు చెప్పడంలో దిట్ట. రచనలు: హరి:ఓమ్ (1997) తదితర కవితా సంపుటాలు. లక్ష్యం: త్యాగరాజు, అన్నమా చార్యులు, రామదాసు కీర్తనల ఆలాపన, పరిశోధన, ప్రసంగాల నిర్వహణ. రచనల ద్వారా ఆధ్యాత్మిక ప్రచారం సాగించాలని, పరమత సహనం, మత సామరస్యం, ప్రగతిశీలత సాధించాలన్నది ప్రధాన లక్ష్యం. **చిరునామా: ముహమ్మద్ అబ్దుల్ అజీజ్, 15-7-12, సంతోషిమాత కోవెల వీధి, నిదానందొడ్డి, అనకాపల్లి -531002, విశాఖపట్నం జిల్లా, సంచారవాణి: 92963 58324.**



**అబ్దుల్ బాసిత్ షేక్ :** ఖమ్మం జిల్లా కొత్తగూడెం మండలం రుద్రాంపూర్‌లో 1968

జూన్ 5న జన్మించారు. తల్లితండ్రులు: షేక్ మొహినుద్దీన్, మీర్ హాజరా బేగం. చదువు: సివిల్ ఇంజనీరింగ్‌లో డిప్లొమా. వృత్తి: విద్యాబోధన. 2000 నుండి రచనా వ్యాసంగం ఆరంభమై సుమారు పలు వ్యాసాలు, కథలు వివిధ పత్రికలలో చోటుచేసుకున్నాయి. 'గీటురాయి' వారపత్రికలో 2005లో రాసిన 'అమ్ముడు బోయిన అమ్మ' వ్యాసానికి మంచి గుర్తింపు వచ్చింది. ఉర్దూ గ్రంథాన్ని 'ఖుర్‌ఆన్ నాలుగు ముఖ్య విషయాల మీద విశ్లేషణ' (2010) పేరుతో తెలుగులోకి అనుదించారు. హిందీలో రాసిన పలు వ్యాసాలు, కవితలు 'కాంతి' (ఢిల్లీ) హిందీ మాసపత్రికలో ప్రచురితం. లక్ష్యం: ఇస్లాం సందేశ ప్రచారం. **చిరునామా: షేక్ అబ్దుల్ బాసిత్, ఇం.నం. 3-84, రుద్రాంపూర్ -507119, కొత్తగూడెం మండలం, ఖమ్మం జిల్లా, సంచారవాణి: 92471 72968.**



**అబ్దుల్ గఫూర్ ముహమ్మద్ మౌల్వీ :** ప్రకాశం జిల్లా కంభం జన్మస్థలం. చదువు: మున్షీ, ఫాజిల్. ఉర్దూ పండితులు. ఉర్దూ, అరబిక్, తెలుగు భాషల్లో మంచి ప్రవేశం. అరబ్బీ నుండి తెలుగులోకి ఖుర్ ఆన్ గ్రంథాన్ని అనువదించారు. ఈ అనువాదం 1949లో రెండు భాగాలుగా వెలువడింది. రచనలు : జగత్ప్రవక్త, మిఫ్‌కాతెషరీఫ్ (రెండు సంపుటాలు), 'ముస్లిం ప్రభువులు'.

**అబ్దుల్ హకీం జానీ షేక్ :** గుంటూరు జిల్లా తెనాలిలో 1963 జనవరి ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ మహబూబ్‌బీ, షేక్ ఫరీద్ సాహెబ్. చదువు: బి.ఎ., బిఎడ్. ఉద్యోగం: తెలుగు ఉపాధ్యాయులు. 1976లో విద్యార్థిగా 'కన్నందుకు శిక్ష' నాటిక రాయడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభించి 1991 నుండి 2009 వరకు తెలుగు పత్రికలలో వివిధాంశాల మీద సుమారు 12 వందల వ్యాసాలు, కవితలు ప్రచురితం. బాల సాహిత్యం పట్ల ప్రత్యేక ఆసక్తితో ఆరు పుస్తకాలు వెలువరించారు. మరో 20 గ్రంథాలు త్వరలో వెలువడనున్నాయి. వయోజనుల కోసం రాసిన 18 గ్రంథాలు ప్రచురితం అయ్యాయి. ఆకాశవాణి ద్వారా కవితలు, కథానికలు, ప్రసారం. అవార్డులు -పురస్కారాలు: సమతారావు బాల సాహితీ పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయం ధర్మనిధి పురస్కారం, విశ్వదాత అవార్డు (2007), ఆంధ్ర సారస్వత సమితి పురస్కారం (2009). లక్ష్యం: మానవీయ సంస్కృతీ-సంప్రదాయల పట్ల అవగాహన కల్పిస్తూ, బాలబాలికల అభ్యున్నతికి ఉత్తమ సాహిత్య సృష్టి చేయటం. **చిరునామా: షేక్ అబ్దుల్ హకీం జానీ, ఇంటి నం.**









**2-33-24, గాంధీనగర్, లెనిన్ రోడ్డు, తెనాలి-522 201, గుంటూరు జిల్లా. సంచారవాణి: 99494 29827.**

**అబ్దుల్ హఖ్ షేక్ :** ప్రకాశం జిల్లా నేకునాంబాద్‌లో 1942 జూలై ఒకటిన జననం. తల్లి తండ్రులు: షేక్ ఫాతిమాబీ, షేక్ ఖాశిం సాహెబ్. చదువు: ఎం.ఏ., బి.ఇడి. ఉద్యోగం: విశ్రాంత తెలుగు అధ్యాపకులు. (ప్రభుత్వ జూనియర్ కళాశాల ,పోరుమామిళ్ళ, కడప జిల్లా) 1998 నుండి 'వార్త' దినపత్రికలో 'ఆధ్యాత్మికం' శీర్షికకు వ్యాసాలు రాయడం ద్వారా రచనా వ్యాసాంగం ఆరంభం. ఆ తరువాత 2007 నుండి వార్తలో 'దివ్య' శీర్షిక క్రింద వారం వారం వ్యాసాలు అందజేత. రాష్ట్రంలోని వివిధ పత్రికలలో వ్యాసాలు, కథానికలు ప్రచురితం. 2009 నాటికి మొత్తం మీద ఆరువందల వ్యాసాలు ప్రచురితం. అవార్డులు-పురస్కారాలు: రంజాన్ పురస్కారం (హైదరాబాద్). రచనలు: 1. సన్మార్గ సౌరభాలు, 2. సాఫల్య సోపానాలు, 3. సందేశ సుగంధాలు (వ్యాస సంపుటాలు) 4. మహాప్రవక్త పవిత్ర చరిత్ర. 5. దైవప్రవక్తల చరిత్ర. లక్ష్యం: ఆధ్యాత్మిక సౌరభాలను అక్షర రూపంలో నలుదిశలకు వ్యాపింపచేయడం. **చిరునామా: ఇంటి నం.17/120, కొత్తవీధి, పోరుమామిళ్ళ-516193, కడపజిల్లా, సంచారవాణి: 9885712400, 9441403359.** Email: abdulhuqs@gmail.com



**అబ్దుల్ జలీల్ షేక్ :** కృష్ణా జిల్లా విజయవాడలో 1953 మే 15న జననం. తల్లి తండ్రులు: షేక్ అమీనాబీ, షేక్ అబ్దుల్ గఫూర్. చదువు: పదవ తరగతి. వృత్తి: వ్యాపారం -ధార్మిక సేవ. ప్రస్తుతం గుంటూరు జిల్లా నులకపేట 'నూరాని జామియా మస్జిద్' పేష్ ఇమాం. 2005 నుండి రచనా వ్యాసంగం ఆరంభించి ఉర్దూ-అరబిక్ భాషలలోని ధార్మిక గ్రంథాలను తెలుగులోకి అనువదించి ప్రచురిస్తున్నారు. రచనలు: 1.'దాన మహిమలు' (2005), 2.'పవిత్ర ఖుర్‌ఆన్ (తాత్పర్యము, 2009), 3. ఖుర్‌ఆన్-హదీస్ మరియు అహ్‌లె హదీస్ ధర్మము (2010). లక్ష్యం: ప్రజలలో ముఖ్యంగా ముస్లిం ప్రజానీకంలో చిట్లం కట్టుకుపోయిన ధార్మిక అలసత్వం, ఉదాసీనతను పోగొట్టాలన్నది. **చిరునామా: షేక్ అబ్దుల్ జలీల్, పేష్ ఇమాం: నూరాని జామియా మస్జిద్, రాజీవ్ కాలనీ, నులకపేట- 522502, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా. సంచారవాణి: 9948151159.** Email: jaleelshaik9 @gmail.com



**అబ్దుల్ ఖాదర్ షేక్ :** కడప జిల్లా ప్రొద్దుటూరు నియోజకవర్గం, కొర్రపాడులో 1942లో జన్మించారు. హిందీ పండితులు. తెలుగు, ఆంగ్లం, హిందీ భాషల్లో ప్రవేశం. గేయాలు, పాటలు రచించి స్వయంగా పాడారు. నాటకాలు రాశారు, నటించారు. ఇతర భాషల నుండి పలు గ్రంథాలను తెలుగులోకి అనువదించారు.

**అబ్దుల్ ఖాదర్ వేంపల్లి :** చిత్తూరు జిల్లా కలికిరి గ్రామంలో 1945 జూలై ఒకటిన జన్మించారు. తల్లితండ్రులు: వేంపల్లి హుస్సేన్ బీబి, హుసేన్. చదువు: ఎం.ఏ, బి.ఇడి. ఉద్యోగం: చిత్రలేఖనం ఉపాధ్యాయునిగా ఆరంభమై తెలుగు అధ్యాపకునిగా ఉద్యోగ విరమణ. 1966లో 'ఆంధ్రప్రభ' వారపత్రికలో ప్రచురితమైన 'జీవితచక్రం' కవితతో రచనా వ్యాసంగం ఆరంభం. రచనలు: 1. చినుకు (వచన కవితా సంపుటి), 2. మల్లెరేకు (కథాసంపుటి), 3. వాకిలి (సాహిత్య వ్యాసాలు), 4. మేఘం (వచన కవితా సంపుటి), 5. లోగిలి (శతకం), 6. మెరుపు. వక్త. అష్టావధానాలు, నాట్యావధానాలలో భాగస్వామ్యం. చిత్రకారుడు, నటుడు. కవిగా, నటుడిగా పలు సత్కారాలు అందుకున్నారు. అవార్డులు- పురస్కారాలు: రంజని కుందుర్తి జాతీయ సాహితీ పురస్కారం (1999), ఎక్స్‌రే అవార్డు (2000), పులికంటి సాహితీ సంస్కృతీ పురస్కారం (2003), ప్రవాసాంధ్ర వసంతోత్సవ పురస్కారం (2004), ఆంధ్రప్రదేశ్ అధికార భాషా పురస్కారం (2005). లక్ష్యం: ప్రజలను మానవతా మూర్తులుగా తీర్చిదిద్దే ప్రయత్నం. **చిరునామా: వేంపల్లి అబ్దుల్ ఖాదర్, ఇంటి నం. 1-22సి, కొత్తపేట ఎక్స్‌టెన్షన్, కలికిరి-517234, సంచారవాణి: 94407 56131, దూరవాణి: 08586-256084.**.



**అబ్దుల్ ఖలీల్ షేక్ :** ప్రకాశం జిల్లా చీరాలలో 1970 ఆగస్టు 15న జననం. తల్లి తండ్రులు: షేక్ అబ్దుల్ రహీం, సకినా బీబిజాన్. చదువు: డిప్లొమా ఇన్ మెకానికల్ ఇంజనీరింగ్. ఉద్యోగం: ఆటోకాడ్ ఇంజనీర్ (ఐటిసి, చీరాల). ప్రముఖ రచయిత ఇనగంటి దావూద్ ప్రేరణతో రచనా వ్యాసంగం ఆరంభం. వివిధ పత్రికలలో కవితలు, వ్యాసాలు ప్రచురితం. దళితులు, ముస్లింలు, బిసి వర్గాల సమస్యలను ప్రతిబింబిస్తూ వాటి పరిష్కారాలను సూచిస్తూ, ఉద్యమ స్ఫూర్తిని కలుగజేస్తూ రాసిన వ్యాసాలకు, గుర్తింపు. **చిరునామా: షేక్ అబ్దుల్ ఖలీల్, ఢిల్లీ-రాజస్థాన్ ట్రాన్స్‌పోర్టు కంపెనీ, ఎన్ఆర్ అండ్ పిఎం ఉన్నత పాఠశాల, రామస్థంభం రోడ్డు, చీరాల-523155, ప్రకాశం జిల్లా.**









**అబ్దుల్ లతీఫ్ షేక్ :** ఖమ్మం జిల్లా ఖమ్మంలో 1954 ఏప్రిల్ 14న జననం. తల్లి తండ్రులు: షేక్ జైనబ్బీ, ఖాశిం సాహెబ్. చదువు: నాల్గవ తరగతి. వ్యాపకం: వ్యాపారం, ఖమ్మంలోని మోతి మస్జిద్‌లో పేష్ ఇమాంగా బాధ్యతల నిర్వహణ. 2007 నుండి రాస్తున్న ధార్మిక వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురితం. 'గీటురాయి' వార పత్రికలో రాసిన వ్యాసాలు గుర్తింపు తెచ్చాయి. లక్ష్యం: మార్గం తప్పిన సమాజాన్ని సాహిత్యం ద్వారా సంస్కరించి ఇస్లాం ప్రబోధించిన సత్యమార్గం వైపు మళ్ళించాలన్నది. **చిరునామా: షేక్ అబ్దుల్ లతీఫ్, ఇంటి నం. 1-9-35/48/11, ఇస్లాంపేట, ఖమ్మం -507003, ఖమ్మం జిల్లా, సంచారవాణి: 96403 51551**,



**అబ్దుల్ నూర్‌బాషా షేక్ డాక్టర్ :** గుంటూరు జిల్లా కంకరపాలెంలో 1956 జూన్ 4న జననం. తల్లితండ్రులు: రోషన్‌బీ, మౌలాలి. చదువు: ఎం.కాం., పి.హెచ్‌డి. ఉద్యోగం: ఆచార్య నాగార్జున విశ్వ విద్యాలయంలో అధ్యాపకులు. మూడు దశాబ్దాలుగా తెలుగు, ఆంగ్ల భాషల్లో రచనలు చేస్తున్నారు, పలు వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురితం. రాజకీయ-ఆర్థిక అంశాలను విశ్లేషిస్తూ ఏడు గ్రంథాలు రాసి వెలువరించారు. లక్ష్యం: ప్రజల్ని తమ హక్కులు, బాధ్యతల దిశగా చైతన్యవంతుల్ని చేయడం. **చిరునామా: డాక్టర్ అబ్దుల్ నూర్‌బాషా, ఇంటి నం. 9-103, మంగళగిరి - 522503, గుంటూరు జిల్లా, సంచారవాణి: 94901 75786, దూరవాణి: 232913,** Email: abdulnoorbasha_nu@yahoo.co.in



**అబ్దుల్ రఫీ షేక్ :** ప్రకాశం జిల్లా యర్రగొండపాలెంలో 1973 జూలై 10న జననం. తల్లితండ్రులు: షేక్ సిలార్‌బీ, షేక్ సిలార్ సాహెబ్. చదువు: బి.ఎ., ఎం.ఎ (హిందీ). ఉద్యోగం: ఈటీవి (హైదరాబాద్). 'గీటురాయి' వారపత్రికలో 2005లో వ్యాసం రాయడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభమై వివిధ పత్రికలలో కవితలు, వ్యాసాలు ప్రచురితం. అక్షరాయుధంతో సామాజిక రుగ్మతలను తొలగించాలని. సత్సమాజ స్థాపనకు తోడ్పడాలన్నది లక్ష్యంగా కృషి. **చిరునామా : షేక్ అబ్దుల్ రఫీ, ఇంటి నం. 16-22, నాలుగు స్థంభాల వీధి, యర్రగొండపాలెం-523 327, ప్రకాశం జిల్లా, సంచారవాణి: 93944 89256**. Email: rafi.shaik.abdul @gmail.com.



**అబ్దుల్ రహమాన్ సయ్యద్ :** తూర్పుగోదావరి కాకినాడలో 1980 ఆగస్టు 30న జననం. తల్లితండ్రులు: ముంతాజ్ బేగం, సయ్యద్ అబ్దుల్ హమీద్. చదువు: బిఎస్సీ., బి.టెక్. ఉద్యోగం: ఇంజనీర్ (గయాన్ సొల్యూషన్స్ ఇండియా ప్ర. లిమిటెడ్, కాకినాడ). రచనలు 1. వసుధైక కుటుంబం (2007), 2. ఖుర్ ఆన్ అండ్ సైన్స్ (2008) లక్ష్యం : శాస్త్రవిజ్ఞాన గ్రంథాల ద్వారా ఆధ్యాత్మిక గ్రంథాలలోని శాస్త్రీయ విజ్ఞానాన్ని సామాన్య ప్రజానీకం చెంతచేర్చడం. **చిరునామా: సయ్యద్ అబ్దుల్ రహమాన్, ఇంటి నం.7-1-10, రామారావుపేట, గాంధీ నగర్, కాకినాడ-533003, తూర్పు గోదావరి జిల్లా, సంచారవాణి: 98480 49486**, Email: rahman@gainsolutions.com



**అబ్దుల్ రహిమాన్ సయ్యద్ :** కడపజిల్లా రాజంపేట తాలూకా నల్లపరెడ్డిపేటలో 1940 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: హజరాబీ, గులాం మొదీన్ సాహెబ్. చదువు: బి.ఇ. రాష్ట్ర ప్రభుత్వఉద్యోగం నుండి 2001లో విరమణ. 1962లో 'దీనబాలిక' కవితతో ఆరంభమై కవితలు, వ్యాసాలు, కథానికలు స్థానిక పత్రికలలో ప్రచురితం. బిరుదులు: కవిహంస, కవితేజ, సరసత్కవి. లక్ష్యం: సందేశాత్మక రచనలు ప్రజానీకానికి అందివ్వాలన్నది. **చిరునామా : సయ్యద్ అబ్దుల్ రహిమాన్, ఇంటి నం.5/637, గాంధీ మెమోరియల్ క్లబ్ వద్ద, రాజంపేట-516115, కడపజిల్లా, సంచారవాణి: 94402 45751, దూరవాణి: 08562-240860**, Email: engrrahiman@yahoo.com



**అబ్దుల్ రజాక్ :** గుంటూరు జిల్లా తుళ్ళూరు మండలం మందడం గ్రామంలో 1968 మే ఆరున జననం. తల్లితండ్రులు: ఉండవల్లి మహాలక్ష్మీ (శారా), ఉండవల్లి కోటయ్య (అబ్రహం). చదువు: బి.ఎ., బి.ఇడి. ఉద్యోగం: ఉపాధ్యాయులు.'గీటురాయి' వారపత్రికలో 2008లో 'కాలచక్రం సాక్షి' వ్యాసంతో రచనా వ్యాసాంగం ఆరంభం. పలు సుదీర్ఘ కవితలు, కథలు, వ్యాసాలు, ప్రధానంగా గీటురాయి పత్రికలో, వివిధ పత్రికలలో ప్రచురితం అయ్యాయి. లక్ష్యం: సత్య సందేశాన్ని అందించడం. **చిరునామా: అబ్దుల్ రజాక్, ఇంటి నం. 21-68, తాడికొండ-522236, గుంటూరు జిల్లా, సంచారవాణి: 9392530916**, Email: abdulrazak236@gmail.com.









**అబ్దుల్ రషీద్ మహమ్మద్ :** వరంగల్ జిల్లా దేశాయిపేటలో 1952 ఏప్రిల్ రెండున జననం. తల్లితండ్రులు: సారాబి, మహమ్మద్ అబ్దుల్ సత్తార్. కలంపేరు: అబ్దుర్రషీద్. చదువు: 5వ తరగతి. వ్యాపకం: అధ్యయనం, రచన, ప్రచురణ, ప్రసంగాలు. 1989లో 'దేశం ప్రమాకరమైన దిశ-మేధావి వర్గం బాధ్యతలు' అను ఉర్దూ నుండి తెలుగులోకి అనువదించిన తొలి గ్రంథం వెలువడింది. అప్పటినుండి రచనా వ్యాసంగంలో పూర్తిగా నిమగ్నం. రాష్ట్రంలోని వివిధ పత్రికలలో ధార్మిక వ్యాసాలు, కవితలు, విశ్లేషణలు ప్రచురితం. సాక్షి దినపత్రికలో 'ఇస్లాం సందేశం' కాలమ్ నిర్వహణ. స్వతంత్ర రచనలు: 1.జిహద్, 2. అబద్ధ ప్రవక్త మీర్జాగులాం అహ్మద్ ఖాదియాని. ఈ గ్రంథాలలో 'జిహాద్' మంచి గుర్తింపు తెచ్చింది. తెలుగు అనువాదాలు: 1. భారతీయ సమాజ సంస్కరణకు సమాయత్తమవ్వండి, 2. సర్వలోక మహోపకారి, 3. విశ్వమానవ ప్రేమ సౌభ్రాతృత్వాలు, 4. మీరు ఇస్లాం అధ్యయనం ఎందుకు చేయాలి?, 5. ప్రియమైన అమ్మకు, 6. ఇస్లాం సందేశం, 7.అధర్మ సంపాదనకు దూరం, 8. యుగ పురుషుడు సయ్యద్ మౌదూది, 9. నమాజు పుస్తకం, 10. మీ సొత్తు మీ పరం, 11. ఇస్లాం ధర్మ నియమాలు (ఈ పుస్తకం 2009 వరకు లక్షా నలభైవేల కాపీల ముద్రణ జరిగింది), 12. దరూద్ శుభాలు, 13. ఖుర్ఆన్ దైవ గ్రంథం, 14. ఖుర్అన్ బోధన వాచకం, 15. ఖుర్ఆన్ వాచకం, 16. లక్ష్యం వైపుకు. లక్ష్యం: ఇస్లాం పట్ల ఉన్న అపోహలను దూరం చేయడం. **చిరునామా: మహమ్మద్ అబ్దుల్ రషీద్, ఇంటి నం.19-2-23/ ఎం19, మక్కా కాలనీ, కాలాపత్థర్, హైదరాబాద్-500063, సంచారవాణి: 98485 16163,** Email: islamiclit@gmail.com



**అబ్దుల్ సమద్ షేక్ :** కర్నూలు జిల్లా సిరివెళ్ళ గ్రామంలో 1958 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ అమినాబీ, షేక్ అబ్దుల్ షుకూర్. చదువు: బికాం. ఉద్యోగం: భారత్ సంచార్ నిగం లిమిటెడ్‌లో సీనియర్ టెక్నికల్ సూపర్‌వైజర్, నంద్యాల. 1979లో 'యోజన' మాసపత్రికలో 'వరకట్నం' వ్యాసం రాయడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభమై వివిధ పత్రికలలో పలు కథానికలు, కథలు, వ్యాసాలు, కవితలు ప్రచురితం. 1983లో 'నారద' మాసపత్రికలో రాసిన 'ఉద్యోగ పర్వం' కవిత గుర్తింపును తెచ్చిపెట్టింది. లక్ష్యం: ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడం. **చిరునామా: షేక్ అబ్దుల్ సమద్, ఇంటి నం. 29/117, యస్.బి.ఐ కాలనీ రోడ్డు, నంద్యాల-518501, కర్నూలు జిల్లా. సంచారవాణి: 94406 55753**, Email: samadalif@ yahoo.com



**అబ్దుల్ సత్తార్ :** కర్నూలు జిల్లా నంద్యాలలో 1937 జూలై ఒకటిన జననం. తల్లి తండ్రులు: ఫక్రుబీ, హుస్సేన్ పీరాన్. చదువు: ఎస్.ఎస్.ఎల్.సి. ఉద్యోగం: రాష్ట్ర పోలీసుశాఖలో 1962లో చేరిక, 1990లో విరమణ. కలం పేరు: మణి. 1974లో 'ఈనాడు' దినపత్రికలో ప్రచురితమైన కవిత ద్వారా రచనా వ్యాసాంగం ఆరంభం. వివిధ పత్రికలలో కవితలు, కథానికలు, గల్పికలు, ప్రధానంగా ధార్మిక వ్యాసాలు ప్రచురితం. మంచి వక్త, పలు టీవీ ఛానెల్స్‌లో ధార్మిక ప్రసంగాలు. తెలుగు పత్రికలలో ధార్మిక శీర్షికల నిర్వహణ. లక్ష్యం: దైవభీతి పునాదుల మీద సత్సమాజ నిర్మాణానికి రచనల పరంగా చేయూత. **చిరునామా: అబ్దుల్ సత్తార్, ఇంటి నం. 87-966/2, టెలికాం నగర్, కర్నూలు-518002, కర్నూలు జిల్లా. సంచారవాణి: 92473 13496,**



**అబ్దుల్ వాహెద్ :** పశ్చిమ గోదావరి జిల్లా భీమవరంలో 1972 ఏప్రిల్ 10న జననం. తల్లితండ్రులు: అఖ్తరున్నీసా బేగం, మహమ్మద్ సాబిర్. చదువు: సాంకేతిక విద్య. ఉపాధి: వెల్డింగ్ టెక్నీషియన్. 2003లో ప్రచురితమైన వ్యాసం ద్వారా రచనా వ్యాసాంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికలలో పలు ధార్మిక వ్యాసాలు ప్రచురితం. 2007 ఏప్రిల్‌లో రాసిన 'మానవజీవిత పరమార్థం' వ్యాసం గుర్తింపు తెచ్చింది. ఆకాశవాణిలో పలు ధార్మిక ప్రసంగాల ప్రసారం. స్వయంగా రూపొందించిన ధార్మిక ప్రసంగాల క్యాసెట్ వెలువడింది. లక్ష్యం: ఆధ్యాత్మిక దృష్టికోణం నుండి మానవత్వం నిజరూపాన్ని పూర్తి స్థాయిలో మనుషులకు ఎరుకపర్చాలన్నది. **చిరునామా: అబ్దుల్ వాహెద్, ఇంటి నం. 15-22-7/4, 18వ వార్డు, పాలూరి వారి వీధి, భీమవరం-534201.**



**అబ్దుల్లా ముహమ్మద్ :** నల్గొండ జిల్లా పెరిక కొండారంలో 1956 ఆగస్టు రెండున జననం. తల్లితండ్రులు: సైదాబీ, ముహమ్మద్ ఖాశిం. కలంపేరు: ఎండి చైతన్య (ఎండి. సౌజన్య స్ఫూర్తితో) చదువు: బి.ఏ. ఉద్యోగం: రాష్ట్ర పోలీసుశాఖ, (సంపాదకులు: 'సురక్ష' మాసపత్రిక). 1972లో 'యువజన' మాసపత్రికలో ప్రచురితమైన 'వృక్షం' కవిత ద్వారా రచనా వ్యాసంగం ఆరంభమై వివిధ పత్రికలలో కవితలు, కథలు, వ్యాసాలు, సాహిత్య వ్యాసాలు చోటు చేసుకున్నాయి. పలు నాటికలు ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ప్రసారం. రచనలు:









1.పోలీసులకు వ్యక్తిత్వ వికాసం (2004), 2.పోలీసు వాచకం (1994), 3.మహిళలు-బాలికల అక్రమ రవాణా (అనువాదం, 2008), 4.ఓ ప్రధాన మంత్రి హత్య (ఇందిరా గాంధీ హత్యోదంతం, అనువాదం, 1995); నవలలు: 1.సత్యభామ శపథం (1990), 2.శిథిల గుహలు (1990), 3.కాల్‌గరళ్ (1992), లక్ష్యం: సామాజిక రుగ్మతల నుండి సమాజాన్ని విముక్తం చేయడానికి సాహిత్యం సాధనంగా కృషి. **చిరునామా: మహమ్మద్ అబ్దుల్లా, ప్లాట్ నం.1, బ్లాక్ నం.12, పోలీసు క్వార్టర్స్, యూసుఫ్ గూడా, చెక్ పోస్టు, హైదరాబాద్-500045. సంచారవాణి: 99496 68250.** Email: moha.mails@yahoo.com

**అబుల్ ఇర్ఫాన్ :** గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా తొండపిలో 1945 జూన్ 15న జననం. తల్లితండ్రులు: షేక్ బడే సాహెబ్, షేక్ రమీజాబీ. చదువు: పియుసి. ఉద్యోగం: 1963లో రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగంలో చేరి 1980లో స్వచ్ఛందంగా రాజీనామా. గత మూడు దశాబ్దాలుగా హైదరాబాద్ నుండి వెలువడుతున్న 'గీటురాయి' వారపత్రికలో వివిధ బాధ్యతలను నిర్వహిస్తూ పలు ప్రత్యేక శీర్షికలను నిర్వహించారు, వందలాది వ్యాసాలు రాశారు. 1976లో 'ఆధ్యాత్మిక జీవితం' అను తొలిగ్రంథం ప్రచురణ. అప్పటినుండి వివిధ పత్రికలలో వ్యాసాలు, కవితలు, కథానికలు ప్రచురితం. 'గీటురాయి వారపత్రికలో ప్రచురితమైన 'టార్చ్‌లైట్' వ్యాసానికి మంచి స్పందన లభించింది. 1997లో స్వయంగా ఇస్లామిక్ రిసోర్స్ సెంటర్ (హైదరాబాద్) స్థాపించి, పుస్తక ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టారు. రచనలు: 1. ఖుర్‌ఆన్ భావామృతం, 2. హదీస్ హితోక్తులు, 3.'ముహమ్మద్' ఆదర్శ జీవితం, 4.ఫుర్ఖాన్ భావామృతం, 5. శాంతి-సమరం-న్యాయం, 6. పరలోక ప్రస్థానం, 7. ముస్లిం మహిళ, 8. ధన వికేంద్రీకరణ, 9. రమజాన్ ఆశయాలు, 10. కాబా సందేశం, 11.శుభోదయం, 12.మసీహ్ మౌవూద్, 13.సువర్ణ సూక్తులు, 14.'ఆత్మ'కథ, 15.దాంపత్య జీవితం, 16.పరీక్షా ప్రపంచం, 17. ఏక దైవారాధన, 18. ఇస్లాం బోధనలు, 19. సమైక్యతా సోదర భావాలు, 20. విశ్వాసులు, 21. దైవప్రవక్తల భవిష్యత్ ప్రకటనలు, 22.ఇస్లాం పిలుపు. పలు ఇతర ప్రచురణ సంస్థల ద్వారా అనేక అనువాద గ్రంథాలను వెలువరించారు. లక్ష్యం: అల్లాహ్ ప్రేరణతో పాఠకుల హృదయాల్లోకి మరింత లోతుగా చొచ్చుకుపోయే శైలిలో రచనలు చేస్తూ మతసహనాన్ని మరింతగా పటిష్టపర్చడం, సమాజాన్ని దేవుని ఏకత్వం వైపు నడిపించడం, ఇస్లామియా సాహిత్యాన్ని పరిచయం చేయడం. **చిరునామా : అబుల్ ఇర్ఫాన్, సందేశభవనం, ఛత్తాబజార్, హైదరాబాద్-500002, దూరవాణి: 040 -66710795, సంచారవాణి: 94415 15414,** Email: alifain45@yahoo.com



**అఫ్జల్ మహమ్మద్ అహమ్మద్ :** పశ్చిమ గోదావరి జిల్లా చాగల్లులో 1963 నవంబర్ 21న జననం. కలంపేరు: అఫ్జల్ఇండియన్. తల్లితండ్రులు: షేక్ సాబెరున్నీసా, మహమ్మద్ ఇబ్రహీం. చదువు: ఎం.ఎ. వ్యాపకం: వ్యాపారం. 'గీటురాయి' వారపత్రిక సంపాదకులు, ప్రముఖ రచయిత ఎస్.ఎం మలిక్ ప్రేరణతో 1979లో 'నవరక్తం రావాలి' రచన గీటురాయి వారపత్రికలో ప్రచురితం. అప్పటి నుండి వివిధ పత్రికలలో వ్యాసాలు, కవితలు చోటు చేసుకున్నాయి. కవితల్లో ఆరు ఆంగ్లంలో అనువాదమై పత్రికల్లో ప్రచురితం కాగా మరో పది కవితలు హిందీలో తర్జుమా చేయబడి పత్రికల్లో ప్రచురితం అయ్యాయి. నలభై అక్షరాలకు మించకుండా నాలుగు చరణాలతో, నాల్గవ చరణంలో భావం బలంగా 'పంచ్' అయ్యే విధంగా 'సాహిరీలు' పేరుతో నూతన కవితా ప్రకియ ఆరంభించారు. ప్రచురణలు: 1.నైతిక జీవితం, 2. చరితార్థులు. లక్ష్యం: ఇస్లాం విశ్వప్రేమ స్వభావాన్ని, స్వరూపాన్ని సాక్షాత్కరింప చేయడం. **చిరునామా: మహమ్మద్ అఫ్జల్ అహమ్మద్, ఇంటి నం.7-32/1, చాగల్లు-534342, పశ్చిమ గోదావరి జిల్లా. సంచారవాణి: 93464 98464**, Email: afjalindian@yahoo.co.in



**అఫ్రోజ్ అహమ్మద్ షేక్ :** కృష్ణా జిల్లా విజయవాడలో 1980లో జన్మించారు. తల్లితండ్రులు: షేక్ మహబూబాషా, షేక్ మొహర్ జబీన్. చదువు: బి.సి.ఎ., ఫాజిలె ఇస్లామియా. వ్యాపకం: భాషా అనువాదం. 1999లో 'సృష్టి నిదర్శనం' తొలి రచన వెలువడింది. కవితలు, పాటలు, వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురితం. అనువాదాలు మాత్రమే కాకుండా పలు స్వతంత్ర రచనలు చేశారు. వక్త, గాయకుడు. ఇస్లామీయ సాహిత్యంతో కూడిన దాదాపు 60 పుస్తకాలను ఉర్దూ, అరబ్బీ, ఆంగ్ల భాషల నుంచి తెలుగులోకి అనువదించారు. ఆయన గ్రంథాలలో 'వేదాల్లో ముహమ్మద్ (స)' టైటిల్‌తో 2007లో వెలువరించిన గ్రంథం గుర్తింపు తెచ్చింది. లక్ష్యం: అత్యుత్తమ సాహిత్య విలువలతో, పాత్రికేయ విలువలతో, ఉన్నత ప్రమాణాలతో, ఇస్లాం సందేశాన్ని ప్రజా బాహుళ్యానికి అందజేయడం. **చిరునామా: షేక్ అఫ్రోజ్ అహమ్మద్, ఇంటి నం.7-10-3/బి, గులాం అబ్బాస్ వీధి, వించిపేట, విజయవాడ-520001, కృష్ణా జిల్లా. సంచారవాణి: 93953 17066**, Email: ahamed.afroz@ rocketmail.com



**అఫ్సర్ :** ఖమ్మం జిల్లా చింతకాని గ్రామంలో జననం. అసలు పేరు ముహమ్మద్ మహబూబ్ అలీ. తండ్రి : ప్రముఖ కవి 'కౌముది' గా విఖ్యాతులైన ముహమ్మద్ షంషుద్దీన్.







కలంపేరు: 'అఫ్సర్'. చదువు: బి.ఏ (చరిత్ర)., ఎంఏ (తెలుగు)., పిహెచ్.డి. వ్యాపకం: అధ్యాపకులు, సాహిత్య సృజన. ఆరంభంలో చాలా కాలం ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి దినపత్రికల్లో సంపాదకునిగా పనిచేశారు. ఆ తరువాత అమెరికా వెళ్ళి 'విస్కాన్సిన్ విశ్వ విద్యాలయంలో బోధనా, పరిశోధనా బాధ్యతలను చేపట్టి, ప్రస్తుతం 'టెక్సాస్ విశ్వవిద్యాలయం' లోని ఆసియా విభాగంలో అధ్యాపకులుగా పనిచేస్తున్నారు. ఆంధ్రజ్యోతి వారపత్రిక నిర్వహించిన కథల పోటీలకు రాసిన 'అడివి' కథకు బహుమతి రావడంతో తెలుగు సాహిత్యం వైపు మళ్ళారు. 1984లో ఆంధ్రజ్యోతి తెలుగు దినపత్రికలో పలు బాధ్యతలను నిర్వహించారు. ప్రస్తుతం అమెరికాలో యూనివర్సిటీ ఆఫ్ టెక్సాస్‌లో అధ్యాపకులు. తెలుగు పత్రికల్లో కవితలు, సామాజిక-సాహిత్య వ్యాసాలు, సమీక్షలు అసంఖ్యాకంగా ప్రచురితం. 'తెలంగాణ కవిత్వం: వస్తు రూప పరిణామం' అను అంశం మీద పరిశోధన చేసి డాక్టరేట్ పొందారు. ఆయన రాసిన 'నిర్దిష్టత, స్థానికత, కొత్త సాహిత్య ప్రమాణాలు' సాహిత్య విమర్శ కొత్త చర్చలకు నాంది పలికింది. రచనలు: 1. రక్తస్పర్శ (1986), 2. ఇవాళ ( కవితా సంపుటి, 1991), 3.ఆధునికత-అత్యాధునికత (1992), 4. కథ-స్థానికత (సాహిత్య విమర్శ), 5. వలస (కవితా సంపుటి, 2002, 6. ఊరి చివర (కవితా సంపుటి, 2010). అవార్డులు-పురస్కారాలు: ఫ్రీ వర్స్ ఫ్రంటు అవార్డు (1992), ఉమ్మడిశెట్టి అవార్డు (1992) అలిశెట్టి ప్రభాకర్ అవార్డు (1999) తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు (హైదరాబాద్, 2003), సాహితీ గౌతమి అవార్డు (2003), మద్రాస్ తెలుగు అకాడమీ ఉగాది పురస్కారం (మద్రాస్, 2002), భాషా సమ్మాన్ అవార్డు (2007). **చిరునామా: ప్రస్తుతం అమెరికాలో నివాసం.** Email: afsrtelugu @gmail.com, afsar@mail.utexas.edu.

**అహమ్మద్ అలీ ఖాదరి సాహెబ్ :** 1935 నవంబరు నాటి 'భారతి' సంచికలో 'ఓరుగల్లు చరిత్ర' వ్యాసం ప్రచురితం.

**అహమ్మద్ బాషా షేక్ :** నెల్లూరు జిల్లా నెల్లూరులో 1945 మే14న జననం. తల్లితండ్రులు: షేక్ ఖైరున్నీసా బేగం, షేక్ మహమ్మద్ గులాం గౌస్. కలంపేరు: షేక్ అహమ్మద్. చదువు: పదవ తరగతి. వృత్తి: టైలరింగ్. 1969 నుండి కవితలు, పాటలు, గేయాలు రాస్తున్నారు. నటుడు, గాయకుడు. 1992లో సారా వ్యతిరేక ఉద్యమ పాటల సంకలనంలో కవిత ప్రచురితం అయినప్పటి నుండి వివిధ పత్రికలలో పలు పాటలు, గేయాలు, కవితలు చోటు చేసుకున్నాయి. అంతర్జాతీయ పరిణామాల మూలంగా దేశం, కార్మికులు ఎదుర్కొంటున్న సమస్యలు, ముస్లింలు ఎదుర్కొంటున్న ప్రత్యేక సమస్యలను విశ్లేషిస్తూ, కమ్యూనిస్టు దృక్కోణంతో సమాధానాలు



వెల్లడిస్తూ, బాబ్రీ మసీదు కూల్చివేత తరువాత హిందూ-ముస్లిం జన సముదాయాల మధ్య సంబంధాలను మరింతగా పటిష్టం చేయాలన్న లక్ష్యంగా ప్రత్యేకంగా బుర్రకథలు, నాటకాలు రాసి ప్రజానాట్యమండలి ఆధ్వర్యంలో స్వయంగా ప్రదర్శించారు. లక్ష్యం: సమసమాజ స్థాపన. **చిరునామా: షేక్ అహమ్మద్ బాషా, ఇంటి నం.11/706, ఏ.సి.యస్ రోడ్, సుందర్ డీలక్స్ వద్ద, సంతపేట, నెల్లూరు-524001, నెల్లూరు జిల్లా, సంచారవాణి: 99490 72401,** Email: royalahmedbasha@gmail.com

**అహమ్మద్ బాషా సయ్యద్ :** తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం. రచన: శ్రీ ప్రవక్త ముహ్మద్ రసూల్ వారి దివ్య చరిత్ర.

**అహమ్మద్ మహమ్మద్ :** మెదక్ జిల్లా మెదక్‌లో 1962 డిసెంబర్ 25న జన్మించారు. తల్లితండ్రులు: యాకూబీ, మహమ్మద్ మూసా. చదువు: ఎం.ఎ., బి.ఇడి. ఉద్యోగం: ఉపాధ్యాయులు. ప్రముఖ కవి నందిని సిద్ధారెడ్డి ప్రేరణతో 1984లో సాహిత్యరంగ ప్రవేశం. 1986 'మౌనం' కవిత ప్రచురితం. అప్పటినుండి వివిధ పత్రికలు, కవితా సంకలనాలలో పలు కవితలు, కథానికలు ప్రచురితం. ప్రచురణలు: పానాది (కవితా సంపుటి, 2008). లక్ష్యం: సామాజిక రుగ్మతలను విమర్శనాత్మకంగా విశ్లేషిస్తూ ఆరోగ్యకరమైన సమాజ నిర్మాణానికి దోహదపడగల సాహిత్యాన్ని రాయడం. **చిరునామా: మహమ్మద్ అహమ్మద్, ఇంటి నం. 1-12-29/20, అజయ్‌నగర్ కాలనీ, మెదక్-502 110, మెదక్ జిల్లా. సంచారవాణి : 94415 36433,**



**అక్బర్ బాబు షేక్ :** ఖమ్మం జిల్లా ఖమ్మంలో 1952 ఏప్రిల్ ఆరున జననం. తల్లితండ్రులు: షేక్ జమాల్ బీ, మహ్మద్ అలీ. కలంపేర్లు: మహ్మదీ కుమార. చదువు: 8వ తరగతి. ఉపాధి: వెల్డింగ్ వర్కర్. 1995లో గీటురాయి వారపత్రికలో 'ధ్యేయం' కవిత ప్రచురణ. అప్పటి నుండి వివిధ పత్రికలలో వ్యాసాలు ప్రచురితం. గీటురాయిలో వచ్చిన ధార్మిక వ్యాసాలు గుర్తింపును తెచ్చి పెట్టాయి. లక్ష్యం: రచనల ద్వారా ధార్మిక ప్రచారం. **చిరునామా: షేక్ అక్బర్ బాబు, ఇంటి నం.1-935/48/42/2, ఇస్లాంపేట, ఖమ్మం, ఖమ్మం జిల్లా. సంచారవాణి : 99519 21335.**



**అక్బర్ ఎస్.ఎం :** 1939 జనవరి నాటి 'గృహలక్ష్మి' పత్రికలో (ఆనాడు, ఈనాడు కూడా) చాలా చర్చనీయాంశంగా మారిన 'వెధవ ఘోష' కథను రాశారు.







**అలీ ముహమ్మద్ :** కరీంనగర్ జిల్లా గుట్టు బత్తూరు. తల్లితండ్రులు: అమీనాబీ, హుస్సేన్. విద్యాభ్యాసం : యం.ఎ. కడపలో కో-ఆపరేటివ్ రిజిస్ట్రార్‌గా ఉద్యోగం. రచనలు: హృదయ మాధురి, ఆణిముత్యాలు, వేదనా సౌరభము, మమత (కావ్యాలు).

**అలీ షేక్ :** గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా రమణప్పపాలెంలో 1935 డిసెంబర్ రెండున జననం. తల్లితండ్రులు: షేక్ మస్తాన్ బీ, మహమ్మద్ ఖాశిం సాహెబ్. చదువు: ఎం.ఎ., బి.ఇడి. ఉద్యోగం: తెలుగు అధ్యాపకులు. సంస్కృతాంధ్ర భాషలలో పండితులు. 1950 నుండి పద్య రచన ఆరంభం. రచనలు: శతకాలు: 1. మానస ప్రబోధము, 2. గురుని మాట (1970), 3. అజింఖాన్ బాబా (1990), 4.షిర్డి సాయి ప్రభు (1999), 5. ఖాదర్ బాబా (2001), 6. శిలువధారి (2003), 7. ఆంజనేయ (2003), 8. శ్రీ వాసవీ కన్యక (2008) 9. చెన్నకేశవ శతకం (2009). గద్యరచనలు: 10. రైతు బాంధవుడు (జీవితచరిత్ర) (2008), కావ్యాలు: 11. విధి విలాసము (1985), 12. ఆకాశవాణి (2000), 13. ఇందిరా భారతము, (2001), 14. వ్యాస మంజిరి, 1994 (వ్యాస సంకలనం) 15. సులభ వ్యాకరణము, 1993. సంపాదకుడిగా వెలువడిన గ్రంథాలు: 1. గురుదక్షిణ (1960), 2. కోగంటివారి భాషాసేవ (1962). బిరుదములు: కవితా వతంస, సద్భావనా కవిమిత్ర, పురస్కారాలు: కాట్రగడ్డ సాహితీ పురస్కారం, పట్నాయక్ నరసింహం ఫౌండేషన్ పురస్కారం. రాష్ట్రస్థాయి సాంస్కృతిక-సాహిత్య సంస్థలచే సన్మానాలు. **చిరునామా: షేక్ అలీ, కావూరు-522611, చిలకలూరిపేట మండలం, గుంటూరు జిల్లా. సంచారవాణి: 93903 98044..**



**అలీ వలీ హమీద్ షేక్ :** తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రిలో 1951జూన్ ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ నాగూర్‌బీ, సుభాన్ సాహెబ్. 2004 నుండి రచనా వ్యాసాంగం ఆరంభం. పలు కవితలు, సమీక్షలు, సామాజిక వ్యాసాలు వివిధ పత్రికలలో, సంకలనాలలో చోటు చేసుకున్నాయి. పలువురి కవితలను ఆంగ్లంలోకి అనుదించారు. ఆంగ్లంలోకి అనువదించిన డాక్టర్ ఇక్బాల్ చంద్ (సత్తుపల్లి, ఖమ్మం) రాసిన 'ఆరోవర్ణం' కవితా సంపుటి మంచి గుర్తింపు తెచ్చింది. లక్ష్యం: బడుగు, బలహీన వర్గాల చైతన్యం కోసం రచయితగా కృషి. **చిరునామా: ఎస్.వి.హెచ్ అలీ, టైప్ 3 ఎ/3, బిఎస్‌యన్ఎల్ స్టాఫ్ క్వార్టర్స్, లాలాచెర్వు, రాజమండ్రి-533106, తూర్పు గోదావరి. సంచారవాణి: 9441638651**, Email: valishaik1971@gmail.com



**అలీ సయ్యద్ :** నల్గొండ జిల్లా దేవరకొండ జన్మస్థలం. రచనలు: జలంధరాసుర వధ, ప్రమీల, దిగంబరమోహిని, నవీన సత్యహరిశ్చంద్ర, నల చక్రవర్తి, భీమ పరమ మహాత్యము, బభ్రువాహన, ధృవ, నగర, ఆనందగురు గీత, ముక్తి ప్రదాయిని, సత్యాద్రౌపది సంవాదము, కాళింది, సిరిసినగండ్ల నలనాటకము, సీతారామ శతకము, సురభాండేశ్వరము, మానసిక రాజయోగము.

**అల్లా బక్ష్ షేక్ :** గుంటూరు జిల్లా చిలకలూరిపేటలో 1971 జూన్ 15న జననం. తల్లి తండ్రులు: షేక్ ఫాతిమా, షేక్ అబ్దుల్ కలాం. వ్యాపకం: జర్నలిస్ట్. 1982లో కళాశాల పత్రికలో కవిత రాయడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి కవితలు, కథానికలు, వ్యాసాలు వివిధ పత్రికలలో, సంకలనాలలో ప్రచురితం అయ్యాయి. లక్ష్యం: అట్టడుగు జీవితాల బాధల గాథలను వెలుగు లోకి తీసుకరావడం, బాధిత ప్రజానీకం జీవితాల్లో మార్పు కోరుతూ సాహిత్యాన్ని అభివృద్ధి చేయడం, సాహిత్య కార్యక్రమాలు నిర్వహించడం. **చిరునామా: ఇంటి నం. 16-438, భగత్‌సింగ్ రోడ్, చిలకలూరిపేట-522616, గుంటూరు జిల్లా. సంచారవాణి: 92905 92576**, Email: allbaskhsu@gamail.com., s.allabaskshu@rediffmail.com



**అల్లా బక్షి బేగ్ షేక్ :** గుంటూరు జిల్లా బాపట్లలో 1952 సెప్టెంబర్ 12న జన్మించారు. తల్లితండ్రులు: షేక్ మస్తాన్ బీ, ఖాశిం బేగ్. చదువు: బి.ఏ. వ్యాపకం: జర్నలిస్ట్, నాటక రచయిత-నటుడు. కలంపేరు: ఆనంద బక్షి. డా॥ కొర్రపాటి గంగాధర రావు, కె.యస్.టి శాయిల ప్రేరణ, ప్రోత్సాహంతో 1978 నుండి నాటకాలు రాయడం, నటించడం, ఆరంభం. 1980లో తొలిసారిగా రాసిన 'సంఘర్షణ' (నాటకం) 1983 ఆగస్టు 2న 16 భాషల్లోకి అనువాదమై ఆకాశవాణి ద్వారా జాతీయ నాటకంగా ప్రసారమైంది. కవితలు, వ్యాసాలు, కథానికలు వివిధ పత్రికలలో ప్రచురితం. కవితల్లో స్నేహదీపం, ఎవరు దేవుడు? గుర్తింపు తెచ్చాయి. 1994లో రాసిన 'కార్మికులారా ఏకంకండి' నాటకం ప్రజాదరణ పొందింది. తీరం చేరని కెరటాలు, ఛైర్మన్ చంద్రయ్య ఉత్తమ నాటికలుగా ఎంపికయ్యాయి. 23 రేడియో నాటికలు, 8 నాటకాలు రాశారు. అన్ని ప్రదర్శనలు, ప్రసారం అయ్యాయి. ఉత్తమ రచయితగా, నటుడిగా పలు విజయాలను నమోదు చేసుకున్నారు. నటుడిగా, నాటక రచయితగా సాహితీ-సాంస్కృతిక సంస్థలచే









సన్మానాలు, పురస్కారాలందుకున్నారు. లక్ష్యం: సామాజిక రుగ్మతలకు పరిష్కారాలు చూపడం. **చిరునామా : షేక్ అల్లా బక్షి బేగ్, ఇంటి నం.13-8-20, ఫిష్ మార్కెట్ వద్ద, మార్కెట్ వీధి, బాపట్ల-522101, గుంటూరు జిల్లా. సంచారవాణి: 93469 10500**.

**అమీన్ సాహెబ్ సయ్యద్ :** 'జీవామృతం సంజీవని' ఆయన రచన.

**అమిరి ముప్పలున్ :** మద్రాసులోని రైల్వేలో ఉద్యోగి. ఆయన అలనాటి చిరునామా : 302-ఎ, దక్షిణ రైల్వే భవనాలు, విల్లిపక్రమ్, మద్రాసు-10. రచన : విశ్వప్రవక్త.

**అనిస్ ముఖ్తదిర్ మహమ్మద్ :** నల్గొండ జిల్లా నల్గొండలో 1967 మార్చి23న జననం. తల్లితండ్రులు: అహమ్మదున్నీసా బేగం, మహమ్మద్ ఖయ్యూం. చదువు: బి.ఏ. ఉద్యోగం: రాష్ట్ర ప్రభుత్వ వ్యయసాయశాఖ నుండి స్వచ్ఛంద విరమణ. ప్రస్తుతం రియల్ ఎస్టేట్ వ్యాపారం, సామాజిక కార్యకర్త. ఉద్యోగుల సమస్యల మీద వ్యాసాలు రాయడం ఆరంభించి సామాజిక అంశాల మీద 'ఇస్లామిక్ వాయిస్' పక్ష పత్రిక 2009 మార్చి సంచిక నుండి వరుసగా వ్యాసాలు రాశారు. రాష్ట్రంలో అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా ముస్లింల సమస్యలను వివరిస్తూ, ఆ సమస్యల పరిష్కారం సూచిస్తూ 2009లో 'ముస్లిం మ్యానిఫెస్టో' చిరుపొత్తాన్ని రాసి ప్రచురించారు. లక్ష్యం: సామాజిక రుగ్మతలకు వ్యతిరేకంగా, అసమానతల తొలగింపు దిశగా ప్రజలను చైతన్యపర్చడం. **చిరునామా: మహమ్మద్ అనిస్ ముఖ్తదిర్, ఇంటి నం. 6-2-853, మీర్‌బాగ్ కాలనీ, నల్లగొండ-508001, నల్లగొండ జిల్లా, సంచారవాణి: 94404 23687.** Email: aneesmef@gmail.com



**అన్వర్ పాష మహ్మద్ :** వరంగల్ పట్టణం శివనగర్‌లో 1968 జూన్ రెండున జననం. తల్లితండ్రులు: కరీంబీ, జానీమియా. చదువు: బిఎస్సీ., బి.ఎ., ఎం.ఎ (తెలుగు)., ఎం.ఎ (సోషియాలజీ). ఉద్యోగం: రాష్ట్రప్రభుత్వ వైద్య- ఆరోగ్యశాఖలో ఆరోగ్య విస్తరణాధికారి. 1990లో సాహిత్యరంగ ప్రవేశం. అప్పటినుండి కథలు, కవితలు, వ్యాసాలు వివిధ పత్రికలలో, కథా, కవితా, వ్యాసాలు వివిధ సంకలనాలలో ప్రచురితం. ఆంగ్లం, హిందీ భాషల్లోకి అనువదించబడిన కథానికలు, కవితలు ఆయా పత్రికల్లో ప్రచురితం. ప్రచురించిన గ్రంథాలు: 1. తలవంచని అరణ్యం (కవితా సంపుటి) 1999, 2. ముఠ్ఠీ (కవితా సంపుటి) 2007, 3. 1969 వరంగల్ అమరవీరులు. స్వీయ సంపాదకత్వంలో వెలువడిన గ్రంథాలు: 1. అజాం (గుజరాత్ కవిత్వం)



2002, 2. తెలంగాణా కవిత (2006), 3. నాయిన (కవితా సంకలనం) 2005. అవార్డులు -పురస్కారాలు: ఉమ్మడి శెట్టి సాహిత్య అవార్డు, రెండు సార్లు ఎక్స్‌రే ఆవార్డు. వరంగల్ జిల్లా యువకవిగా ఎంపిక. ఆ తరువాత వరంగల్ జిల్లా 'ఉత్తమ కవి' గా నాలుగుసార్లు ఎంపికయ్యి ఘన సత్కారం పొందారు. రాష్ట్రస్థాయి సాహిత్య సంస్థల ద్వారా పలు సన్మానాలు అందుకున్నారు. లక్ష్యం: కవిత్వం శరీరంలో రక్తనిష్టగా ప్రవహించాలన్న ఆశయంతో, జీవిత మూలాలకు సంబంధించిన విషయాల్ని కవిత్వీకరించడం, ముస్లింల జీవన, సామాజిక, ఆర్థిక, సాంఘిక విషయాల వ్యక్తీకరణ. **చిరునామా : మహ్మద్ అన్వర్ పాష, ఇంటి నం.16610-374, శివనగర్, వరంగల్-506002, వరంగల్ జిల్లా, సంచారవాణి: 98660 89066**, Email: anwarwarangal@ gmail.com.

**అన్వర్ పాష మహ్మద్ :** నిజామాబాద్ జిల్లా బోధన్‌లో 1959 జూలై 22న జననం. తల్లి తండ్రులు: జైబున్నీసా, ఎం.ఎ సలీం. చదువు : ఎం.ఎ (చరిత్ర)., ఎం.ఎ (ఆర్కియాలజీ)., ఎం.ఎ. (రాజనీతి శాస్త్రం)., ఎల్ఎల్.బి. ఉద్యోగం: రాష్ట్ర వాణిజ్య పన్నులశాఖలో ఉన్నతాధికారి. మంచి వక్త, ప్రయోక్త. 1977లో 'స్మశానం' కవిత ప్రచురితం అయినప్పటినుండి కవితలు, కథానికలు, వ్యాసాలు పత్రికలలో ప్రచురితం. ప్రచురణ: వస్తుసేవల చట్టం (2010). రాష్ట్ర వాణిజ్యశాఖాకు సంబంధించిన సమాచారాన్ని ప్రజల ప్రయోజనార్థం తెలుగులోకి అనువదించి గ్రంథాలను ప్రచురించారు. లక్ష్యం: సర్వ మానవ సమాత్వం, సర్వ జనావళి సౌభాగ్యం. **చిరునామా: మహమ్మద్ అన్వర్ పాషా, ఇంటి నం.7-21-315, ప్రశాంత్ హిల్స్, రాయదర్గా, గోల్కొండ పోస్ట్, హైదరాబాద్-500028. సంచారవాణి : 99499 92844**, Email: mdanwar315 @yahoo.com



**ఆరిఫ్ బాష షేక్ :** ప్రకాశం జిల్లా గిద్దలూరులో1970 డిసెంబర్ 20న జననం. తల్లితండ్రులు: షేక్ జులేఖాబి, షేక్ అబ్దుల్ రహీం. చదువు: ఎంఎ., ఎంపిఎ., ఎం.బి.ఎ., పిజిడిఎ. ఉద్యోగం: అధ్యాపకులు (హైదరాబాద్). చిన్నతనం నుండి రచనా వ్యాసంగం పట్ల అభిలాషతో వ్యాసాలు రాయడం ఆరంభించి 1992లో 'పాలపిట్ట' ప్రచురణ. రచనలు: 1992లో 'పాల సముద్రం' (నవల, 1992), 2. జీవితాలాపన, నవల (1999), 3. భారత ప్రభుత్వం - రాజకీయాలు (2001), 4.రాజనీతి సిద్ధాంతాలు (2004), 5. వ్యక్తి వికాసం (ఇంటర్వ్యూ టెక్నిక్స్ 2010), 6. నాయకత్వ









లక్షణాలు (2010). పురస్కారాలు: విశ్వసాహితి అవార్డు, అభినందన అవార్డు, విశ్వభారతి యువ రచయిత అవార్డు. లక్ష్యం: సామాజిక చైతన్యం కొసం ఇటు అధ్యాపకునిగా, అటు రచయితగా నిరంతరం కృషి చేయడం. **చిరునామా: షేక్ ఆరిఫ్ బాషా, ఫ్లాట్ నం.102, అమానత్ రెసిడెన్సీ, ఆనందనగర్ కాలనీ, ఖైరతాబాద్, హైదరాబాద్-500004. దూరవాణి: 99856 36780**, Email: areefsha@yahoo.com.

**ఆసిఫుద్దీన్ మహమ్మద్ :** 1973 జూన్ ఎనిమిదిన జననం. తల్లితండ్రులు: రహీమున్నిసా బేగమ్, యూసుఫుద్దీన్ ముహమ్మద్. చదువు: ఎం.బి.ఎ., ఎల్ఎల్.బి. వ్యాపకం: ఇస్లామియా ధార్మిక ప్రచారం. 2007 నుండి రచనా వ్యాసాంగం ఆరంభం. పలు వ్యాసాలు ప్రచురితం. వక్త. మతధర్మాల తులనాత్మక అధ్యయనం పట్ల ఆసక్తి. రచనలు: 1. ఇస్లాం, హిందూ ధర్మాలు, 2. ఇస్లాం, ముస్లింల గురించి అవగాహన. లక్ష్యం: ఇస్లామ్ బోధనలను సరళమైన తెలుగులో అనువదించి ప్రజలకు అందించడం. **చిరునామా : ఆసిఫుద్దీన్ ముహమ్మద్, ప్లాట్ నం. 110, అశోకా ప్లాజా, మాసాబ్ ట్యాంక్, హైదరాబాద్-500028. సంచారవాణి: 98854 48989**, Email: iacr.islam@ gmail.com



**అస్లాం షరీఫ్ షేక్ :** అనంతపురం జిల్లా ఉరవకొండలో 1979 జనవరి 11న జననం. తల్లి తండ్రులు: షేక్ ముంతాజ్ బాను, ఖాదర్ షరీఫ్. చదువు: బి.ఎ. ఉద్యోగం: విద్యాశాఖ. 1996 నుండి రచనా వ్యాసాంగం. ఆరంభమై వివిధ పత్రికల్లో మిని కవితలు, కథానికలు, ప్రధానంగా హాస్యస్ఫోరక రచనలు, కార్టూన్లు ప్రచురితం. రచనలు: 1. నవ్వుల నజరానా (2005), 2.నవ్వుల జల్లులు (2008), 3. నవ్వుల చినుకులు (2010). లక్ష్యం: సర్వ మానవాళి సుఖ సంతోషాలు. **చిరునామా: షేక్ అస్లాం షరీఫ్, ఇంటి నం. 5-104, శాంతినగర్ -509144, మహబూబ్ నగర్ జిల్లా. సంచారవాణి: 94411 67616**..



**ఆజం మహబూబ్ షేక్ :** కృష్ణా జిల్లా విజయవాడలో1947 డిసెంబర్ 17న జననం. తల్లితండ్రులు: అమినా బీబి, మహబూబ్ ఆదం. చదువు: బి.కాం. ఉపాధి: ఆప్టికల్స్ వ్యాపారం. (విజయవాడ). విశాలాంధ్ర బుక్ హౌస్, 'విశాలాంధ్ర' దినపత్రికతో దశాబ్దాలుగా ఉన్న అనుబంధం. 1970లో తొలి రచన విశాలాంధ్రలో ప్రచురితం. అయినప్పటి నుండి వివిధ తెలుగు పత్రికలలో సమకాలీన రాజకీయాలు ప్రధానాంశంగా పలు వ్యాసాలు, సమీక్షలు



స్థానం సంపాదించుకున్నాయి. ప్రధానంగా వివిధ ప్రత్యేక సందర్భాలను బట్టి రాసిన వ్యాసాలు మంచి గుర్తింపును తెచ్చిపెట్టాయి. లక్ష్యం: సమసమాజం దిశగా ప్రజలను చైతన్యవంతుల్ని చేయడం, అసమ సమాజం స్థానంలో సమసమాజం ఏర్పాటుకు రచయితగా తోడ్పాటు అందివ్వడం ప్రధాన లక్ష్యం. **చిరునామా: షేక్ మహబూబ్ ఆజం, ఇంటి నం. 32-34652, మసీదు వీధి, ఎస్సారార్ అండ్ సివిఆర్ ప్రభుత్వ కళాశాల గేటు ఎదురు, మాచవరం, విజయవాడ- 520004, కృష్ణాజిల్లా. సంచారవాణి: 99594 98786**.

**ఆజం మహమ్మద్ సయ్యద్ :** డోన్ తాలూకా బేతంచర్ల జన్మస్థలం. పుట్టిన తేది : 1938 జనవరి ఒకటి. తల్లితండ్రులు : సయ్యద్ గౌస్‌బీ, సయ్యద్ మహబూబ్. హిందీ పండితులు. రచనలు : 'సయ్యదయ్య మాట సత్యమయ్య' మకుటంతో సూక్తిసుధ, అంతా విధివిలాసం, గురుపూజ, విశాలాంధ్ర జిందాబాద్ నాటికలు. ఉర్దూలో కూడా మిలాద్-ఇ-అజం, గజ్‌లియాత్-ఇ-ఆజం అను రచనలు చేశారు. 'లలిత కవి' బిరుదాంకితులు.

**ఆజీజుర్రహ్మాన్ ముహమ్మద్ :** కృష్ణా జిల్లా గుడ్లవల్లేరు మండలం సుబ్బిచెర్వులో 1957 అక్టోబర్ 12న జననం. తల్లితండ్రులు: షరీఫాబి, ముహమ్మద్ యూనుస్. చదువు: బి.ఎ. వ్యాపకం: ధార్మిక సేవలు, జర్నలిస్ట్. 1979లో గీటురాయి వారపత్రికలో తొలిరచన ప్రచురణ ద్వారా రచనా వ్యాసాంగం ఆరంభం. ప్రముఖ కవి రచయిత ఎస్.ఎం. మలిక్, మౌలానా ముహమ్మద్ తఖీయుద్దీన్‌ల ప్రేరణతో తెలుగు, ఉర్దూ భాషల్లో ప్రావీణ్యం. గీటురాయి పత్రికలో పనిచేస్తూ పలు ధార్మిక వ్యాసాలు రాశారు, అనువాదాలు చేశారు. ఆ క్రమంలో పలు వ్యాసాలు వివిధ పత్రికలలో చోటు చేసుకున్నాయి. ఉర్దూ నుండి తెలుగులోకి అనువదించిన సుమారు 70 గ్రంథాలను రాష్ట్రంలోని వివిధ ప్రచురణ సంస్థలు ప్రచురించాయి. ఆ గ్రంథాలలో 1. హదీసు మకరందం, 2. తఫ్సీర్ అహ్సనుల్ బయాన్ (ఖుర్‌ఆన్ అనువాదం), 3. దేవుడొక్కడే, 4. రుజుమార్గం, 5. రమజాన్ శుభాలు అను గ్రంథాలు గుర్తింపు తెచ్చిపెట్టాయి. 'తఫ్సీర్ అహ్సనుల్ బయాన్' పేరుతో తెలుగులో అనువదించిన రెండువేల ఎనిమిది వందలడెభై పుటలకు పైగాగల బృహత్తర గ్రంథం ఖ్యాతికి కారణమైంది. ప్రస్తుతం కువైట్‌లో నుండి వెలువడుతున్న 'నెలవంక' మాసపత్రికకు సంపాదకత్వం వహిస్తున్నారు. ప్రస్తుత నివాసం కువాయిట్. లక్ష్యం:









ప్రజాభిప్రాయాన్ని సదాశయాలకు అనుగుణంగా అక్షరంతో మలచాలన్న ప్రయత్నం. **శాశ్వత నివాసం చిరునామా: ముహమ్మద్ అజీజుర్రహ్మాన్, ఇంటి నం.16-2-862, అక్బర్‌బాగ్, సైదాబాద్, హైదరాబాద్-500059. దూరవాణి: 040-24551510**.

**ఆజీజ్ వజీర్ సయ్యద్ :** కర్నూలు జిల్లా కర్నూలులో 1964 ఆగస్టు 11న జననం. తల్లితండ్రులు: మైమున్నీసా, సయ్యద్ బాబా సాహెబ్. చదువు: బి.ఎ. వ్యాపకం: రచన. పద్నాల్గవ యేట నుండి రచనలు చేయడం ఆరంభించగా 1983లో 'ఎర్ర కాగితాలు' (కథ) రచయితగా నిలబెట్టింది. కలంపేరు: ఎస్‌డివి అజీజ్. సుమారు వంద కథలు వివిధ తెలుగు పత్రికలలో ప్రచురితం. పలు నాటికలు, స్టేజి నాటికలు, రేడియో నాటికలు రాశారు. అన్ని రేడియో నాటికలు, రూపకాలు ఆకాశవాణి ద్వారా ప్రసారం అయ్యాయి. ఈ నాటికలలో 'సామా' అన్ని భారతీయ భాషల్లోకి అనువదించబడి జాతీయ స్థాయిలో ప్రసారమై, జాతీయ అవార్డును, మంచి గుర్తింపును తెచ్చి పెట్టింది. ప్రచురణలు: 1.వనజ, 2. శిథిల శిల్పాలు, 3. కావేరి, 4. ప్రేమ, 5. వాహిని, 6. అలల వాలున, 7. హరిణి (సాంఘిక నవలలు) 8. వీరనారి, 9. తెరిణెకంటి ముట్టడి, 10. పాలెగాడు, 11. మహాదాత బుడ్డా వెంగళ రెడ్డి (చారిత్రక నవలలు) 12. ఆంధ్ర కేసరి, 13. ది గైడ్, 14. మనిషి (రేడియో నాటికలు), 15. మనిషి (కథల సంపుటి,2010). ఈ గ్రంథాలలో 'పాలెగాడు' 'శిధిలశిల్పాలు' ఖ్యాతిని తెచ్చిపెట్టాయి. కర్నూలు నుండి 'సాహితి' సాహిత్య మాసపత్రిక కొన్నేళ్ళపాటు నడిపారు. లక్ష్యం: ప్రజలను చైతన్యవంతుల్ని చేయడం. **చిరునామా: ఎస్‌డివి అజీజ్, ఇంటి నం.46/634, బుధవారపేట, కర్నూలు- 518002. సంచారవాణి: 81063 67175**. Email:sdvazizkurnool@yahoo.com



**అజీద్ అబ్దుల్ షేక్ :** నల్గొండ జిల్లా గరిడేపల్లి మండలం గట్టిపల్లిలో 1968 జూలై 10న జననం. తల్లితండ్రులు: షరీఫాబీ, ఖాజామొహిద్దీన్. చదువు: ఎం.ఎ., బి.ఇడి. వృత్తి: జర్నలిస్ట్. 1987 నుండి రాసిన కవితలు, వ్యాసాలు, కథలు రాష్ట్రంలోని వివిధ పత్రికలలో, సంకలనాలలో ప్రచురితం. రాష్ట్రంలో వివిధ ప్రాంతాల నుండి మాత్రమే కాకుండా కర్నాటక బళ్ళారి నుండి వెలువడిన పలు వార, పక్ష, మాసపత్రికల రూపకల్పన చేయడంలో సహకారం, ఆయా పత్రికలకు గౌరవ సంపాదకుడిగా చేయూత. ప్రచురణలు: 1. తురక వాడ (కవితా సంపుటి), 2. జిందగీ (వ్యాస సంపుటి). ఆంధ్రప్రదేశ్ ముస్లిం రచయితల సంఘం రాష్ట్ర అధ్యక్షునిగా, జర్నలిస్టుల సంఘం నాయకునిగా



బాధ్యతల నిర్వహణ. లక్ష్యం: ప్రజా చైతన్యం కోసం కృషి. **చిరునామా: ఎస్ఎ అజీద్, ఇంటి నం. 3-7-256, మున్సూరాబాద్, ఎల్బీనగర్, రంగారెడ్డి జిల్లా, హైదరాబాద్-68. సంచారవాణి: 9246213493**. Email:sahayaa@in.com.

**అజ్మతుల్లా :** నల్లగొండ జిల్లా దేవరకొండ. రచనలు : సత్యసింధుర చరిత్ర, తత్వపుష్పము, మార్కండేయ జననము.

**బాబ్ జీ షేక్ :** గుంటూరు జిల్లా వేమూరు మండలం జంపనిలో 1949 మార్చి 17న జననం. తల్లితండ్రులు: షేక్ ఖాశింబి, దర్యాహుసేన్. చదువు: బిఎస్సీ., బి.ఇడి. ఉద్యోగం: ఉపాధ్యాయులు. 1963లో నిజామాబాద్‌లో ఉగాది సందర్భంగా జరిగిన కవి సమ్మేళనంలో 'గీత తత్వం' కవిత పఠించడం నుండి రచనా వ్యాసంగం ఆరంభమై పద్యాలు, కథలు, కవితలు వివిధ తెలుగు పత్రికలలో ప్రచురితం. రచనలు: 'అంతర్ముఖి' మకుటంగా స్వీకరించి 1. దివ్య ఖుర్ఆన్ విశిష్టత (పద్యకావ్యం), 2. ఇస్లాం అంటే... (పద్యకావ్యం), 3. అల్లాహు శతకం, 4. కుమతి శతకం, 5. అక్షరదీప్తి (పద్యకావ్యం). నటుడిగా విఖ్యాతులు. లక్ష్యం: సమాజ శ్రేయస్సు, సంఘ సంస్కరణ. **చిరునామా: షేక్ బాబ్ జీ, ఇంటి నం. 19-967, రసూల్‌పేట, పిడుగురాళ్ళ-522413, గుంటూరు జిల్లా. సంచారవాణి: 92907 67108**, Email:babjee.sk@gmail.com



**బాబూజీ షేక్ :** గుంటూరు జిల్లా గుంటూరు నగరంలో 1962 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ ఆదంబీ, పద్మశ్రీ షేక్ నాజర్. కలంపేరు: బాబూజీ. చదువు: బి.ఎస్సీ. ఉద్యోగం: పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలో (హైదరాబాద్) బుర్రకథ శిక్షకులు. తండ్రి, బుర్రకథా పితామహుడు, పద్మశ్రీ షేక్ నాజర్ ప్రేరణతో విద్యార్థి దశ నుండి నాటికలు, కథలు రాయడం ఆరంభించి, పలు ప్రదర్శనలు ఇచ్చారు. బుర్రకథలు రాసి తండ్రి మార్గదర్శకత్వంలో రాష్ట్రంలో ప్రదర్శించారు. బుర్రకథలు, కళా రూపాల విశిష్టతను వెల్లడిస్తూ రాసిన వ్యాసాలు పత్రికల్లో ప్రచురితం అయ్యాయి. ఆయన రాసిన నాటికలు, బుర్రకథలతో పాటుగా 'స్వర్గ సంరక్షణ', 'సిద్ధార్థ మహాత్మ్యం' (పద్య నాటకాలు) ఆకాశవాణి, టివీ ఛానెల్స్‌లో ప్రసారం అయ్యాయి. రచనలు: 1.మేలు కొలుపు (గీతాలు 1986), 2.దేశమంటే దేహమే నోయ్ (రాజకీయ వ్యాసం, 1996), 3.బుర్రకథ వాణి (18 బుర్రకథలు). లక్ష్యం: ప్రజా కళారూపాలకు జీవంపోసి









నూతనత్వం కల్పించాలి. **చిరునామా: షేక్ బాబూజీ, ఇంటి నం. 4-13-111, అమరావతి రోడ్, గుంటూరు-52207. సంచారవాణి: 93911 85993.**

**బడే సాహెబ్ షేక్ :** కృష్ణా జిల్లా మచిలీపట్నంలో 1948 జనవరి ఒకటిన జననం. తల్లితండ్రులు: హసన్ బీ, ఖాశిం సాహెబ్. చదువు: బి.కాం. ఉద్యోగం: భారత తపాలా శాఖ విశ్రాంత ఉద్యోగి. చిన్నతనం నుండి తెలుగు భాష పట్ల మక్కువ ఎక్కువగా ఉన్నా 1991 నుండి తెలుగు భాషను రక్షించుకోవాడానికి నడుం కట్టి, 'మేధావుల బారి నుంచి తెలుగు భాషనే కాదు లిపిని కూడా కాపాడుకుందాం' వ్యాసాన్ని 'వార్త' దినపత్రికలో రాశారు. అప్పటి నుండి తెలుగు భాషను నేర్చుకోవడం సులభతరం చేసే ప్రయత్నంలో భాగాంగా వివిధ పత్రికల్లో వ్యాసాలు ప్రచురితం అయ్యాయి. తెలుగును సులభంగా నేర్చుకోడానికి, నేర్పడానికి వీలయ్యే విధంగా 'మా హసన్‌బీ తెలుగు వాచకం' అను పుస్తకాన్ని 1991లో రాసి 2005 వెలువరించారు. పలువురికి ఆ విధానం నేర్పుతూ గుర్తింపు పొందారు. లక్ష్యం: తెలుగు భాషను నేర్చుకోవడం సులభతరం చేయాలన్నది. **చిరునామా : షేక్ బడే సాహెబ్, ఇంటి నం. 2-2-55/6, రహ్మత్‌నగర్, హైదరాబాద్- 500013, సంచారవాణి: 98499 21322**



**బడే సాహెబ్ షేక్ :** గుంటూరు జిల్లా పిడుగురాళ్ళ మండలం జానపాడు జన్మస్థలం. పుట్టిన తేది: 01-07-1927. తల్లితండ్రులు: మొహిద్దీన్‌బీ, షేక్ సైదా సాహెబ్. చదువు: యస్.యస్.యల్.సి, రాష్ట్రభాషా ప్రవీణ, ప్రచారక్, హిందీ సాహిత్యరత్న, వృత్తి: ఉపాధ్యాయులు. తెలుగు, ఉర్దూ, హిందీ భాషలలో పండితులు. కలంపేరు: సాబిర్. 1970లో 'భాయికీ పుకార్' గేయరచనతో సాహిత్యరంగ ప్రవేశం. రచనలు: ప్రవక్త హజరత్ మొహమ్మద్ వారి జీవిత చరిత్ర (హరికథా రూపం), జగజ్జ్యోతి హజరత్ మొహమ్మద్ (గేయరచన), హమారే రసూల్, హృదయ ఘోష (కవితా సంపుటి). సర్‌దారె ఆలం (ఉర్దూ రచన). హరికథా రూపంగా రాసిన ప్రవక్త హజరత్ మొహమ్మద్ వారి జీవిత చరిత్ర మంచి పేరు తెచ్చి పెట్టింది. ఈ హరికథా గేయరూపం విశిష్టతను వివరిస్తూ డాక్టర్ తూమాటి దోణప్ప తన 'హరి కథా సర్వస్వం' పరిశోధనాత్మక గ్రంథంలో ఆరు పేజీలు కేటాయించారు. ముహమ్మద్ ప్రవక్త రచనను ప్రదర్శనకు యోగ్యంగా తయారు చేసి స్వయంగా పలు ప్రదర్శనలను నిర్వహించారు. ధార్మిక, సామాజికాంశాల మీద తెలుగు, ఉర్దూ, హిందీ భాషల్లో పలు రేడియో ప్రసంగాలు చేశారు. ముస్లింల పట్ల ముస్లిమేతరుల



లో గల అపోహలను తొలగించడానికి కవితలు, గేయాల ద్వారా ఎంతో కృషి చేశారు. ముస్లింలకు రిజర్వేషన్లు కోరుతూ ప్రజలు ఉద్యమిస్తున్న సందర్భంగా 'నేను ఓసి నెట్లవుతాను' అంటూ పాట రాసి, స్వయంగా పాడిన గీతం బాగా పాపులర్ అయ్యింది. ఎక్కడ సభ, సమావేశం జరిగినా అక్కడికల్లా హాజరయ్యి ఆ పాటను పాడి విన్పించిన తరువాత మాత్రమే కార్యక్రమాలు మొదలయ్యేవి. స్వయంగా హిందీ విద్యాలయాన్ని స్థాపించి ఆ భాషాభివృద్ధికి జీవితాంతం పాటుపడ్డారు. కవిగా హిందూ-ముస్లిం ఐక్యత కోసం అవిశ్రాంతంగా కృషి చేశారు. రాష్ట్రంలోని పలు సాహిత్య, సాంస్కృతిక వేదికలు ఆయనను సన్మానించాయి. చివరిక్షణం వరకు సాహిత్య సృష్టిచేస్తూ, శ్రావ్యంగా పాడి ప్రజలకు విన్పిస్తూ, ప్రదర్శిస్తూ ఇటు కవి-రచయితగా అటు మంచి నటుడు, గాయకుడిగా ప్రజల మన్నన పొందిన షేక్ బడే సాహెబ్ గుంటూరు జిల్లా పిడుగురాళ్ళలో 2007 ఆగస్టు 31న కన్నుమూశారు. (ఇంటర్వ్యూ: షేక్ బడే సాహెబ్ రెండవ కుమారుడు షేక్ మహమ్మద్ మూసాతో 21-10-2009న ఇంటర్వ్యూ, 2001 ఏప్రిల్ 18న, విజయవాడలో షేక్ బడే సాహెబ్ స్వయంగా వెల్లడించిన విశేషాలు.)

**బహదూర్ :** విశాఖపట్నం జిల్లా విశాఖపట్నంలో 1965 అక్టోబర్ 17న జననం. తల్లితండ్రులు: జమీలా, ఎం.ఎ జబ్బార్. చదువు: ఎస్ఎస్‌సి. ఉద్యోగం: విశాఖస్టీల్ ప్లాంట్‌లో. ప్రచురణలు: 1. దేవునికి సాటి కల్పించుట మహా పాపం, 2.ప్రవక్త గారి నమాజ్ పద్ధతి, 3.విశ్వ ప్రవక్త దు'ఆ'లు, 4.ముస్లిమేతరుల కొన్ని ప్రశ్నలకు జవాబులు, 5. ఖుర్ ఆన్ మరియు సైన్స్, 6. ప్రవక్త బాట స్వర్గానికి బాట, 7. స్వర్గం -స్వర్గవాసులు, 8.ఇస్లాం ప్రియ బోధనలు, 9. ముస్లిం జీవనసరళి, 10.క్రైస్తవులకు అల్లాహ్ వైపు ఆహ్వానం. లక్ష్యం: ధార్మిక ప్రచారం-పరిచయం. **చిరునామా : బహదూర్, ఇంటి నం. 28-29-1, వడ్లపూడి, విశాఖపట్నం-46, విశాఖపట్నం జిల్లా. సంచారవాణి: 98480 67793**. Email: mdrehana@reduffmail.com



**బాషా ఖాదర్ షేక్ :** విశాఖపట్నం జిల్లా అనకాపల్లిలో 1967 జూన్ 30న జననం. తల్లితండ్రులు: సున్నీ బీబి, పీరు సాహెబ్. కలంపేరు: షేక్ బాష. చదువు: ఎం.ఏ.(హింది)., ఎం.ఏ (పొలిటిక్స్)., హింది పండిట్., సాహిత్యరత్న. ఉద్యోగం: ఉపాధ్యాయులు. చిన్నతనం నుండి రాస్తున్నా, రాసినవన్నీ 'బాషా తరంగిణి' పేరుతో అక్షర రూపు కట్టడం 2009లో జరిగింది. లక్ష్యం: అనాథల, బాలబాలికలను ఆదుకోవడం. **చిరునామా:**









**షేక్ ఖాదర్ బాషా, ఇంటి నం. 17-5-37, పీలాపోతు నాయుడు వీధి, గవరపాలెం, అనకాపల్లి- 531002, విశాఖపట్నం జిల్లా. సంచారవాణి: 92906 22644.**

**బజులుల్లా సాహెబ్ :** రాజమండ్రి నుండి వెలువడిన 'సత్యాన్వేషి' పత్రికను స్థాపించి, సంపాదకత్వం వహించారు. వీరేశలింగం పంతులు నడిపిన 'సత్యసంవర్ధని (1891-1897) పత్రికలో వచ్చే వ్యాసాలను ఖండిస్తూ వ్యాసాలు రాశారు. ఈ పత్రికలలో వాదోపవాదాలు కడు తీవ్రంగా ఉండేవి.

**బాషా హుసేన్ సయ్యద్ :** సయ్యద్ బాషా హుసేన్ ప్రకాశం జిల్లా మార్కాపురంలో 1939 మార్చి 31న జన్మించారు. తల్లితండ్రులు: సయ్యద్ అబ్దుల్ సలాం, మైమున్నీసా. గుంటూరు ఆంధ్రక్రైస్తవ కళాశాలలో బి.ఏ చదువుతున్న సమయంలో మంచి నటుడిగా మాత్రమే కాకుండా మంచి నాటక రచయిత, కవిగా ఖ్యాతిగాంచారు. రాష్ట్ర ప్రభుత్వ అటవీ శాఖలో ఉద్యోగం చేపట్టిన ఆయన కవితలు, కథానికలు ముఖ్యంగా నాటికలు, నాటకాలు



రాశారు. 'ఆశాజ్యోతి, ఆశాజీవులు, పసి హృదయాలు, జీవన కెరటాలు, సమాజంలో స్త్రీ' నాటికలు మంచి పేరు తెచ్చి పెట్టాయి. ఈ నాటికలు వందల ప్రదర్శనలకు నోచుకున్నాయి. కవితల ద్వారా వెల్లడించిన తన అభిప్రాయాలను 'గాయాలు-గేయాలు' కవితా సంకలం ద్వారా గ్రంథస్థం చేశారు. నాటక రంగంలో మంచి నటుడిగా ఖ్యాతిగాంచిన సయ్యద్ బాషా హుసేన్ చలన చిత్రాలలో కూడా నటించారు. స్వయంగా స్క్రిప్టును రూపొందించిన 'పెద్దింటి కోడలు', 'ఉత్తమురాలు' సినిమాల్లో నటించారు. అటవీ శాఖలో రేంజర్‌గా ఉద్యోగ విరమణ చేసిన సయ్యద్ బాషా హుసేన్ రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తూ సినిమాలకు రచయితగా సహకారం అందించారు. చివరి వరకు నాటకరంగం మీద ఎక్కువగా దృష్టిసారించిన సయ్యద్ బాషా హుసేన్ (స్వగ్రామమైన) యర్రగొండపాలెంలో 2008 డిసెంబరు 13న కన్నుమూశారు. (సమాచారం: 'ఇండియా' మాసపత్రిక, 2008 జనవరి. ఇంటర్వ్యూ: సయ్యద్ బాషా హుసేన్ కుమారుడు సయ్యద్ సాబిర్ హుసేన్, 2008 జనవరి 20, వినుకొండ.)

**బాషా జాన్ ఎస్ :** కడప జిల్లా ప్రొద్దుటూరు జన్మస్థలం. 1969 జూలై 19న జననం. తల్లితండ్రులు : ఎస్. ఖాదర్ హుస్సేన్, ఎస్. మస్తానమ్మ. కవితలు, గేయాలు వివిధ కవితా సంకలనాలలో చోటుచేసుకున్నాయి. 2007 ఏప్రిల్‌లో కన్నుమూశారు.

**బాషా మహబూబ్ షేక్ :** కడప జిల్లా పోరుమామిళ్ళలో 1976 నవంబరు 25న జననం. తల్లితండ్రులు: ఫాతిమా బీబీ, మహబూబ్ సాహెబ్. చదువు: ఎం.ఎ., ఎం.ఫిల్.

ఉద్యోగం: చరిత్ర అధ్యాపకులు. 1996లో ప్రచురితమైన 'హిందూ-ముస్లిం' కవిత ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ తెలుగు-ఆంగ్ల పత్రికలలో కవితలు, వ్యాసాలు ప్రచురితం. ఆంధ్రప్రదేశ్ హిస్టరీ కాంగ్రెస్ సమావేశాల (2004) లో సమర్పించి, ఆ తరువాత సంక్షిప్త రూపంలో వివిధ పత్రికలలో ప్రచురితమైన 'పాఠ్యపుస్తకాలలో మతతత్వ భావనలు' వ్యాసం ఇష్టమైన రచన. రాష్ట్ర ప్రభుత్వం ప్రచురించిన సాంఘిక శాస్త్రాల్లోని చరిత్ర పాఠాల్లో మతతత్వ వాసనలు ఉన్నవన్న విషయాన్ని విశదం చేసిన ఈ సుదీర్ఘ వ్యాసం రాష్ట్రంలోని పలు వర్గాలలో చర్చకు కారణమైంది. 'ఛిద్రమౌతున్న నెలవంక' శీర్షికన ముస్లింల స్థితిగతులను గణాంకాలతో సహా సాధికారికంగా వివరిస్తూ, రాజ్యాంగం మైనార్టీలకు కల్పించిన హక్కులను విశ్లేషిస్తూ, ముస్లింలకు విద్యా, ఉపాధి, రాజకీయ రంగంలో రిజర్వేషన్ల ఆవశ్యకతను వివరించిన ఈ సుదీర్ఘ వ్యాసం పలు వర్గాలలో చర్చకు కారణమై మంచి పేరుతెచ్చింది. ఈ వ్యాసం కూడా సంక్షిప్త రూపంలో పలు పత్రికల్లో ప్రచురితమైంది. ఈ మేరకు సుమారు అరవై పరిశోధనాత్మక వ్యాసాలు తెలుగు, ఆంగ్ల పత్రికలలో ప్రచురితం. లక్ష్యం: ప్రవక్త మార్గంలో నడిచి దోపిడీ, పీడనలు లేని సమాజ నిర్మాణం; మతతత్వ భావజాలానికి, కులోన్మాదానికీ వ్యతిరేకంగా రాజీలేని పోరాటం సాగించడం. **చిరునామా: షేక్ మహబూబ్ బాషా, చరిత్ర శాఖాధ్యక్షులు, బాబాసాహెబ్ అంబేద్కర్ కేంద్రీయ విశ్వవిద్యాలయం, రాయ్‌బరేలి, లక్నో-226025, ఉత్తరప్రదేశ్ రాష్ట్రం. సంచారవాణి : 95068 97455,** Email: bashalucknow@yahoo.com.



**బాషా మహబూబ్ గుత్తి :** అనంతపురం జిల్లా కళ్యాణదుర్గంలో1952 మే ఒకటిన జననం. తల్లితండ్రులు: గుత్తి రసూల్ బీ, గుత్తి నబీ రసూల్. చదువు: బిఎస్సీ. ఉద్యోగం: ఫార్మాస్యూటికల్ కంపెనీలో ఏరియా సేల్స్ మేనేజర్. తిలక్-చలంల కథలు-నవలల ప్రభావంతో సాహిత్యం పట్ల అభిమానం ఏర్పడింది. ఆ క్రమంలో 2003లో 'శూన్యంలోంచి శూన్యంలోకి' శీర్షికన రాసిన తొలి కథ 'రచన' మాసపత్రికలో ప్రచురితం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. ఆ క్రమంలో 2005లో రాసిన 'బైపాస్ రైడర్స్' కథ తొలుత ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధంలో ప్రచురితమై 'కథ-2005' కు ఎంపికయ్యింది. ఈ కథ పలు భాషల్లోకి అనువదించబడి ఆయా ఇతర భాషా పత్రికలలో చోటు చేసుకుంది. రచనలు: కథలు, కథానికలు, 'సగం మనిషి' (నవల). **చిరునామా: గుత్తి మహబూబ్ బాషా, నీలకంఠేశ్వర మెడికల్స్, ఓల్డ్ పోస్టాఫీసు రోడ్డు, నీలకంఠేశ్వర ఎక్స్‌టెన్షన్.**









**చిత్రదుర్గ-577501, చిత్రదుర్గ జిల్లా, కర్నాటక రాష్ట్రం. సంచారవాణి: 096117 68747, 94407 04132 (పిపి).**

**బాషా మహబూబ్ షేక్ :** నెల్లూరు జిల్లా నందవరంలో 1961 మే 28న జననం. తల్లితండ్రులు: షేక్ మహబూబ్‌బీ, షేక్ మస్తాన్ సాహెబ్. చదువు: బి.ఎ(లిట్)., ఎం.ఎ., బిఎఎంయస్. ఉద్యోగం: 'హైదరాబాద్ మిర్రర్' దినపత్రిక విజయవాడ ఎడిషన్ బాధ్యులు. 1979లో 'బీడీముక్క' కథానిక ఆంధ్రపత్రిక దినపత్రికలో ప్రచురితం కావడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికలలో కవితలు, కథలు, కథానికలు, వ్యాసాలు ప్రచురితం. కొన్ని కథానికలు ఇతర భాషల్లోకి అనువదించబడి ఆయా భాషా పత్రికలలో ప్రచురితం అయ్యాయి. రచనలు: 1. చీకటి మూసిన ఏకాంతం, 2. భారత నారీ బాధపడకు, 3. ప్రేమ పూజారులు, 4.ఎస్ నేనే, 5. ఆ రోజు..., 6. సమాజం కట్టిన సమాధులు, 7. యుగధర్మం (నవలలు). 1984లో రాసిన 'చీకటి మూసిన ఏకాంతంలో' (నవల) పాఠకుల మన్నన పొందింది. 1985లో పురుష ద్వేషం పై స్త్రీల మనోభావాలను సృజిస్తూ రాసిన 'భారత నారీ బాధపడకు' (నవల) దూషణ- భూషణలకు కారణమై గుర్తింపు తెచ్చి పెట్టింది. లక్ష్యం: సమాజాన్ని మానవత్వపు మూసలో పోయాలని. **చిరునామా: షేక్ మహబూబ్ బాషా, ఇంటి నం.10-146, ఎంబి వీధి, ఉదయగిరి-524226, నెల్లూరు జిల్లా. సంచారవాణి: 94414 33786,** Email: smbasha.sm@gmail.com



**బాషా ఎస్.ఎం :** కడప జిల్లా సిద్దవట్టం గ్రామంలో 1950 జూలై ఒకటిన జననం. తల్లి తండ్రులు: సయ్యద్ సాదిక్ బీ, సయ్యద్ ఫర్ఖుద్దీన్. కలం పేరు: చందు. చదువు: బి.ఎ., బి.ఎల్. ఉద్యోగం: రాష్ట్ర ప్రభుత్వ వ్యవసాయశాఖలో ఉద్యోగం ఐచ్ఛిక విరమణ తరువాత మానవ హక్కుల ఉద్యమకారుడిగా, రచయితగా స్థిరపడ్డారు. 1975లో 'జనపథం' పత్రికలో తొలి రచన ప్రచురితం. అనంతపురం జిల్లా ప్రజలు, ప్రధానంగా రైతాంగ సమస్యలను విశ్లేషిస్తూ పరిశోధనాత్మక వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురితం. ప్రజా సంఘాలు నిర్వహిస్తున్న ఉద్యమ పత్రికలకు రచయితగా చేయూత. రచనలు: 1. ఆరుగాలం, 2. అనంతపురం నీటి వనరులు. **చిరునామా: ఎస్.ఎం. బాషా, ఇంటి నం. 4-2-582, యువజన కాలనీ, అనంతపురం-515001, అనంతపురం జిల్లా. సంచారవాణి: 94406 83555,** Email: bashahrf_235@yahoo.co.in



**బాషా షేక్ :** గుంటూరు జిల్లా బాపట్లలో 1974 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ నూరున్నీసా, షేక్ మీరా సాహెబ్. చదువు: ఇంటర్. వ్యాపకం: జర్నలిస్ట్. 1990లో 'పాపం సుబ్బారావు' కథానిక ప్రచురితం కావడంతో రచనా వ్యాసంగం ఆరంభం. కవితలు, కథలు, వ్యాసాలు వివిధ పత్రికలలో, సంకలనాలలో ప్రచురితం. రాష్ట్ర ప్రభుత్వం 'పుష్కర అవార్డు'తో సత్కరించింది. ప్రస్తుతం బాపట్ల నుండి 'దర్గా' మాసపత్రిక సంపాదకులుగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. లక్ష్యం: అసమానతలు లేని సమ సమాజ నిర్మాణం కోసం ప్రజల్ని చైతన్యపర్చడం. **చిరునామా: షేక్ బాషా, ఇంటి నం.10-4-31, జెండా చెట్టు వీధి, బాపట్ల- 522101. సంచారవాణి: 93469 10988,** Email: darga@yahoo.com



**బాషా మహబూబ్ షేక్ :** గుంటూరు జిల్లా గుంటూరులో1947 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ హబీబున్నీసా బేగం, షేక్ ముహమ్మద్ ఖాశిం. చదువు: 12వ తరగతి, ఎం.ఎల్.టి.సి (ఉస్మానియా). 'నవీన సాహితి బాషా' గా విఖ్యాతులు. వ్యాపకం: ఆయుర్వేద వైద్యం. 1974లో పురాణం సుబ్రమణ్యం శర్మ ప్రోత్సాహంతో 'స్పందన' కథానిక ఆంధ్రజ్యోతి వారపత్రికలో (1974 ఫిబ్రవరి) ప్రచురితమైంది. అప్పటి నుండి కథలు, కథానికలు, నాటికలు, నాటకాలు, కవితలు, పరిశోధనా వ్యాసాలు వివిధ పత్రికలలో మాత్రమే కాకుండా కవితా, కథానికల సంకలనాలలో చోటు చేసుకున్నాయి. మంచి వక్త. తెలుగు భాషాభివృద్ధి ప్రధాన లక్ష్యంగా 'తెలుగు భాషాభివృద్ధి ఉద్యమ వేదిక' ఏర్పాటు చేసి వేదిక అధ్యక్షులుగా తెలుగు బాషాభివృద్ధికి నిరంతర కృషి. తెలుగు భాషాభిమాని. పురస్కారాలు: సాహితీ రత్న (పాలకొల్లు), సాహిత్య గాంధర్వ (విజయవాడ), తెలుగు వెలుగు బాషా (తెలుగు భాషా చైతన్య స్రవంతి, విజయవాడ). లక్ష్యం: తెలుగు అక్షరం ద్వారా తెలుగు భాషాభివృద్ధి. **చిరునామా: షేక్ మహబూబ్ బాషా, కేరాఫ్: షేక్ అఫ్రోజ్ అహ్మద్, ఇంటి నం.7-10-3/బి, గులాం అబ్బాస్ వీధి, వించిపేట, విజయవాడ- 520001, కృష్ణాజిల్లా. దూరవాణి: 93953 17066 (పిపి)**, Email: ahamed.afroz@ rocketmail.com



**బషీరానంద్ :** రాష్ట్ర రాజధాని హైదరాబాద్ నివాసం. 1982లో హైదరాబాద్‌లో జరిగిన 'ఆంధ్రప్రదేశ్ ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనం' సందర్భంగా వెలువడిన 'తెలుగు దివెవ్వలు' ప్రత్యేక సంచికలో 'స్నేహితునికి చిన్న మాట' వ్యాసం రాశారు.







**బషీరుద్దీన్ ముహమ్మద్ :** నల్గొండ జిల్లా మర్యాలలో 1931 జనవరి ఐదున జననం. తల్లి తండ్రులు: ఖైరాతున్నీసా, ఎం.డి జలాలుద్దీన్. కలంపేరు: ఘామడ్ నల్గొండవి. చదువు: మెట్రిక్. ఉద్యోగం: జిల్లా ఆరోగ్య శాఖలో ఉద్యోగ విరమణ. ప్రస్తుతం రచన ప్రధాన వ్యాపకం. 1970 లో రచనా వ్యాసంగం ఆరంభం. ప్రధానంగా ప్రభుత్వం చేపట్టిన కార్యక్రమాలను ప్రజల వద్దకు తీసుకెళ్ళడానికి అనువుగా చాలా పాటలు రాశారు. ఆయన రాసిన పలు పాటలు వివిధ పత్రికల్లో చోటు చేసుకున్నాయి. రచనలు: లోక గీతాలు (2008). లక్ష్యం: ప్రజలను మంచి మార్గం దిశగా చైతన్యపర్చడం. **చిరునామా: ముహమ్మద్ బషీరుద్దీన్, ఇంటి నం. 5-12-17, రహ్మత్‌నగర్, నల్గొండ- 508001, నల్గొండ జిల్లా. దూరవాణి: 08682-244839, 93913 26672.**



**బందే అలీ సయ్యద్ :** నిజామాబాద్ జిల్లా ఎల్లారెడ్డి తాలూకాలోని కుగ్రామంలో 1922 ప్రాంతంలో జన్మించారు. గ్రామాల్లో పొలాలకు వెళ్ళే పల్లె పడుచులు పాడుకునే పాటల పట్ల ఆకర్షితులై 5వ తరగతి నుండి పాటలల్లడం ఆరంభం. ఉన్నతపాఠశాలలో గురువులు నేర్పిన చందస్సు ఆధారంతో పద్యాలు విన్పిస్తూ సహవిద్యార్థుల అభినందనల ప్రోత్సాహంతో పలు పాటలు రాసి మనోహరంగా పాడటమేకాదు ఆ పాటలన్నీటిని కలిపి 'పల్లెపాటలు' పుస్తకాన్ని 'కేకలు' పత్రిక ఎడిటర్ బైసా రామదాసు సహకారంతో వెలువరించారు. ఆ తరువాత మరికొన్ని గేయాలతో 'కదలి రా' (గేయమాలిక) తెచ్చారు. వివిధపత్రికలలో వివిధాంశాల మీద వ్యాసాలు, కవితలు, పాటలు, గేయాలు ప్రచురితమయ్యాయి. బిఎస్ఎన్ఎల్ ఉద్యోగిగా, ఉద్యోగ సంఘం నేతగా ఆయన రాసిన నాటికలు ఆకాశవాణిలో ప్రసారం అయ్యాయి, ఉద్యోగ సంఘాలు చాలా నాటికలను ప్రదర్శించాయి. 1980లో పదవీవిరమణ చేశాక 'ప్రక్షాళన' ప్రబోధ గేయమాలికను తెచ్చారు. లక్ష్యం: సాహిత్యం ద్వారా వినోదం మాత్రమే కాకుండా వికాసం, విజ్ఞానాన్ని అందించడం. **చిరునామా: సయ్యద్ బందే అలీ, ఇంటి నం.2-4-72/168, ఫోర్ట్ వ్యూ కాలనీ, ఉప్పరపల్లి, రాజేంద్రనగర్, హైదరాబాద్-30.**



**బుడన్ సాహెబ్ షేక్ :** కడప జిల్లా కొత్తపల్లి జన్మస్థలం. తల్లితండ్రులు: మహబూబీ, ఖాశిం సాహెబ్. చదువు: బి.ఎ., బి.యల్. వృత్తి : న్యాయవాది. కడపలో న్యాయవాదిగా పనిచేస్తూనే రచనా వ్యాసంగం సాగించారు. 1965లో చారిత్రక పద్యకావ్యం 'ఖుతుబ్‌నామా' రాసేనాటికే ఉత్తమ కవిగా ఖ్యాతిగాంచారు. ఆనాటి ప్రముఖ పత్రికలన్నిటిలో ఆయన రచనలు

చోటుచేసుకున్నాయి. రచనలు: ఖుతుబ్‌నామా (1965), జలాల్‌నామా (అగ్బరు చరిత్ర, 1969), రామేనామా (పద్యకావ్యాలు). ఖుతుబ్‌నామా గ్రంథం మైసూరు విశ్వవిద్యాలయంలో డిగ్రీ విద్యార్థులకు పాఠ్యగ్రంథంగా అనుమతించారు. ఖుతుబ్‌నామా కావ్యాన్ని చదివిన కవిసామ్రాట్ విశ్వనాథసత్యనారాయణ చేసిన ప్రశంసా వ్యాఖ్య: 'ఏ పద్యము తీసినను వసుచరిత్రయో, మను చరిత్రయో, పారిజాతాపహరణమో స్మృతికి తగులుతున్నది' (ఖుతుబ్ నామా, 1965, ప్రచురణ: అబ్దుల్ సలాం, కడప). 1965లో 'గోలకొండ' శీర్షికతో రాసిన చారిత్రక పద్యకావ్యంలోని పద్యాలు పాలా వెంకట సుబ్బయ్య సంపాదకత్వంలోని 'కలభాషిణి' పత్రికలో ప్రచురితమయ్యాయి. ఆ పద్యాలకు మంచి పాఠకాదరణ లభించడంతో గోలకొండ చరిత్రను కావ్యముగా రాయమని వెంకట సుబ్బయ్య కోరగా పూర్తిస్థాయిలో 'ఖుతుబ్‌నామా' (పద్యకావ్యం) తయారయ్యింది.



**చాంద్ బాషా పి. :** అనంతపురం జిల్లా పెనుగొండ గ్రామంలో 1972 సెప్టెంబర్ ఎనిమిదిన జననం. కలంపేరు: జాబిలి, జయచంద్ర. తల్లితండ్రులు: ఎ.రమిజాబి, ఎ.జాఫర్ అలీ సాహెబ్. చదువు: ఎం.ఏ(హిందీ)., హెచ్పీటి. ఉద్యోగం: హింది పండిట్. 1996లో సాహిత్య రంగ ప్రవేశం. 2000లో 'మట్టిమనిషి' తొలి కవిత ప్రచురితం. అప్పటినుండి వివిధ పత్రికలలో, సంకలనాల్లో కవితలు, కథలు చోటుచేసుకున్నాయి.. అవార్డులు-పురస్కారాలు: రాధేయ కవితా పురస్కారం (2005, అనంతపురం), తెలుగు సాహితీ సమితి పురస్కారం (2006, కర్నూలు), శరత్ సాహితీ స్రవంతి పురస్కారం (2007, కరీంనగర్) ఇందుకూరి సాహితీ భారతి పురస్కారం (2008, నిజామాబాద్), జిల్లాస్థాయి ఉత్తమ సాహితీవేత్త (2007, అనంతపురం). లక్ష్యం: అసమానతలు లేని సమాజ నిర్మాణంలో కవిగా సాహిత్య సేవ. సామాన్య ప్రజల సమస్యల పరిష్కారం కోసం సామాజిక సేవా కార్యకర్తగా నిరంతరం చేయూత ఇవ్వడం. **చిరునామా: పి.చాంద్ బాషా, హిందీ పండిట్, ఇంటి.నంః 2/83/1, కమాన్ వీధి, పెనుగొండ -515110, అనంతపురం జిల్లా. సంచారవాణి: 94919 90313**, Email: jabilichand@gmail.mail



**దాదా హయాత్ యస్ :** నెల్లూరు జిల్లా వెంకటగిరిలో 1960 అక్టోబర్ 10న జననం. తల్లితండ్రులు: యన్. ఛోటీ రసూల్ బీ, ఎన్. బాబ్‌జాన్. స్వగ్రామం: కడప జిల్లా ప్రొద్దుటూరు. చదువు: బిఏ., బి.ఎల్. వృత్తి: న్యాయవాది. 1983లో తొలిసారిగా 'అహింస' శీర్షికతో రాసిన







కథ ఆంధ్రజ్యోతి వారపత్రికలో ప్రచురితం. ఈ కథను ఆ ఏటి ఉత్తమ భారతీయ కథల్లో ఒకటిగా 'జ్ఞానపీఠ్' వారు ఎంపికచేసి, హిందీలోకి తర్జుమా చేసి 1983 నాటి జాతీయ కథా సంకలనంలో చోటు కల్పించారు. అన్ని భారతీయ భాషల్లో ఈ కథ అనువాదమై



ఆయా భాషల పత్రికల్లో ప్రచురితమైంది. అప్పటి నుండి వివిధ పత్రికలలో, కథా సంకలనాలలో పలు కవితలు, కథానికలు, కథలు, సాహిత్య వ్యాసాలు, సమీక్షలు ప్రచురితం. అహింస, గుక్కెడు నీళ్ళు, మసీదు పావురం, మురళి వూదే పాపడు, ఎల్లువ, ఏటి ఒడ్డు చేపలు, వారసత్వం లాంటి కథలు గుర్తింపు తెచ్చి పెట్టాయి. 'మసీదు పావురం' కథని సాహిత్య అకాడమీ ఎంపిక చేసి హిందీలోకి అనువదించి ప్రచురించగా, 'ఎల్లువ కథ' తెలుగులోకి వచ్చిన నూరు మంచి కథలలో ఒకటిగా 'విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్' ఎంపిక చేసి సంకలనంలో స్థానం కల్పించింది. ప్రచురితమైన కథలలో సుమారు 20 కథలు ఆంగ్లంలోకి అనువాదమయ్యాయి. తెలుగులో ఇతరులు రాసిన మంచి కథలను ఆంగ్లంలోకి స్వయంగా అనువదించి వెలువరించారు. లక్ష్యం: తెలుగు కథకు విశ్వవ్యాప్తంగా ఖ్యాతి రావాలన్న బలమైన ఆకాంక్షకు తగిన కృషి. **చిరునామా: యన్. దాదా హయాత్, న్యాయవాది, ఇంటి నం. 3/400-12, సహారా రెసిడెన్సీ, సాయి కుటీర్ రోడ్డు, ప్రొద్దుటూరు-516360, కడప జిల్లా. దూరవాణి: 08564-257432. 9490004826,**

**డానీ యస్ :** పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురంలో 1951 ఆగస్టు27న జననం. పూర్తిపేరు: అహ్మద్ మొహిద్దీన్ ఖాన్ యజ్దానీ జర్రానీ. కలంపేరు. ఉషా యస్ డానీ, ఆషా, అజిత, ఫిదాయి, వశిష్టా నర్సాపురి. యజ్దానీ అనేది కాలక్రమంలో 'యస్.దానీ' గా,



'యస్ డానీ' గా, మారి చివరకు 'డానీ'గా ప్రాచుర్యం. తల్లితండ్రులు: సూఫియా బేగం, తరాజేష్ అలీ ఖాన్. చదువు: పియుసి. వృత్తి : జర్నలిస్ట్. పన్నెండో ఏట విద్యార్థిగా నాటిక రాసి పాఠశాలలో ప్రదర్శించడంతో రచనా వ్యాసంగం ఆరంభం. 1972లో రాసిన 'ప్రగతి' నాటిక బహుళ ప్రచారం పొంది బహుమతులు అందుకుంది. 1978 నుండి మార్క్సిస్టు (కార్మికవర్గ) దృక్పథంతో రచనలు చేయడం ఆరంభించగా వివిధ పత్రికలు, ఉద్యమ పత్రికలు, సంకలనాలలో పలు కవితలు, కథలు, నాటికలు, గేయాలు, సమీక్షలు, ప్రచురితం అయ్యాయి. ఆంగ్లంలోనూ పలు వ్యాసాలు రాశారు. ఆంగ్లం నుండి తెలుగులోకి పలు వ్యాసాలను అనువదించారు. 1978 నుండి

22 ఏళ్ళపాటు విప్లవ రచయితల సంఘం సభ్యుడిగా బాధ్యతలు నిర్వహించారు. పలు ప్రజా సంఘాలతో సంబంధాలు కలిగి ఆయా సంఘాలు నిర్వహించిన ఉద్యమాలకు సాహిత్య పరిపుష్టి కల్గించేందుకు రచయిత-కవిగా చేయూతనిచ్చారు. స్వయంగా సంఘాలు-సంస్థలు స్థాపించి ప్రజా సమస్యల పరిష్కారానికి కృషిచేశారు. ప్రస్తుతం 'వనిత' టీవీలో అవుట్‌పుట్ ఎడిటర్‌గా భాధ్యతలను నిర్వహిస్తూ, ఎన్‌టీవిలో 'లల్లూ బ్రదర్స్' ప్రోగ్రాం ఇన్‌చార్జిగా పనిచేస్తున్నారు. రచనలు: జూలియస్ ఫ్యూజిక్ (1981), ప్రహ్లాదుడు (1981) లక్ష్యం: అసమాన సమాజాన్ని సమసమాజం దిశగా నడిపించేందుకు అవసరమైన విధంగా ప్రజానీకాన్ని చైతన్యపర్చడం. **చిరునామా : అహ్మద్ మొహిద్దీన్ ఖాన్ యజ్దానీ జర్రానీ, 616, థర్డ్ ఫ్లోర్, శివా ప్యాలెస్ ఎక్స్‌టెన్షన్ లేన్, స్ట్రీట్ నం.10, గగన్ మహల్, దోమలగుడా, హైదరాబాద్-500029. సంచారవాణి: 98665 41148, 99480 92615 (పిపి).** Email: khanyazdani@yahoo.co.in

**దరియా హుస్సేన్ షేక్ :** గుంటూరు జిల్లా వినుకొండ జన్మస్థలం. తల్లితండ్రులు: మౌలాబి, ఇమాం సాహెబ్. పుట్టిన తేది: 01-07-1933. చదువు: వినుకొండ ఉన్నత పాఠశాలలో ఎస్ఎస్ఎల్‌సి, నరసరావుపేట ఎస్ఎస్‌యన్ కళాశాలలో బి.ఎ., రాజమండ్రిలో బి.ఇడి చేశారు. అనంతపురం జిల్లా కళ్యాణదుర్గం సమితిలో విస్తరణాధికారి (విద్యాశాఖ) గా ఉద్యోగం చేశారు. అష్టావధానాలు, కవి సమ్మేళనాలలో చురుగ్గా పాల్గొనడం మాత్రమే కాకుండా 'రాయల్ కళాగోష్టి' (అనంతపురం) కార్యదర్శిగా సాహిత్య-సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణలో మిక్కిలి ఆసక్తి చూపారు. రచనలు: పురుషోత్తముడు, విశ్వనాధ విజయము.

**దస్తగిరి అచ్చుకట్ల చిన్న :** కడప జిల్లా రాజుపాలెం మండలం దద్దనాల గ్రామంలో 1939 జూన్ 15న జననం. కలంపేరు: ఎసి దస్తగిరి. తల్లితండ్రులు: ఖాదర్‌బి, మహబూబ్ సాహెబ్. చదువు: భాషాప్రవీణ., వి.ఓ.ల్. ఉద్యోగం: అధ్యాపకులు, 1997లో విరమణ. విద్యార్థిగా 'సుషమ' సాహిత్య మాసపత్రికకు సంపాదకత్వం వహిస్తూ, పద్యాలు రాస్తూ రచనా రంగంలో ప్రవేశించారు. 1961లో ప్రతాప వెంకటయ్య శాస్త్రితో కలసి 'వర్తమానం' పద్యకావ్యం ప్రచురించారు. అప్పటి నుండి సాహిత్య సేవలో భాగంగా సాహిత్య సభల నిర్వహణ, అష్టావధానాలలో పాల్గొనడం, సాహిత్య-ధార్మిక ఉపన్యాసాలు చేయడంలో ఆసక్తి చూపడంతో పలు సాహిత్య ప్రసంగ వ్యాసాలు ఆకాశవాణి ద్వారా ప్రసారం అయ్యాయి. 1973లో 'నవ్య సాహితీ సమితి' (ప్రొద్దుటూరు) స్థాపించి పలు సాహిత్య కార్యక్రమాల నిర్వహణ. కవులను, రచయితలను ప్రోత్సహిస్తూ









పలువురి రచనలను నవ్య సాహితీ సమితి పక్షాన ప్రచురించి తోడ్పాటు అందించారు. స్వీయ రచనలు: 1. పద్యోపహరణము (1961), 2. వర్తమానం (1965), 3. అమృతమూర్తి, 4. కవితా భారతి (పద్యకావ్యాలు), 5. మణి మంజూష (ఖండ కావ్యం). ఈ రచనలలో 'అమృతమూర్తి' గుర్తింపు, ఖ్యాతిని తెచ్చిపెట్టింది. లక్ష్యం: సర్వమానవ సౌభ్రాత్రము -మానవతా దృష్టి-దేశభక్తి పెంపుదల దిశగా సాహిత్య కృషి. **చిరునామా : అచ్చుకట్ల దస్తగిరి, ఇంటి నం.26/210, నేతాజీనగర్, ప్రొద్దుటూరు-516360, కడప జిల్లా, సంచారవాణి: 98494 37454.**

**దావూద్ అలీ సయ్యద్ :** ఖమ్మం జిల్లా సత్తుపల్లి. తల్లితండ్రులు: ఇమాంబి, అబ్బాస్. చదువు: బి.ఎ, సాహిత్యరత్న (హిందీ). కాశ్మీరి భాషలో ప్రత్యేక డిప్లొమా. హిందీ పండితులు. కలం పేరు: మంజు. రచనలు: కవితలు, గేయాలు.

**దావూద్ ఇనగంటి :** ప్రకాశం జిల్లా నాగులపాలెంలో 1928 ఫిబ్రవరి 20న జననం. తల్లి తండ్రులు: మదార్‌బి, ఖాశిం సాహెబ్. చదువు: బి.ఏ. ఉద్యోగం: 1950లో మద్రాస్ సచివాలయం అధికారిగా ఉద్యోగం చేపట్టి 1986లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వంలో జాయింట్ సెక్రటరీగా రిటైర్డ్ అయ్యారు. 1967లో ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను విశ్లేషిస్తూ తెలుగు, ఆంగ్ల బాషల్లో వివిధ పత్రికలకు వ్యాసాలు రాయడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. వక్ఫ్ ఆస్తుల పరిరక్షణ, సద్వినియోగం గురించి రాసిన ఆంగ్ల వ్యాసం రాష్ట్రపతి డాక్టర్ జాకీర్ హుస్సేన్ ప్రశంసలందుకుంది. ఇస్లాం, క్రైస్తవం, హిందూ మతాలకు చెందిన ధార్మిక గ్రంథాలను సమన్వయ పరుస్తూ రాసిన వ్యాసాల విశిష్టత వలన ఆయా ధార్మిక సంస్థల సన్మానాలు పొందారు. 1998లో కౌలాలంపూర్‌లో జరిగిన ప్రపంచ తెలుగు మహాసభలకు ప్రతినిధిగా హాజరయ్యారు. ఆకాశవాణి ద్వారా ప్రసంగవ్యాసాలు ప్రసారం అయ్యాయి. రచనలు: నూర్ బాషీయుల చరిత్ర-సంస్కృతి (2001). లక్ష్యం: అన్నిరంగాలలో అసమానతలు తొలిగిపోవాలి. **చిరునామా: ఇనగంటి దావూద్, ఇంటి నం.198/3, ఆర్‌టి, విజయనగర్ కాలనీ, హైదరాబాద్-500057. దూరవాణి: 040-23345660.**



**దావూద్ సాహెబ్ షేక్ :** కర్నూలు జిల్లా చిట్వేలు జన్మస్థలం. తల్లితండ్రులు: ఖాదర్‌బి, సుల్తాన్ సాహెబ్. పుట్టిన తేది: 01-07-1916. చదువు: విద్వాన్ (తెలుగు-హిందీ), తెలుగు అధ్యాపకులు. కర్నూలు ఉస్మానియా కళాశాలలో తెలుగు- హిందీ పండితులుగా విద్యాబోధన గావించారు. అరబిక్, ఉర్దూ, తెలుగు భాషల్లో మంచి విద్వత్తును సంపాదించిన

ఆయన తెలుగు భాషాభివృద్ధి ధ్యేయంగా పలు కార్యక్రమాలను నిర్వహించారు. తెలుగులోకి పలు ఇతర బాషా గ్రంథాలను అనువదించి ప్రచురించారు. చివరి దశ వరకు తెలుగులో రచనలు గావించారు. రచనలు: చిత్త పరివర్తనము, దాసీపన్నా



(1956), రసూల్ ప్రభువు శతకము, సంస్కార ప్రయాణము (1957), సూఫి సూక్తులు, సంత్‌వాణి, అల్లా మాలిక్ శతకము, సఖుదా (శతకం), క్రీడాషడ్దీశ్వరము, సాయి శతకము, సాయిబాబా దండకము, సాయిబాబా చరిత్ర (కావ్యము), అభినవ తిక్కన కవితా సమీక్ష (వచనం), నాగూర్ ఖాదర్ వలీ చరిత్ర, ఆజాదు చరిత్ర, ఆదర్శము (నవల), అబ్దుల్ ఖాదర్ జీలాని, గౌసుల్ ఆజం దస్తగిరి దివ్య చరిత్ర (వచనం), చంద్ర వదన మోహియార్ (ఖండ కావ్యము) కదిరి సమాధి గాథ తదితరాలు స్వతంత్ర రచనలు. తెలుగు అనువాదాలు: అశ్రుమాల (జయశంకర్ కృతికి అనువాదం), అనంద కుమార (హిందీ మిలన్ అనువాదం).

**దేవీ ప్రియ :** గుంటూరు జిల్లా గుంటూరులో 1949 ఆగస్టు 15న జన్మించారు. అసలు పేరు: షేక్ ఖాజా హుస్సేన్. తల్లితండ్రులు: షేక్ ఇమాంబీ, షేక్ హుస్సేన్ సాహెబ్. చదువు: బి.ఎ. కలంపేరు: దేవీప్రియ. వృత్తి: పాత్రికేయులు. చిన్నతనం నుండి సాహిత్యం పట్ల మక్కువ చూపిన ఆయన 1967 కథలు, కవితలు రాయడంతో ఆరంభించి కవిగా సుప్రసిద్ధులయ్యారు. కవితలు, సాహిత్య వ్యాసాలు వివిధ పత్రికలు, సంకలనాలల్లో



ప్రచురితం. ఇతర భాషల్లోకి అనువాదమై ఆయా భాషా పత్రికల్లో చోటు చేసుకున్నాయి. రాష్ట్రంలోని వివిధ ప్రముఖ దినపత్రికలలో పలు బాధ్యతలను నిర్వహించారు. ఆ సందర్భంగా పత్రికా ప్రపంచంలో నూతన ఒరవడులకు కారణమయ్యారు. 'ఉదయం' దినపత్రికలో నిర్వహించిన 'రన్నింగ్ కామెంట్రీ' పాఠకుల అదరణ పొంది పేరు తెచ్చిపెట్టింది. ఆ ప్రక్రియను ప్రస్తుతం వివిధ పత్రికల్లో పనిచేస్తున్న రచయితలు, కవులు అనుసరిస్తున్నారు. స్వయంగా 'మనోరమ' వారపత్రిక నడిపారు. 'హైదరాబాద్ మిర్రర్' దినపత్రికకు వ్యవస్థాపక ప్రధాన సంపాదకులుగా పనిచేశారు. ప్రస్తుతం 'హెచ్ఎం టివీ'లో సీనియర్ ఎడిటర్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. 'ఉదయం' దినపత్రిక నాటి 'రన్నింగ్ కామెంట్రీ'ని 'హెచ్ఎం టివీ'లో దృశ్యీకరిస్తున్నారు. రచనలు: 1.సమజానంద స్వామి (1977), 2.అమ్మచెట్టు (1979), 3.నీటి పుట్ట (1990), 4.గరీబు గీతాలు (1992), 5.తుఫాను తుమ్మెద (1999), 6.పిట్ట కూడా ఎగిరి పోవాల్సిందే (2002), 7.చేప చిలుక (2005), 8.గంధకుటి (2009), 9.ఇన్షాల్లాహ్ (పద్య కావ్యం) లు ఇంతవరకు







ప్రచురితం. లక్ష్యం: సమాజశ్రేయస్సు. సామాజిక వాస్తవాలను, మనిషి హృదయ స్పందనలను సాహిత్యంలో ప్రతిబింప చేయాలన్నది. **చిరునామా: దేవీప్రియ, ఫ్లాట్‌నం.204, రాజకొండ టవర్స్, అల్వాల్, సికిందరాబాద్-10. సంచారవాణి: 9553586002,** Email: devi@hmtv.in

**దిలావర్ మహ్మద్ డాక్టర్ :** ఖమ్మం జిల్లా ఇల్లెందు తాలూక పాత కమలాపురంలో 1942 జూన్ ఐదున జననం. కలం పేరు : దిలావర్. తల్లితండ్రులు: మహబూబ్బీ, మహ్మద్ నిజాముద్దీన్. చదువు: ఎంఏ., బి.ఇడి., పి.హెచ్‌డి. ఉద్యోగం: అధ్యాపకులుగా 2000లో విరమణ. ఉన్నత పాఠశాలలో తొమ్మిదవ తరగతి చదువుతున్నప్పుడు స్కూల్ మ్యాగ్‌జైన్ 'ప్రగతి' కోసం 'తాజ్ మహల్' కథ రాయడం ఆ తరువాత పదవ తరగతిలో 'ఆకలి' కథానిక రాయడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. తొలిసారిగా 1969 ఆంధ్రజ్యోతిలో 'నవ్వులు' కవిత ప్రచురితమైంది. అప్పటినుండి రాష్ట్రంలోని వివిధ పత్రికలలో కథలు,



కవితలు, సాహిత్య వ్యాసాలు, సమీక్షలు, పరిశోధనాత్మక వ్యాసాలు ప్రచురితం. రచనా వ్యాసంగం పట్ల ఆసక్తి కలగడానికి ప్రధానంగా కౌముది (షంషుద్దీన్), ఆవంత్స సోమసుందరం కారణం కాగా శ్రీశ్రీ, తిలక్ పరోక్షంగా ప్రేరణ. అమెరికా తదితర దేశాలను పర్యటించిన సందర్భంగా ఆ దేశాల సాహిత్యంతో ఏర్పడిన పరిచయం దృష్ట్యా 20 దేశాలకు చెందిన సాహిత్య గ్రంథాలను సమీక్షిస్తూ రాసిన వ్యాసాలు పలు పత్రికల్లో చోటు చేసుకున్నాయి. రచనలు: 1.వెలుగు పూలు (1974), 2. వెన్నెల కుప్పలు (1980), 3.జీవన తీరాలు (1988), 4.కర్బలా (1999), 5.రేష్మా ... ఓ రేష్మా (కవితా సంపుటాలు, 2003), 6. గ్రౌండ్‌జీరో (దీర్ఘ కవిత, 2003), 7. మచ్చు బొమ్మ (కథల సంపుటి, 2008), 8. ప్రణయాంజలి (పద్యకావ్యం,2001), 9.ప్రహ్లాద చరిత్ర-ఎఱ్ఱన- పోతన : తులనాత్మక పరిశీలన (1989), 11. లోకావలోకనం (సాహిత్య సమీక్షా వ్యాసాలు, 2010). నవలలు: 1.సమిధలు (భారతి, 1985), 2.ముగింపు (కథాకళి, 1996), 3.తుషార గీతిక (జయశ్రీ, 1981). ప్రజా సంఘాలు, సాహితీ సంస్థల సన్మానాలు పొందారు. లక్ష్యం: అభ్యుదయ భావాల ప్రచారం, మత సామరస్యాన్ని పటిష్టపర్చడం. **చిరునామా: డాక్టర్ దిలావర్, ఇంటి నం: 565-11, సిటి కాంపస్, గాంధీనగర్, పాల్వంచ-507 154, ఖమ్మం జిల్లా. సంచారవాణి: 98669 23294.**

**దౌలా మహమ్మద్ షేక్ :** గుంటూరు జిల్లాలో 1925లో జన్మించారు. తల్లితండ్రులు: షేక్ మహమ్మద్ హటేల్ సాహెబ్, రహమతున్నీసా. చదువు: ఎస్ఎల్‌సి. ఉద్యోగం నిమిత్తం గుజరాత్ వెళ్ళి 1980లో తిరిగి రాష్ట్రానికి వచ్చి కరీంనగర్ జిల్లా గోదావరిఖని

అడ్డగుంటపల్లిలో కుమారుని వద్దకు వచ్చి స్థిరపడ్డారు. తెలుగు, ఆంగ్లం, గుజరాత్, హిందీ, ఉర్దూ భాషలలో మంచి ప్రావీణ్యం గల ఆయన విద్యాబోధన గావిస్తూ, ఆయా భాషలలో వెలువడిన ధార్మిక, సామాజిక, రాజకీయాంశాల మీద రాసిన పలు గ్రంథాలను అధ్యయనం చేసి సరళమైన తెలుగు భాషలోకి అనువదించారు. అంబేద్కరిజం, అంటరానితనం, సమానత్వం, మానవహక్కులు, ధర్మాచరణ తదితర అంశాలను ప్రధాన వస్తువులుగా స్వీకరించి కవితలు, కథలు, వ్యాసాలు రాశారు. ఆంగ్లంలో రాసిన వ్యాసాలు పత్రికల్లో చోటు చేసుకున్నాయి. కవులు, రచయితలు, పాత్రికేయుల సంఘాలతో మమేకమై పనిచేసిన షేక్ దౌలా రచనలు పివి నరసింహారావు, బెనారస్ విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ వేదవ్యాస్, బిఎస్పీనేత కాన్షిరాం లాంటి ప్రముఖుల ప్రశంసలను అందుకున్నాయి. చివరివరకు సాహిత్య సంస్థల సేవలో గడిపిన షేక్ దౌలా 2006 ఆగస్టు 30న అడ్డగుంటపల్లిలో కన్నుమూశారు. (సమాచారం: ఈనాడు దినపత్రిక, 30-09-2006, షేక్ దౌలా కుమారులు షేక్ మహమ్మద్ అతాఉల్లా, 2009 డిసెంబర్ 11, కరీంనగర్)



**దౌలత్ బేగం** : కృష్ణా జిల్లా మచిలీపట్నం. పుట్టిన తేది: 17-06-1937. చదువు: బి.ఏ. అప్పటి చిరునామా: బి 11/యఫ్ 2, విజయనగర్ కాలనీ, హైదరాబాద్. రచనలు: అభిమానస్తులు (నవల), గేయాలు, కథలు. గుప్పెడంత మనస్సు, గేయాలు

**ఫరీద్ సాహెబ్ షేక్ ఇదలాపురం** : గుంటూరు జిల్లా వినుకొండ జన్మస్థలం. 1890 ప్రాంతంలో జన్మించారు. శనగల వ్యాపారి. వినుకొండ పెదనాల్సా బజారులో నివాసం. ఆశుకవిత్వం చెప్పడం, అష్టావధానాలలో పాల్గొనడంలో మంచి అభిరుచి చూపారు. 1949లో వినుకొండలో పోకూరి కాశీపత్యావధాని నిర్వహించిన అష్టావధానంలో పృచ్ఛకునిగా పాల్గొన్నారు. ప్రముఖ కవి పండితులు తుమ్మల సీతారామమూర్తి, బెజవాడ గోపాల రెడ్డి లాంటి పెద్దల సమక్షంలో పొన్నూరు, బాపట్ల, నెల్లూరు పట్టణాలలో పలు సత్కారాలు, సన్మానాలు పొందారు. పొన్నూరులో తుమ్మల నిర్వహించిన సన్మాన కార్యక్రమం సందర్భంగా 'మధురకవి' బిరుదుతో సత్కారాన్ని అందుకున్నారు. రాష్ట్రంలోని నిర్వహించిన పలు సాహిత్యసభలలో పాల్గొన్నారు. చివరి క్షణం వరకు రచనా వ్యాసంగాన్ని కొనసాగించారు. రచనలు: ఇందిర, ఖండకావ్యం, గోరువంక, దక్షిణ గోగ్రహణము, వేమన, రిక్షావాలా లాంటి పద్య కావ్యాలు. వినుకొండలో కన్నుమూశారు. (సమాచారం: ప్రముఖ కవి కంచర్ల పాండురంగ శర్మ, 14-12-2009, వినుకొండ)









**ఫరీద్ షేక్** : గుంటూరు జిల్లా చిలకలూరిపేట మండలం వేలూరు గ్రామంలో 1927 మార్చి రెండున జననం. తల్లితండ్రులు: మస్తాన్ బీ, నాసర్ సాహెబ్. కలంపేరు : సంస్కారి. చదువు: బి.ఏ. వృత్తి : ఉపాధ్యాయులు. 1950లో ఉద్యోగంలో చేరిక, 1993లో ఉద్యోగ విరమణ. ఉపాధ్యాయుల సంఘాలలో ప్రముఖ పాత్ర వహించిన ఆయన స్వయంగా 'అభ్యుదయ ఉపాధ్యాయ మండలి' (1986)ని ఆరంభించి వ్యవస్థాపకులుగా సంస్థ సభ్యుల అభ్యున్నతి, హక్కుల సాధనకు నిరంతరం కృషి చేశారు. మంచి వక్త, ఉపాధ్యాయ నేతగా ఖ్యాతి గడించారు. చివరి వరకు రచనా వ్యాసంగం కొనసాగిస్తూ 2008 అక్టోబర్ 16న చిలకలూరిపేటలో కన్నుమూశారు. రచన: చైతన్య స్వరాలు (కవితా సంపుటి, ఫిబ్రవరి, 2008). (సమాచారం: షేక్ అలీ, కావూరు)



**ఫాతిమున్నీసా షేక్** : కడప జిల్లా ప్రొద్దుటూరులో జననం. తల్లితండ్రులు: అయేషా బీబి, డాక్టర్ ఖాశిం సాహెబ్. కలం పేరు: ఫాతిమా బద్దేలి, మున్నీ. చదువు: పదవ తరగతి. తండ్రి ప్రోత్సాహంతో ధార్మిక గ్రంథాలను అధ్యయనం చేసి ధార్మిక వ్యాసాలు రాయడం ఆరంభించారు. మొట్టమొదటి ధార్మిక వ్యాసం 'పర్దా ఔన్నత్యం' వ్యాసం 2004లో 'గీటురాయి' వారపత్రికలో ప్రచురణ అయినప్పటి నుండి వివిధ ధార్మిక పత్రికలలో వ్యాసాలు, కథానికలు ప్రచురితం. లక్ష్యం: ఇస్లామీయ సత్య సందేశాన్ని సరళమైన తెలుగు భాషలో ప్రజలకు చేర్చడం. **చిరునామా: షేక్ ఫాతిమున్నీసా, ఇంటి నం. 7/4129/2, శ్రీనివాసనగర్, ప్రొద్దుటూరు-516360, కడప జిల్లా.**

**ఫజులుల్లా ఖాన్** : గుంటూరు జిల్లా తెల్లప్రోలులో 1970 మే 27న జననం. తల్లి తండ్రులు: షమీమా బేగం, కరీముల్లా ఖాన్. చదువు: ఎంఏ (ఆర్కియాలజీ)., ఎం.ఫిల్. ఉద్యోగం: జర్నలిజం. 1992లో సుప్రభాతం పత్రికలో వ్యాసాలు రాయడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటినుండి వివిధ పత్రికలలో వ్యాసాలు, కవితలు ప్రచురితం. 'ప్రజాగళం' మాసపత్రిక (2006) సంపాదకులు. రచనలు: హజ్ యాత్ర (2009). అవార్డులు-పురస్కారాలు: బెస్ట్ సిటిజన్ అవార్డు (ఉయ్యాల కమ్యూనికేషన్స్, హైదరాబాద్, 2003), వికాస శిరోమణి అవార్డు (ఢిల్లీ తెలుగు అకాడమి, 2006), ఉగాది పురస్కారం (శ్రీ అన్నమయ్య కళా పీఠం, 2007), సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్ స్మారక అవార్డు (యునైటెడ్ డెవలప్‌మెంట్ ఆర్గనైజేషన్, 2008). లక్ష్యం: ప్రజలను సామాజిక రుగ్మతల నుండి విముక్తం దిశగా చైతన్యపర్చడం. **చిరునామా: ఫజులుల్లా**



ఖాన్, ఇంటి నం: **18-8-223/121/10/ఎ1, రాజనర్సింహ నగర్ కాలనీ, సైదాబాద్, హైదరాబాద్. సంచారవాణి: 99482 54564**, Email: devi@hmtv.in

**ఫక్రుద్దీన్ :** కడప జిల్లా దువ్వూరి నివాసి. పలు వేదాంత రచనలు చేశారు. ఆధ్యాత్మిక తత్వాలను సేకరించి తెలుగులో వెలువరించారు.

**ఫక్రుల్లా సాహెబ్ :** కడప జిల్లా కమలాపురం తాలూక తిప్పలూరు గ్రామం జన్మస్థలం. తల్లితండ్రులు: రసూల్ బీ, దాదా సాహెబ్. రచనలు: శ్రీరామాయణ సంకీర్తనము (గేయం), విరాటపర్వం, భక్త ప్రహ్లాద, భక్తకుచేల, శ్రీమోహిని రుక్మాంగద చరిత్ర (ద్విపద కావ్యాలు) శ్రీమత్ ఆంధ్ర మహాభారతము. నటుడు, గాయకులు.

**గఫార్ ముహమ్మద్ అబ్దుల్ :** మహబూబ్‌నగర్ జిల్లా ఉప్పనుంతలలో జననం. తల్లితండ్రులు: మొగులాన్ బీబి, అబ్దుల్ సత్తార్. కలంపేరు: ఎంవి గఫార్. చదువు:ఎంఏ.,బి.ఇడి ఉద్యోగం: ఉపాధ్యాయులు. 1981లో ఆకాశవాణిలో 'మారుతున్నది మనిషా? సమాజమా? కవిత ద్వారా రచనావ్యాసంగం ఆరంభం. వివిధ పత్రికలలో, సంకలనాలలో కవితలు, నానీలు ప్రచురితం. 'నా దేశం ఎటు పోతుంది' కవిత ద్వారా మంచి గుర్తింపు. లక్ష్యం: సమాజంలో మానవత్వం నింపడం. రచనలు: చైతన్యదీపిక (కవితా సంపుటి), నల్లమల రత్నాలు(నానీలు). **చిరునామా: ఎం.ఏ గఫార్, ఇంటి నం. 2-5, ఉప్పనుంతల-509 376, మహబూబ్‌నగర్ జిల్లా, సంచారవాణి: 9490324834.**



**గఫార్ పులివీడు షేక్ :** కడప జిల్లా పెద్ద పులివీడు గ్రామంలో 1966 అక్టోబర్ 14న జననం. తల్లితండ్రులు: హుస్సేన్ బి, హుస్సేన్ పీరా. చదువు: ఎం.ఏ., బి.ఇడి. వృత్తి: ఉపాధ్యాయులు. కలంపేరు: ఎస్‌పి. గఫార్. 2004 జనవరి 31న వార్త దినపత్రికలో 'గురు సాక్షాత్ పరబ్రహ్మ' వ్యాసం ప్రచురితం కావడం ద్వారా సాహిత్య రంగ ప్రవేశం. పత్రికల్లో, సంకలనాల్లో కవితలు, కథానికలు, వ్యాసాలు ప్రచురితం. ప్రధానంగా ముస్లింలకు కల్పించిన రిజర్వేషన్లకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నవారికి, రాసిన వారికి దీటుగా సమాధానాలిస్తూ వివిధ పత్రికలలో రాసిన పలు వ్యాసాలు గుర్తింపు తెచ్చిపెట్టాయి. చరిత్ర, సామాజిక శాస్త్రాల ప్రాధాన్యతను ప్రజలకు ఎరుకపర్చి సామాజిక చైతన్యం రగిలించేందుకు 'పీపుల్ ఫర్ సోషల్ సైన్స్' సంస్థ వ్యవస్థాపక అధ్యక్షులుగా బాధ్యతల నిర్వహణ. లక్ష్యం: చైతన్య రాహిత్యంతో నిర్జీవంగా వున్న ముస్లిం









జాతి ప్రయోజనాల కోసం పని చేయడం, మతసామరస్య-లౌకిక వ్యవస్థలను మరింతగా పటిష్టపర్చడం కోసం రచనా వ్యాసంగాన్ని విస్తృతంగా సాగించడం. **చిరునామా: ఇంటి నం.15/248, బెస్తవీధి, పోరుమామిళ్ళ-516193, కడప జిల్లా. దూరవాణి: 08569-285241, సంచారవాణి: 94416 83183.**

**గఫార్ సయ్యద్ :** నల్లగొండ జిల్లా దామచర్ల మండలం వాడపల్లిలో 1956 జనవరి మూడున జననం. తల్లితండ్రులు: సయ్యద్ మాలన్‌బి, సయ్యద్ అయూబ్ అలి. చదువు: బిఏ., విద్వాన్., డిఓయల్. చిన్నవయస్సు నుండి సాహిత్యపఠనం పట్ల ప్రత్యేకాభిలాష. 1973లో కళాశాల లిఖిత మాసపత్రికలో 'లేఖ' కవిత ప్రచురితమైంది. అప్పటినుండి వివిధ పత్రికలలో, కథా-కవితా సంకలనాల్లో కవితలు, కథలు చోటు చేసుకున్నాయి. పలు నాటికలను స్వయంగా రాసి నటించి, ప్రదర్శించి ప్రశంసలు అందుకున్నారు. కవితల్లో 'అంగట్లో దొరికే సరుకు కాదు దేశభక్తి' (జల్‌జలా కవితా సంకలనం), 'అమ్మా... నేనే...నే' (అజాఁ), 'జనన వాగ్మూలం' (జిహద్) లాంటి కవితలు మంచి గుర్తింపు తెచ్చిపెట్టాయి. ఫోటోగ్రాఫర్‌గా, నాటక రచయితగా, నటుడిగా సుప్రసిద్దులు. చలనచిత్రాలలో నటించారు. 'పంచాయితీ రాజ్ లీడర్' మాసపత్రిక సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. లక్ష్యం: సామాజిక చైతన్యం కలుగచేయగల సత్తా ఉన్న రచనలు పాఠకులకు అందించాలన్నది. **చిరునామా: సయ్యద్ గఫార్, క్లిక్ అండ్ ఫ్లాష్ డిజిటల్ స్టూడియో, మిర్యాలగూడ-508207, నల్లగొండ జిల్లా. సంచారవాణి: 90108 83848.** Email: panachayathrajleader@gmail.com.



**గఫూర్ ముహమ్మద్ అబ్దుల్ షేక్ :** కరీంనగర్ జిల్లా సిరిసిల్లాలో 1978 జూన్ ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ రజియాబీ, షేక్ అబ్దుల్ రషీద్. కలంపేరు: సిరిసిల్లా గఫూర్ శిక్షక్. చదువు: ఎం.ఏ (హిందీ). వృత్తి: ఉపాధ్యాయులు. 1980లో 'బాలభారతి' మాస పత్రికలో రాసిన 'హిట్లర్-నెపోలియన్' వ్యాసంతో రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి బాల బాలికలకు ఉపయుక్తమగు చరిత్రకు సంబంధించిన పలు వ్యాసాలు రాసి వివిధ పత్రికలలో వెలువరించారు. రాష్ట్రంలోని వివిధ పత్రికల్లో పలు కవితలు, సాహిత్యవ్యాసాలు సమీక్షా వ్యాసాలు ప్రచురితం. సంకనాల్లో కవితలు చోటు చేసుకున్నాయి. రచనలు: తబ్దీల్ (వచన కవితా సంపుటి, 2009). పురస్కారాలు: ఇందూరు సాహితీ పురస్కారం (నిజామాబాద్ జిల్లా). లక్ష్యం: గ్రామీణ



ప్రాంతాల దయనీయ స్థితిని, ప్రజల దుర్భర జీవితాలు, వారి అవస్థలను సమాజం దృష్టికి తీసుకొచ్చేందుకు కృషి. **చిరునామా: సిరిసిల్లా గఫూర్, హింది పండిట్, ఇంటి నం. 5-8-86, శ్రీరాం నగర్ కాలనీ, కామారెడ్డి-503111, నిజామాబాద్ జిల్లా. సంచారవాణి: 98490 62038.** Email: sirsillagafoor@yahoo.com

**గఫూర్ బేగ్ ముహమ్మద్ :** ప్రస్తుత ప్రకాశం జిల్లా కంభంలో జన్మించారు. చిన్నతనం నుండి సాహిత్యాభిలాషి. పలు కవితలు, గేయాలు, వివిధ పత్రికలలో ప్రచురితం అయ్యాయి. 1976 ప్రాంతంలో హైదరాబాదులోని రాష్ట్ర ప్రభుత్వ సచివాలయంలోని న్యాయ విభాగంలో ఉద్యోగ బాధ్యతలు నిర్వహించారు. తెలుగు సాహిత్యం పట్ల అభిమానం మెండుగా గల ఆయన హైదరాబాదు నగరంలో జరిగిన వివిధ సాహిత్య కార్యక్రమాల నిర్వహణలో ప్రధాన పాత్రను పోషించారు. రచనలు: నిరపరాధులు (కథా సంపుటి), గ్రీష్మంలో ఓ వసంతం (నాటిక), కరిగిన మనసులు లాంటి గ్రంథాలను రాసి స్వయంగా వెలువరించారు. (సమాచారం: డాక్టర్ షేక్ మస్తాన్, అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం, అలీఘర్, 14.04.2010)



**గఫూర్ యస్ :** కర్నూలు జిల్లా, పాత్రికేయులు. కథలు, వ్యాసాలు.

**గయాజ్ బాషా షేక్ :** ప్రకాశం జిల్లా కనిగిరిలో 1962 ఆగస్టు ఒకటిన జననం. తల్లితండ్రులు: మస్తాన్ బీ, షేక్ పాచ్ఛామియా. కలంపేరు: కనిగిరి గయాజ్. చదువు: ఇంటర్మీడియట్., డిప్లొమా ఇన్ ఎలక్ట్రానిక్స్. ఉద్యోగం: వ్యాపారం. చిన్నతనం నుండి కళారంగం, సాహిత్యం మీద దృష్టి. పలు పాటలు, కవితలు వివిధ పత్రికలలో ప్రచురితం. రచనలు: 1.స్వర కవనం (పాటల సంపుటి, 2010), 2. నువ్వు-నేను-ఆకాశం (పాటల సంపుటి, 2010). అవార్డులు: రాష్ట్ర ఉత్తమ పౌరుడు, సేవారత్న, కళారత్న అవార్డులు. లక్ష్యం: సామాజిక సమస్యలకు రచనల ద్వారా, కళారూపాల ద్వారా పరిష్కార మార్గాలను చూపించడం. **చిరునామా: షేక్ గయాజ్ బాషా, ఇంటి నం. 4-125, నాల్గవ వార్డు, బాదుల్లా వారీ వీధి, కనిగిరి-523230, ప్రకాశం జిల్లా. సంచారవాణి: 99664 27276.**



**ఘన్ షైదా షేక్ (గని) :** గుంటూరు జిల్లా గుంటూరులో 1954లో జననం. పూర్తిపేరు: షేక్ ఘన్ షైదా. తల్లితండ్రులు: షేక్ ఫాతిమాబీ, అబ్దుల్ రహిమాన్. చదువు: ఇంటర్మీడియట్.







వృత్తి: గాయకుడు, సామాజికకార్యకర్త. కలంపేరు: గని. 1973 నుండి ప్రజానాట్యమండలి కళాకారుడిగా పాటలు, గేయాలు రాయడం పాడటం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటినుండి పలు కవితలు, గేయాలు, వ్యాసాలు వివిధ పత్రికలలో, పలు సంకలనాలలో, పాటల పుస్తకాలలో చోటు చేసుకున్నాయి. ప్రజా ఉద్యమాలను మరింత బలంగా, స్ఫూర్తిదాయకంగా ముందుకు తీసుకెళ్ళేందుకు, మూఢ నమ్మకాలకు వ్యతిరేకంగా, దురలవాట్లను రూపుమాపే లక్ష్యంగా గేయాలు రాసి స్వయంగా పాడుతూ మంచి గాయకుడిగా ప్రజల మన్నన పొందారు. పురస్కారాలు: నరసగాన రత్నాకర (బాలభారతి, గుంటూరు, 2003). ప్రజాకళాకారుడిగా పలు ప్రజా సంఘాలచే సత్కారాలు అందుకున్నారు. లక్ష్యం: మనిషిని మనిషిగా గుర్తించే సమాజం కోసం కలం-గళం కలిపి పనిచేస్తూ ఆ దిశగా ప్రజానీకాన్ని పురికొల్పుట. **చిరునామా: షేక్ ఘన్ షైదా (గని), ఇంటి నం. 26-11-12, ఇస్లాంపేట, నగరంపాలెం, జెండాచెట్టు వీధి, గుంటూరు-522 004, గుంటూరు జిల్లా. సంచారవాణి: 94414 52819.**



**గౌస్ ఖాన్ పి. :** కడప జిల్లా రాజంపేటలో 1946 ఏప్రిల్ 12న జననం. తల్లితండ్రులు: పి. ఖైరూన్ బి, పి. మహబూబ్ ఖాన్. ఉద్యోగం: తెలుగుగంగ ప్రాజెక్టు, కడప. 1975 నుండి రచనావ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి కవితలు, కథలు వివిధ పత్రికలలో ప్రచురితం. దూరదర్శన్, ఆకాశవాణిలో ధార్మిక-సామాజిక అంశాల మీద ప్రసంగాల ప్రసారం. అవార్డులు: కవిమిత్ర (కడప,2000), మిలినియం అవార్డు (2000). లక్ష్యం: మతం ప్రధానం కాదు, మమత ముఖ్యమని పది మందికి రచనల ద్వారా తెలపడం. **చిరునామా: పి.గౌస్‌ఖాన్, ఇంటి నం.2/270, దేవాలయం వీధి, మారుతీనగర్, కడప, కడప జిల్లా. సంచారవాణి: 98484 70358.**





**గౌస్ ఖాన్ పియండి. :** ప్రకాశం జిల్లా లోథిఖాన్ పేటలో 1973 అక్టోబర్ 10న జననం. తల్లితండ్రులు: హాఫిజాబి, పి. జాఫర్ ఖాన్. చదువు: బిఎస్సీ., బి.ఇడి. వృత్తి: ఉపాధ్యాయులు. 1996లో 'గీటురాయి' వారపత్రికలో ధార్మిక వ్యాసం రాయడం ద్వారా రచన వ్యాసంగం ఆరంభమై వివిధ పత్రికలలో ధార్మిక-సామాజిక వ్యాసాలు, కవితలు ప్రచురితం. ఆకాశవాణిలో ధార్మిక ప్రసంగాలు ప్రసారం. బాల బాలికలకు ప్రధానంగా పాఠశాల

విద్యార్థులకు ఉపయుక్తమగు నాటికల ప్రదర్శన మాత్రమే కాకుండా ఆకాశవాణి, టీవి ఛానెల్స్ ద్వారా ప్రసారం అయ్యాయి. ఉర్దూ భాష నుండి పలు గ్రంథాలను తెలుగులోకి అనువదించారు. అనువాద గ్రంథాలు: 1. ఇస్లామీయ ఉద్యమం-కార్యకర్తలు, 2. ఇస్లామీయ వ్యవస్థలో ముస్లిమేతరుల హక్కులు, 3.రమజాను ఉపవాసాలు, 4. ఇస్లామియా నియమ నిబంధనలు, 5. బాల్య వివాహాలు-ఇస్లాం, 6.యువకుల సమస్యలు-పరిష్కార మార్గాలు. లక్ష్యం: సర్వమానవాళి క్షేమం. **చిరునామా: పిఎండి గౌస్‌ఖాన్, లోధిఖాన్‌పేట-523 346, బెస్తవారిపేట (మ), ప్రకాశం జిల్లా. సంచారవాణి: 94901 76240, 94901 76239.**

**గౌస్ మొహిద్దీన్ ముహమ్మద్ :** నల్గొండ జిల్లా నల్గొండలో 1974 జూన్ 22న జననం. తల్లితండ్రులు: ఫైజున్నీసా బేగం, ముహమ్మద్ షంషుద్దీన్. చదువు: ఎం.ఏ., ఎం.ఫిల్., బి.ఇడి. ఉద్యోగం: అధ్యాపకులు. రాష్ట్రంలోని వివిధ పత్రికలలో, పలు కవితా, కథా సంకలనాల్లో కవితలు, కథానికలు సాహిత్య వ్యాసాలు ప్రచురితం. రచనలు: 1. 'గుంజాటన' (ముస్లిం, శూద్ర కవితా సంకలనం, 2006), 2. అత్తరు సీసా (2010). లక్ష్యం: బడుగు బహుజన మైనార్టీ వర్గాలను సాహిత్యం ద్వారా మరింతగా సన్నిహితం చేయడం. **చిరునామా: మొహమ్మద్ గౌస్ మొహిద్దీన్, ఇ.నం. 5-11-222, హైదర్‌ఖాన్ గూడెం, నల్లగొండ-508001, నల్గొండ జిల్లా. సంచారవాణి: 9985093243.**



**గౌస్ మొహిద్దీన్ ఎస్. :** కడప జిల్లా ప్రొద్దుటూరు తాలూకా వెలవలి గ్రామం. కలం పేరు: వెలవలి. రచనలు: కాకమ్మ కథలు, కన్నీటి కానుక (నవలలు), జీవితం ఒక జూదం (నాటిక). నటుడు, దర్శకులుగా విఖ్యాతులు.

**గులాం గౌస్ షేక్ :** కృష్ణా జిల్లా మైలవరం తాలూకా చీమలపాడులో 1955 జూన్ 10న జననం. తల్లితండ్రులు: హమాత్ బీబి, ముహమ్మద్ అబ్దుల్ ఖాదర్. అసలు పేరు గులాం గౌస్ అయినప్పటికి 'శాతవాహన' 'ఏకెఏ' పేరుతో సుప్రసిద్ధులు. చదువు: బి.ఏ (లిట్)., సాహిత్య విశారద. పిజి డిప్లొమా ఇన్ జర్నలిజం. ఉద్యోగం: 'ప్రభవ' మాసపత్రికతో ఆరంభమై 'సితార', 'ఉదయం' దినపత్రికలో పలు బాధ్యతలు నిర్వహించారు. 1974లో ఆంధ్రజ్యోతి వారపత్రికలో 'మానవత' కవిత రాయడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి సుమారు వందకు పైగా కథానికలు, ఇతర భాషల్లో నుండి తెలుగులోకి అనువదించిన 40 కథలు, వందకు దాటిన కవితలు వివిధ పత్రికలలో









చోటు చేసుకున్నాయి. పలు కవితలు, కథానికలు ఇతర భాషల్లోకి అనువదించబడి ఆయా భాషా పత్రికల్లో స్థానం సంపాదించుకున్నాయి. యాభై నవలలు వెలువడ్డాయి. ఈ నవలల్లో 35 వివిధ పత్రికలలో ధారావాహికంగా ప్రచురితమై ఆ తరువాత నవలలుగా వెలువడ్డాయి. 15 నవలలు నేరుగా ప్రచురితం. ఈ నవలల్లో 'మహా యజ్ఞం, నిశ్శబ్ద యుద్ధం, వజ్ర సంకల్పం, దానవ రాజ్యం, అరుణతార, సుదర్శన చక్రం, కాలుతున్న పూలతోట, టిపూ సుల్తాన్, అంగార తల్పం, అగ్ని రథం, అనుక్షణం అన్వేషణ' లాంటి నవలలు ప్రజాదరణ పొందాయి. దూరదర్శన్‌లో ప్రసారమైన 1. మహా భారతం (1988-89), 2. రామాయణ్ (1989-90), 3. టిపూ సుల్తాన్ (1990-91), 4.పరమ వీర చక్ర లాంటి మెగా సీరియల్స్ అనువాదాలు ఆంధ్రజ్యోతి దినపత్రికలో ధారావాహికంగా ప్రచురితమయ్యాయి. ప్రముఖ హిందీ రచయితలు రాసిన పలు నవలలను తెలుగులోకి అనువదించి 'చతుర' మాసపత్రికలో ధారావాహికంగా వెలువరించారు. చలనచిత్ర రంగంలో 'నాగాస్త్రం, ఇరుగిల్లు-పొరుగిల్లు, విధాత, అర్చనా ఐఏయస్, ఆడపిల్ల' లాంటి సినిమాలకు కథను సమకూర్చడం మాత్రమే కాకుండా స్క్రీన్‌ప్లే కూడా అందించారు. 'వచ్చినవాడు సూర్యుడు' చిత్రానికి పాటలు రాశారు. బుల్లితెరకు వచ్చేసరికి జెమినీ టెలివిజన్‌లో ప్రసారమైన 'కలశం' సీరియల్‌కు కథను సమకూర్చడం కాకుండా మాటలు రాసి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించారు. ఇది 2004-2005లో నాలుగు నంది అవార్డులను అందుకుంది. ఆకాశవాణిలో కథలు, కథానికలు, నాటికలు, కవితలు ప్రసారం. 'స్పర్శ' (కవితా సంకలనం, 1985), ఒక యుద్ధ నదీ తీరాన (సుదీర్ఘ కవితా కావ్యం, 2010) వెలువరించారు. లక్ష్యం: సృజనాత్మకతను సామాజిక ప్రయోజనం కోసం అందించాలని. **చిరునామా: శాతవాహన, ఫ్లాట్ నం. 502, శ్రీ నిలయం అపార్ట్‌మెంట్స్, డోర్ నం. 7-1-644/30, సుందర్ నగర్, యస్.ఆర్.నగర్, హైదరాబాద్ -500038. సంచారవాణి: 09393979755**. Email: saisathavahana@yahoo.co.in

**గులాం యాసిన్ :** మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తి జన్మస్థానం. గేయాలు రాశారు.

**హబీబుర్రెహమాన్ :** కృష్ణాజిల్లా విజయవాడలో 1972 నవంబర్ 25న జననం. తల్లితండ్రులు: రహిమున్నీసా, అబ్దుల్ వాజిద్. చదువు: ఎమ్‌కాం. ఉద్యోగం: బిఎస్ఎన్ఎల్ (విజయవాడ), 1994లో వక్ఫ్‌ఆస్తుల మీద వ్యాసం రాయడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. వివిధ పత్రికలలో వ్యాసాలు ప్రచురితం. లక్ష్యం: సామాజిక సమస్యల పరిష్కారానికి మార్గాలు సూచించడం. **చిరునామా: హబీబుర్రెహమాన్, ఇంటి నం. 12-2-59, బాబూ రాజేంద్ర ప్రసాద్ (బిఆర్‌పి) రోడ్, వించిపేట, విజయవాడ-520001, కృష్ణాజిల్లా. సంచారవాణి: 94401 72786**.



**హమీద్ ఎం.ఎ :** మహబూబ్‌నగర్ జిల్లా అక్కెనపల్లి జన్మస్థలం. చదువు: ఎం.కాం. వృత్తి : అధ్యాపకులు. (1982లో జడ్చర్ల ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో జూనియర్ లెక్చరర్). వివిధ పత్రికలలో పలు కవితలు, వ్యాసాలు ప్రచురితం. ఇక్బాల్ కవితా వైభవం, గాలిబ్ కవిత్వంలో ప్రణయం, సాహిర్ కవిత్వం వ్యాసాలు మంచి గుర్తింపును తెచ్చిపెట్టాయి. 1982లో జరిగిన 'ఆంధ్రప్రదేశ్ ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనం' సందర్భంగా వెలువరించిన ప్రత్యేక సంచికలో 'షేక్ షాది నీతులు' వ్యాసం ప్రచురించారు.

**హమీదుల్లా షరీఫ్ :** గుంటూరు జిల్లా మునుగోడులో 1932లో జననం. తల్లి తండ్రులు: షేక్ కరీమా, షేక్ దాదా సాహెబ్. చదువు: బిఏ., బి.యల్. వృత్తి: ధార్మిక సేవ. 1980లో ఖుర్‌ఆన్ గ్రంథాన్ని తెలుగులో అనువదించారు. ఈ అనువాదం 2009 చివరకు మొత్తం మీద లక్షా యాభైవేల కాపీలు ముద్రితమై 'ఖుర్‌ఆన్' తెలుగు అనువాదకునిగా పేరును తెచ్చి పెట్టింది. ఉర్దూ, అరబ్బీ భాషలలోని పలు ధార్మిక గ్రంథాలను తెలుగులోకి అనువాదం చేస్తున్నారు. రాష్ట్రమంతా పర్యటిస్తూ చక్కని తెలుగులో ఇస్లామీయ ధార్మిక ప్రసంగాలు చేస్తూ వక్తగా పేర్గాంచారు. ఆకాశవాణి, టివీ ఛానెల్స్‌లో ధార్మిక ప్రసంగాలు చేస్తున్నారు. లక్ష్యం: ఇస్లామీయ సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు అందించడం –దైవప్రసన్నత పొందడం ప్రధానం. **చిరునామా: హమీదుల్లా షరీఫ్, 405, అన్సారి ఎన్‌క్లేవ్, అజిజియా మస్జిద్ ఎదురు, మెహదీపట్నం, హైదరాబాద్–28. దూరవాణి: 040-66253022, సంచారవాణి: 92465 31645.**



**హనీఫ్ ముహమ్మద్ :** నల్లగొండ జిల్లా నల్లగొండలో 1956 జూన్ 12న జననం. తల్లి తండ్రులు: జానీ బేగం, మహమ్మద్ గౌస్. చదువు: ఎం.ఏ (ఇస్లామిక్ స్టడీస్). వృత్తి: వ్యాపారం. 1979లో కళాశాల పత్రికలో రచనలు ప్రచురితం. ఆ తరువాత నుండి రాసిన కవితలు, కథానికలు, సమీక్షలు వివిధ సంకలనాలలో, పత్రికలలో చోటుచేసుకున్నాయి. సామాన్య ప్రజానీకం ఎదుర్కొంటున్న సమస్యలు ఆ సమస్యల పరిష్కారంలో సతమతమౌతున్న పరిస్థితులు రచనకు ప్రేరణ. ప్రచురణలు: 1. జఖమ్ (కవితా సంపుటి, 2002), 2. హర్ ఏక్ మాల్ (కథల సంపుటి, 2003), 3. పాన్ మరక (కవితా సంపుటి, 2005), 4. తమన్నా (కవితా సంపుటి, 2005), 5. హుకుం (నవల, 2010). పాన్‌మరక కవితా సంపుటిలోని 'పాన్‌మరక' కవిత ఆంగ్లం, హిందీ భాషల్లోకి అనువదించబడి ఆయా భాషా కవితా సంకలనాలలో చోటు చేసుకుంది. పాన్‌మరక









కవితా సంపుటి మంచి గుర్తింపు తెచ్చిపెట్టి కవితా లోకంలో 'పాన్‌మరక అలీ' గా ఆయన పేరును స్థిరపర్చింది. లక్ష్యం: ముస్లిం సమాజంలో చైతన్యం కలుగచేసి ఆ వర్గాల ఉన్నతికి తోడ్పడాలని, ఇస్లాం పట్ల, ముస్లింల పట్ల ముస్లిమేతర సోదరులలో సృష్టించబడుతున్న అపోహలను, అపార్థాలను ఎండగట్టి మత సామరస్యం మరింతగా పటిష్టపర్చేందుకు కృషి చేయడం. **చిరునామా: ముహమ్మద్ హనీఫ్, ఇంటి నం. 5-9-68, మాన్యంచలక వీధి, నల్లగొండ-508001, నల్లగొండ జిల్లా. సంచారవాణి: 93464 91023, 99668 24113 (పిపి)**.

**హనీఫ్ ఎండి. :** ఖమ్మం జిల్లా రుద్రాంపూర్ నివాసి. సింగరేణి సంస్థలో ఉద్యోగి. పలు తెలుగు పత్రికలలో కవితలు, కథానికలు ప్రచురితం. కవితా సంకలనాలు, కథానికల సంకలనాలలో 'హనీఫ్' కలంపేరుతో రాసిన కథలు, కవితలు చోటు చేసుకున్నాయి. రచనలు: పడమటి నీడ (కథల సంపుటి, 2009). **చిరునామా: ఎండి హనీఫ్, ఇంటి నం. జి–159, ధన్‌బాద్ కాలనీ, రుద్రాంపూర్–507119, కొత్తగూడెం, ఖమ్మం జిల్లా. దూరవాణి: 08744–221737, సంచారవాణి: 92475 80946**, Email: haneefpoet @yahoo.com



**హసన్ జిలాని సయ్యద్ :** గుంటూరు జిల్లా గుంటూరులో 1963 జూన్ 15న జననం. తల్లితండ్రులు: అల్‌హజ్ జమ్‌రుత్ బేగం, అల్‌హజ్ సయ్యద్ జాఫర్ అహమ్మద్ జిలాని. చదువు: బిఎస్సీ., ఎం.బి.ఏ. ఉద్యోగం: మెడికల్ రిప్రజెంటేటివ్. రచనలు: 1. '2009 ఎన్నికలు: ముస్లిం మతపెద్దల పాత్ర', 2. 'వందేమాతరం మరియు గోవధ: ముస్లిం దృక్పథం' (2009) ప్రచురించారు. లక్ష్యం: సర్వ మానవులను సత్య ధర్మం వైపుకు ఆహ్వానించడం. **చిరునామా: సయ్యద్ హసన్ జీలాని, ఇంటి నం.5–61–16, 2/18 బ్రాడీపేట, గుంటూరు–522 002, గుంటూరు జిల్లా. దూరవాణి : 0863–2234148, సంచారవాణి: 96423 99796.**



**హసన్ ముహమ్మద్ :** వరంగల్ జిల్లా గవిచర్లలో 1967 ఆగస్టు ఒకటిన జననం. తల్లితండ్రులు: బాసాబీ, యాకూబ్ సాహెబ్. చదువు: ఎం.ఏ., ఎం.ఫిల్. ఉద్యోగం: అధ్యాపకులు. విద్యార్థిగా కవితలు అల్లడం ఆరంభమై వివిధ పత్రికలలో కవితలు, పద్యాలు చోటుచేసుకున్నాయి. రచన: శ్రీ షిర్డి సాయి శతకము (2008). పలు సత్కారాలు అందుకున్నారు. నటుడు. నాట్యంలో కూడా ప్రవేశం ఉంది. **చిరునామా: ముహమ్మద్**

**హసన్, ఇంటి నం. 25-6-106, జూబ్లీమార్కెట్, ఖాజీపేట-506003 హన్మకొండ, వరంగల్ జిల్లా. సంచారవాణి: 98667 76293.**

**హసన్ చిన్న షేక్ :** కడపజిల్లా కొండాపురం మండలం బుక్కపట్నం గ్రామంలో 1941లో జననం. తల్లితండ్రులు: షేక్ జాజాబీ, షేక్ హుస్సేన్ సాహెబ్. చదువు: విద్వాన్. ఉద్యోగం: హిందీ ఉపాధ్యాయులు. విద్యార్థిగా కళాశాల పత్రికలో 'మహాబలిపురం' కవిత రాశారు. 1973 నుండి కవితలు, ఆధ్యాత్మిక వ్యాసాలు వివిధ పత్రికలలో చోటు చేసుకున్నాయి. 1976లో 'ప్రభోధిని' ఆధ్యాత్మిక మాసపత్రిక ఆరంభించి సంపాదకత్వ బాధ్యతలు నిర్వహించారు. లక్ష్యం: ఇస్లామీయ సాహిత్యాన్ని తెలుగులో పాఠకులకు అందించడం. **చిరునామా: విద్వాన్ ఎస్.సి హసన్, ఇ.నం.19-131, టెక్కాయ చేను వీధి, జమ్మలమడుగు-516434, కడపజిల్లా, సంచారవాణి: 94400 22571(పిపి).**



**హసన్ వలి షేక్ :** గుంటూరు జిల్లా చిలకలూరిపేటలో 1973 ఏప్రిల్ ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ నన్నీబీ, షేక్ అబ్దుల్ సలాం. చదువు: ఇంటర్. వృత్తి: జర్నలిజం. కలం పేరు: రవితేజ. 1987లో 'కట్నలీలలు' కవిత ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి కవితలు, కథలు, వ్యాసాలు వివిధ పత్రికలలో, సంకలనాలలో ప్రచురితం. మంచి నటుడు. స్వయంగా రాసి, నటించిన పలు నాటికలు ప్రదర్శితమయ్యాయి. అవార్డు: ప్రతిభా అవార్డు (హైదరాబాద్) లక్ష్యం: మదిలోని నిర్మాణాత్మక స్పందనను పది మందితో పంచుకోవడం. **చిరునామా : షేక్ హసన్ వలి, ఇంటి నం.1-1107, 3వ లైను, ఎన్టీయార్ కాలనీ, చిలకలూరిపేట-522616, గుంటూరు జిల్లా. సంచారవాణి: 93466 57790.** Email: skhasnval@rediff.com



**హుసేన్ మహమ్మద్ మహమ్మద్ షేక్ డాక్టర్ :** మహబూబ్‌నగర్ జిల్లా పాతగడ్డ బసవాపురం లో 1948 ఫిబ్రవరి 19న జననం. తల్లితండ్రులు: ఫాతిమాబీ, హసన్ సాహెబ్. కలం పేర్లు: గడ్డబసవాపురం మహేశ్వర్, గడ్డబసవాపురం మహేశ్వర్. చదువు: ఎం.ఏ., ఎం.ఓ.యల్., పి.హెచ్‌డి. ఉద్యోగం: అధ్యాపకులు. సంస్కృతాంధ్ర భాషా పండితులు. 1974లో 'వేనరాజు-సమకాలీన సాహిత్యం' వ్యాసం ప్రచురణతో రచనా









వ్యాసంగం ఆరంభం. రచనలు: 1.వేనరాజు సమకాలీన సాంస్కృతికోద్యమాల ప్రభావం (1989), 2.అలంపురి జోగులాంబిక నక్షత్రమాల (2002), 3.కోయిల శతకం (2002). అవార్డులు-పురస్కారాలు: గడియారం రామకృష్ణ శర్మ స్మారక సాహిత్య అవార్డు, స్వర్ణముఖి అవార్డు. లక్ష్యం: ప్రాచ్యపాశ్చాత్య సాహిత్య తత్వదర్శనం. **చిరునామా: డాక్టర్ షేక్ ఎం.డి మహమ్మద్ హుసేన్, ఇంటి నం. 80-70 డి, కృష్ణానగర్, ఐటిసి ఎదురు, కర్నూలు-518 002, కర్నూలు జిల్లా. సంచారవాణి: 94415 37728.**

**హుస్సేన్ సాహెబ్ పి :** 1950 జూలై ఒకటిన కర్నూలు జిల్లా తరిగోపులలో జననం. తల్లితండ్రులు: ననెమ్మ, పెద్ద పకీరు సాహెబ్. చదువు: ఎం.ఏ. వృత్తి: ఉపాధ్యాయులు. రచనలు: ఈశ్వర సంప్రశ్నము (1994), బాల గీతాలు, నవ్వులు (వచన కవితలు).

**హుసేన్ సయ్యద్ :** గుంటూరు జిల్లా ఫిరంగిపురం మండలం బేతపూడి గ్రామంలో 1957 డిసెంబర్ 23న జననం. తల్లితండ్రులు: సయ్యదా గాలిబ్ బీబి, ఖాశిం సాహెబ్. చదువు: బికాం. ఉద్యోగం: తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్‌లో కార్యనిర్వహణ అధికారిగా పాతికేళ్ళు బాధ్యతల నిర్వహణ. 1983లో 'గీటురాయి' వారపత్రిక ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. ఉర్దూ, అరబ్బీ భాషలను అధ్యయనం చేసి, ఆయా భాషల్లో రాసిన ఇస్లామియా సాహిత్యాన్ని తెలుగులో తర్జుమా చేయడం. తెలుగులోకి అనువాదాలు: 1. విరిసిన మొగ్గలు, 2. మహనీయుల బాట (ప్రథమభాగం), 3. మహనీయుల బాట (ద్వితీయ భాగం), 4.హజ్రత్ సాలమ్ (రజి), 5. ముస్లిం వేడుకోలు. ఆంగ్లం నుండి అనువాదాలు : 1. వ్యక్తిత్వ వికాసం. లక్ష్యం: ఆధ్యాత్మిక బాటలో జనచైతన్యం. **చిరునామా: సయ్యద్ హుస్సేన్, బేతపూడి-522547, ఫిరంగిపురం మండలం, గుంటూరు జిల్లా. సంచారవాణి: 99853 94757.** Email: hussain4757@yahoo.com



**ఇబ్రహీం అక్కంపేట :** కడప జిల్లా నరసాయపురంలో 1975 జూన్ ఒకటిన జననం. తల్లితండ్రులు: ఖాతూన్ బీ, మహబూబ్ సాహెబ్. చదువు: బి.ఏ., బి.ఇడి ఉద్యోగం: ఉపాధ్యాయులు. 1977లో 'చిన్నీ' కథానిక ప్రచురణ ద్వారా రచనా వ్యాసంగం ఆరంభమై వివిధ పత్రికలు, సంకలనాలలో కథానికలు- కవితలు, వ్యాసాలు ప్రచురితం. ప్రైవేటీకరణ నేపథ్యంలో ఉపాధ్యాయుల సమస్యల మీద రాసిన 'కాలానికి ఎదురీదుతున్నవాడు', ప్రపంచీకరణ నేపథ్యంలో వెల్లువెత్తుతున్న వ్యాపార దృక్పథం వలన వికృతమౌతున్న



సామాన్యుల వెతలను విశ్లేషిస్తూ రాసిన 'జైతున్' కథానికలు గుర్తింపు తెచ్చాయి. లక్ష్యం: సామాజిక చైతన్యం కల్గించడం. **చిరునామా: అక్కంపేట ఇబ్రహీం, నరసాపురం- 516217, ఎస్ఏ కాశినాయన మండలం, కడప జిల్లా. సంచారవాణి: 95501 13040.**

**ఇమాం షేక్ :** అనంతపురం జిల్లా అనంతపురంలో 1940 జనవరి ఒకటిన జననం. తల్లి తండ్రులు: బానోబి, మస్తాన్ సాహెబ్. వృత్తి: జర్నలిజం. కలం పేర్లు: కదలిక ఇమాం, ఇమాం. 1973 నుండి రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికల్లో సామాజిక, సాహిత్య వ్యాసాలు ప్రచురితం. రాయలసీమ సమస్యల మీద ప్రత్యేకంగా దృష్టి నిల్పి అక్కడి సమస్యల మీద పలు రచనలు చేశారు. 1983 నుండి కదలిక మాసపత్రిక సంపాదకత్వం వహిస్తున్నారు. ప్రత్యేక రచనలు: 1. తరతరాల రాయలసీమ, 2. అనంత ప్రస్థానం, 3. జిల్లా సాంప్రదాయక నీటి వనరులు, 4. నదుల అనుసంధానం, 5. కోటి గొంతుకల ఆక్రందన, 6. సీమ గుండె చప్పుడు, 7. మహిళా సాధికారికత (మూడు భాగాలు). లక్ష్యం: ప్రజలలో సామాజిక చైతన్యం కలుగ జేయడం. **చిరునామా: షేక్ ఇమాం, ఎర్రనేల కొట్టాలు, ఆర్‌సి నగర్, అనంతపురం-515001, అనంతపురం జిల్లా, దూరవాణి: 08554-277789, సంచారవాణి: 99899 04389.**



**ఇనాయతుల్లా ఎస్ఎండి :** కర్నూలు జిల్లా బనగానపల్లెలో 1963 ఫిబ్రవరి 16న జననం. తల్లితండ్రులు: జాఫర్ బీ, ఎస్ఎండి. ఆజం. ఉద్యోగం: విద్యాశాఖ. 1980లో 'మానవా సహజ స్వార్థం మానవా?' తొలి కవిత ప్రచురణతో రచనా వ్యాసంగం ఆరంభం. కవితలు, కథలు వివిధ పత్రికలలో, సంకలనాలలో ప్రచురితం. 2000లో రాసిన 'వలస' కథ గుర్తింపు తెచ్చిపెట్టింది. కథలు నాటికలుగా రూపాంతరం చెంది ఆకాశవాణి ద్వారా ప్రసారం. ఉత్తమ కథా రచయితగా పలుమార్లు సత్కారం. లక్ష్యం: వాస్తవిక దృక్పథంతో రచనలు చేయడం. **చిరునామా: ఎస్ఎండి. ఇనాయతుల్లా, ఇ.నం.87/1319, రెవిన్యూ కాలనీ, కర్నూలు. దూరవాణి: 98493 67922.**



**ఇక్బాల్ అహమ్మద్ :** కృష్ణా జిల్లా విజయవాడలో 1946 నంవంబరు 26న జననం. తల్లితండ్రులు: షేక్ పెంటు సాహెబ్, షేక్ కరీమున్నీసా. కలంపేరు: ఆరోహి. చదువు: యస్‌యస్‌యల్‌సి. ఉద్యోగం: ధార్మిక ప్రచారం. తెలుగు, ఉర్దూ, అరబిక్ భాషల్లో ప్రవేశం. మొట్టమెదటి సారిగా 1975లో గీటురాయి వారపత్రికలో ధార్మిక వ్యాసం రాయడం ద్వారా







రచన వ్యాసంగం ఆరంభం. ఉర్దూ, అరబిక్ భాషల్లోని పలు గ్రంథాలను తెలుగులోకి అనువదించగా వాటిని వివిధ ప్రచురణ సంస్థలు ప్రచురించాయి. రచనలు: 1. ఇస్లాం మరియు అజ్ఞానం, 2. దైవ ప్రవక్తలు (మూడు భాగాలు), 3. భవ బంధాలు మోక్షానికి ప్రతి బంధకాలా? 4. కారుణ్య వ్యవస్థ, 5. పరదా ప్రగతికి ప్రతిబంధకమా?, 6. నవయుగం-నవతరం, 7. ఒక మనిషి రెండు వైఖరులు, 8. ప్రపంచ మతాలు, ఇస్లాం, 9. ఒడి నుండి సమాధి వరకు, 10. రమజాన్‌కు స్వాగతం, 11. మర్యమ్ జమీలాతో ఇంటర్వ్యూ, 12. త్యాగనిరతి, 13. భారత నారి, 14. తలాఖ్, 15. శిక్షణకు తొలిమెట్టు, 16. మస్జిద్ వ్యవస్థ, 17. ఆదర్శ మహిళ ఆయెషా (రజి), 18. కారుణ్యం కురిసిన వేళ, 19. సుమధుర సందేశం, 20. మానవ జీవితం పై నమాజు ప్రభావం, 21. ఇస్లాం మెచ్చిన మహిళలు, 22. పశ్చాత్తాపం, 23. తావీజులు తాయెత్తులు, 24. విడాకులు ఎక్కడ? ఎప్పుడు? ఎలా?, 25. హిస్నుల్ ముస్లిం. లక్ష్యం: ఇస్లాం సందేశాన్ని పదిమందితో పంచుకోవడం. **చిరునామా: ఇక్బాల్ అహమ్మద్, ఇంటి నం. 16-2-39/ఏ, అక్బర్ బాగ్, మలక్‌పేట, హైదరాబాద్-500036.**



**ఇక్బాల్ చంద్ డాక్టర్ :** కృష్ణా జిల్లా విజయవాడలో 1968 సెప్టెంబర్ 21న జన్మించారు. ఖమ్మం జిల్లా సత్తుపల్లిలో స్థిరనివాసం. చదువు: ఎం.ఏ (తెలుగు)., ఎం.ఏ (ఆంగ్లం)., పి.హెచ్‌డి. తెలుగు, ఆంగ్ల భాషా పండితులు. ఉద్యోగం: తొలుత ఉపాధ్యాయులు. ప్రస్తుతం బెంగళూరులోని సాఫ్ట్‌వేర్ కంపెనీలో పనిచేస్తున్నారు. కవితలు, గేయాలు, సాహిత్య వ్యాసాలు వివిధ పత్రికల్లో ప్రచురితం. కొన్ని కవితలు హిందీ, ఇంగ్లీషు, ఉర్దూ భాషల్లోకి అనువాదమై ఆయా భాషా పత్రికల్లో కూడా ప్రచురితం. రచనలు: ఆరోవర్ణం (2001), బంజారా (కవితా సంపుటి, 2007) **చిరునామా : డాక్టర్ ఇక్బాల్ చంద్, మసీదు వీధి, సత్తుపల్లి- 507302, ఖమ్మం జిల్లా. సంచారవాణి: 94412 11765.**



**ఇక్బాల్ ఎం.జి :** గుంటూరు జిల్లా సిరిపురంలో 1963 ఫిబ్రవరి 13న జననం. తల్లి తండ్రులు: అమీరున్నీసా, అబ్దుల్ రహ్మాన్ షరీఫ్. చదువు: ఇంటర్. వ్యాపకం: ఉద్యోగం. 1990లో 'హేతువాదం' మాసపత్రికలో (నరసరావుపేట) తొలి వ్యాసం ప్రచురితం. అప్పటినుండి హేతువాద, మార్క్సిస్ట్ భావజాల దృక్పథంతో రాసిన వ్యాసాలు, కవితలు వివిధ పత్రికలలో, రాష్ట్రంలో వెలువడిన కవితా సంకలనాలలో వ్యాసాలు చోటు

చేసుకున్నాయి. స్థానికంగా వెలువడిన పలు పత్రికలకు సంపాదకులుగా వ్యవహరించారు. లక్ష్యం: అన్ని రకాలుగా నిర్లక్ష్యానికి గురవుతున్న బాధిత ప్రజానీకం గొంతుకను విన్పించ గల రచనలు చేయాలన్నది. **చిరునామా: ఎంజి ఇక్బాల్, ఇంటి నం. 8-13-109, 9వ లైను, నెహ్రూనగర్, గుంటూరు, గుంటూరు జిల్లా. సంచారవాణి: 99895 51752.**

**ఇక్బాల్ ఎస్ఎం. డాక్టర్ :** అనంతపురం జిల్లా అనంతపురంలో 1947 మే 19న జననం. తల్లితండ్రులు: సయ్యద్ ఖాజా హుస్సేని, మహమూదా బేగం. చదువు: ఎం.ఏ, పి.హెచ్‌డి. ఉద్యోగం: విశ్రాంత హిందీ ఉపన్యాసకులు (ఆంధ్రవిశ్వవిద్యాలయం). 'హిందీ+తెలుగు కథానికల తులనాత్మక పరిశీలన' అను అంశాన్ని పరిశోధనకు స్వీకరించి తొలి తెలుగు కథను 1904లో ఆచంట వెంకటరాయ సాంకృత్యాయ శర్మ రాసినట్టు ప్రకటించడం సంచలనం సృష్టించింది. ప్రముఖ కవి మౌల్వీ ఉమర్ అలీషా రచనల మీద సమగ్ర పరిశోధన చేయడం మాత్రమే కాకుండా ఆయన రచనలను హిందీలోకి అనువదించారు. 1974లో ఆంగ్లం, హిందీలో వచ్చిన కథలను తెలుగులోకి అనువదించగా అవి ఆంధ్రజ్యోతిలో ప్రచురితం. కవితలు, గేయాలు, వ్యాసాలు, సాహిత్య సమీక్షలు వివిధ పత్రికలలో చోటుచేసుకున్నాయి. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో గేయాలు, ప్రసంగాలు ప్రసారం. 'జన్మభూమి' ప్రధానాంశంగా 2001లో రాసిన గీతమాలిక క్యాసెట్‌గా విడుదలయ్యింది. తెలుగులోనే కాకుండా ఆంగ్లం, హిందీ భాషల్లో కూడా రచనలు చేశారు. లక్ష్యం: తెలుగు సాహిత్య ఉన్నత విలువలను జాతీయ స్థాయిలో ఇతరులకు పరిచయం చేయాలి. **చిరునామా: డాక్టర్ ఎస్ఎం ఇక్బాల్, ఖాజా హుస్సేని మంజిల్, మెంటల్ ఆసుపత్రి గేటు కూడలి, చిన్నవాల్తేరు. విశాఖపట్నం -17. దూరవాణి: 0891-279611, సంచారవాణి: 98481 98478**.



**ఇస్లాం షేక్ :** పశ్చిమగోదావరి జిల్లా ఆరుగొలనులో 1978 ఏప్రిల్ 25న జననం. తల్లి తండ్రులు: పకీర్ బీ, అబ్దుల్ రహిమాన్. చదువు: ఎం.ఏ. వృత్తి: జర్నలిజం. 2006లో 'గీటురాయి' వార పత్రికలో 'తెలుగు భాష ప్రాముఖ్యత' శీర్షికన వ్యాసం రాయడం ద్వారా రచనా రంగప్రవేశం. వివిధ పత్రికల్లో ప్రధానంగా గీటురాయిలో వ్యాసాలు, కవితలు చోటు చేసుకున్నాయి. లక్ష్యం: సామాజిక రుగ్మతల తొలిగింపు రచయితగా కృషి చేయాలి. **చిరునామా : షేక్ ఇస్లాం, తండ్రి: అబ్దుల్ రహిమాన్, ఆరుగొలను -534146, పశ్చిమ గోదావరి జిల్లా. దూరవాణి: 08818-281813.**









**ఇస్మాయిల్ :** ఇస్మాయిల్ నెల్లూరు జిల్లా కావలిలో 1928 జూలై 1న జన్మించారు. 1972లో 'ఆదర్శం'తో ఆరంభమై 1976లో మృత్యు వృక్షం, 1980లో చిలుకలు వాలిన చెట్టు, 1987లో చెట్టు, రాత్రి వచ్చిన రహస్యపు వాన, 1989లో ఇస్మాయిల్ కవితలు, 1996లో బాల్చీలో చంద్రోదయం, 1997లో కప్పల నిశ్శబ్దం (హైకూలు), 1997లో రెండో ప్రతిపాదన-ఆనువాద కవితలు, 1986లో కవ్వంలో నిశ్శబ్దం (వ్యాసాలు), 1996లో కరుణ ముఖ్యం (వ్యాసాలు) తదితరాలు ఆయన ప్రచురిత రచనలు. ఆయనకు మంచి గుర్తింపు తెచ్చిన 'చెట్టు' కవితా సంకలనంతో తెలుగు సాహిత్యలోకం ఆయనను 'చెట్టు ఇస్మాయిల్' అని పిలుచుకుంది. సాహిత్యలోకంలో ఎనలేని ఖ్యాతిని మూట గట్టుకున్న ఆయన 2003 నవంబరు 11న కన్నుమూశారు.



**ఇస్మాయిల్ మహమ్మద్ :** తెలుగు సాహిత్య ప్రపంచంలో 'స్మైల్' గా విఖ్యాతులైన మహమ్మద్ ఇస్మాయిల్ 1942 ఫిబ్రవరి మూడున కృష్ణా జిల్లా తేలప్రోలు గ్రామంలో జన్మించారు. తల్లితండ్రులు: ఖమ్రున్నీసా బేగం, మహమ్మద్ ముస్తఫా. చదువు: ఎం.ఏ. 1957లో రాష్ట్రప్రభుత్వ వాణిజ్యశాఖలో ప్రవేశించి డిప్యూటీ కమీషనర్‌గా రిటైర్ అయ్యారు. 1964లో 'భారతి'లో తొలిసారిగా కవిత ప్రచురితం కావడంతో ఆరంభమైన సాహిత్య ప్రస్థానంలో కవితలు, కథానికలు, నాటకాలు రాశారు. 1965లో భారతిలో రాసిన 'వల' అను కథానిక సంచలనం సృష్టించింది. ఆంగ్లం నుండి తెలుగులోకి పలు అనువాదాలు చేశారు. 'ఆ' శీర్షికతో రాసిన నాటకం ఆంధ్రజ్యోతి పోటీలలో ప్రథమ బహుమతి అందుకుంది. రాష్ట్రంలో వెలువడిన కథా-కవితా సంకలనాలలో ఆయన కవితగాని, కథగాని తప్పనిసరిగా చోటుచేసుకునేవి. 1998లో ఆయన రాసిన కవితలు, కథానికలు, నాటికలు, అనువాదాలు కలిపి 'ఖాళీ సీసాలు' పుస్తకం ప్రచురించారు. సత్కారాలు-సన్మానాలకు కదు దూరంగా వ్యవహరించిన ఆయన్ను ఎందుకు రాస్తున్నారంటే 'రాయాలని అన్పించింది రాస్తున్నా' అన్నారు. ఆ తరువాత 'సమాజం పట్ల మనకు కలిగే అభిప్రాయాలను పదిమందితో పంచుకోవాలన్న ఉద్దేశ్యంతో రాస్తున్నాను' అన్నారు. పలుమార్లు విదేశ పర్యటనలు గావించిన 'జిజ్ఞాసి-స్నేహ లాలసుడు'. ఉద్యోగ విరమణ తరువాత రాజమండ్రిలో స్థిరపడి చివరి వరకు రచనా వ్యాసంగాన్ని కొనసాగించిన మహమ్మద్ ఇస్మాయిల్ 2008 డిసెంబరు ఐదున కన్నుమూశారు. (సమాచారం: దూరవాణి ద్వారా మహమ్మద్ ఇస్మాయిల్‌తో సయ్యద్ నశీర్ అహమ్మద్ ఇంటర్వ్యూ:01-09-2008).





**ఇస్మాయిల్ ఉమ్రి షేక్ :** కృష్ణా జిల్లా కొండపల్లిలో జననం. తల్లితండ్రులు: తస్లీమున్నీసా, షేక్ అబ్దుర్రవూఫ్. 1995లో గీటురాయి వారపత్రికలో వ్యాసం ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలలో ధార్మిక వ్యాసాలు చోటుచేసుకున్నాయి. అరబ్బీ, తెలుగు, ఉర్దూ భాషలో ప్రవేశం. మంగళగిరి నుండి 'కలం సాక్షి' మాసపత్రికను కొంత కాలం నడిపారు. లక్ష్యం: ఇస్లామీయ ధార్మిక సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేయడం. **చిరునామా : షేక్ ఇస్మాయిల్ ఉమ్రి, ఇంటి నం. 9-11, కోటిరెడ్డి కాలనీ, స్టేషన్ సెంటర్, కొండపల్లి-521 228, కృష్ణా జిల్లా. సంచారవాణి: 96423 34787.**

**జబ్బార్ అబ్దుల్ గుట్టూరు :** అనంతపురం జిల్లా కొత్తచెర్వు గ్రామంలో 1940 ఏప్రిల్ 20న జననం. తల్లితండ్రులు : జమీలా బి, అబ్దుల్ గఫ్ఫార్. చదువు: యస్.యస్.యల్సీ., టియస్ఎల్సి. ఉద్యోగం: ప్రస్తుతం విశ్రాంత ఉపాధ్యాయులు. 1999లో 'విశ్వ కారుణ్యమూర్తి ముహమ్మద్ (స.అ.సం) గ్రంథం రాయడంతో రచనా వ్యాసంగం ఆరంభం. ఆ తరువాత 2002లో ఆంధ్రభూమి దినపత్రికలో 'ఇస్లాం-జాతీయ సమైక్యత' వ్యాసం ప్రచురితం అయినప్పటి నుండి వివిధ పత్రికల్లో పలు వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ఆకాశవాణి (అనంతపురం) నుండి పలు ప్రసంగ వ్యాసాలు ప్రసారం అయ్యాయి. ఉర్దూ, అరబిక్ భాషల్లో రాసిన పలు గ్రంథాలను, వ్యాసాలను తెలుగులోకి అనువదించి వెలువరించడం ద్వారా పలు గ్రంథాలు తెచ్చారు. రచనలు: 1.విశ్వకారుణ్యమూర్తి మహమ్మద్ (సం.అ.సం), 2. సులభతర హజ్ మరియు ఉమ్రాహ్, 3. అస్మా-ఉల్-హుస్నా, 4.క్రైస్తవం యొక్క వాస్తవికత ఎట్టిది?, 5. మన ప్రవక్త (స.అ.సం), 6. మంచి మాట-స్వర్గానికి బాట (రెండు భాగాలు), 7.జీవితం ఇలా గడపాలి, 8. రంజాన్ ఉపవాసాలు, 9. మానజాతి మహిమలు. లక్ష్యం: ఇస్లాం పట్ల ప్రజలలో ప్రచారం చేయబడుతున్న అపోహలను దూరం చేయడం. **చిరునామా: జి. అబ్దుల్ జబ్బార్, ఇంటి నం. 6-1-914, కోవూరునగర్, అనంతపురం-515004, అనంతపురం జిల్లా. సంచారవాణి: 9032218412.**



**జాఫర్ బాబు ఎం.డి. :** నెల్లూరు జిల్లా నెల్లూరులో 1976 ఆగస్టు 17న జననం. తల్లి తండ్రులు: నూర్జహాన్, ఎండి. సందాని బాషా. చదువు: బి.ఏ., డి.పి.ఆర్. వృత్తి: జర్నలిజం. 1993లో ప్రజాశక్తిలో 'శ్రీకృష్ణ కమిషన్ నివేదికలో ఏముంది?' వ్యాసం ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలలో సామాజిక-రాజకీయాంశాలతో కూడిన వ్యాసాలు, కవితలు ప్రచురితం. ప్రస్తుతం టీవి9లో 'ప్రిన్సిపల్ కరస్పాండెంట్ ఫర్ స్టింగ్ ఆపరేషన్స్' గా బాధ్యతల









నిర్వహణ. రచనలు: 1. ఆపరేషన్ రెడ్‌లైట్ (2008), 2. స్టింగ్ ఆపరేషన్స్ ఇన్ ఎలక్ట్రానిక్ మీడియా (2010). మొదటి పుస్తకం ఎలక్ట్రానిక్ మీడియాలో సంచలనం సృష్టించింది. లక్ష్యం: సామాజిక రుగ్మతలను రూపు మాపేందుకు అవసరమగు చైతన్యం ప్రజలలో కలగజేయాలన్నది. **చిరునామా: ఎండి జాఫర్ బాబు, జర్నలిస్ట్, ఇంటి నం.21-411 ఏ, దాడివారి వీధి, నెల్లూరు-524001, నెల్లూరు జిల్లా. సంచారవాణి : 99126 66212, 99482 54519** Email: jaffar.babu@yahoo.com

**జాఫర్ వలి ఖాన్ డాక్టర్ :** కడప జిల్లా రాజం పేట తాలూకా స్వస్థలం. రచనలు: చంద్ర మండలం విశేషాలు (సైన్సు గ్రంథం) మంచి ఖ్యాతి తెచ్చిపెట్టింది.

**జఫ్రుల్లా మహమ్మద్ :** ప్రకాశం జిల్లా కంబంలో 1943లో జన్మించారు. తల్లితండ్రులు: బీనతున్నీసా, అసదుల్లా సాహెబ్. రచనలు: పేదల ఖేదము, కవితా ప్రసూనాలు.

**జహంగీర్ మహమ్మద్ :** మహబూబ్‌నగర్ జిల్లా గౌరిటలో 1947 ఫిబ్రవరి 15న జననం. తల్లితండ్రులు: హుస్సేన్‌బి, మహమ్మద్ అబ్దుల్లా. ఉద్యోగం: హిందీ అధ్యాపకులు. 1964లో 'లహరి' లిఖిత మాసపత్రికలో 'అరుణోదయ' శీర్షికతో గేయం ప్రచురితం కావడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికలలో కవితలు, గేయాలు, సాహిత్య వ్యాసాలు చోటుచేసుకున్నాయి. రచనలు: 1. శ్రీ బుద్ధారం గండి ఆంజనేయ శతకం 2. షాహీన్ ప్రబోధ శతకము. బిరుదులు: కవి వతంస (బుద్ధారం 2005). లక్ష్యం: యువతను సన్మార్గం చూపడం. **చిరునామా: జహంగీర్ మహమ్మద్, ఇంటి నం: 11-45, రాంనగర్ కాలనీ, నాగర్‌కర్నూలు-509209, మహబూబ్‌నగర్ జిల్లా. సంచారవాణి: 97032 32378, దూరవాణి: 08540-226940.**





**జహీర్ అహమ్మద్ సయ్యద్ :** కడప జిల్లా ప్రొద్దుటూరులో 1958 ఏప్రిల్ 14న జననం. తల్లితండ్రులు: జెహరాబీ, సయ్యద్ హుస్సేన్ సాహెబ్. కలంపేరు: సమీరా. వృత్తి : ప్రింటింగ్ వర్క్. మూడు దశాబ్దాల క్రితం ఆంధ్రపత్రికలో 'బ్రతుకు తీరు' కవిత ప్రచురితం కావడంతో రచనా రంగప్రవేశం. అప్పటి నుండి దాదాపు అన్ని తెలుగు పత్రికలు, వివిధ కవితా సంకలనాలు, కథా సంకలనాలల్లో కవితలు, కథానికలు ప్రచురితం. 1992

ఆగస్టు ఆంధ్రభూమి మాసపత్రికలో రాసిన 'మాతృభాష' కథ మంచి గుర్తింపు తెచ్చిపెట్టింది. 'పల్లెపదుచు' జానపద పాటల వీడియో రూపానికి వ్యాఖాన రచన చేశారు. తెలుగు పత్రికలు నిర్వహించిన కథానికల, కవితల పోటీలలో పలుసార్లు విజేతగా ఎంపిక. తెలుగు దినపత్రికలలో 'సమీర' కలం పేరుతో చాలా కాలం పలు 'కాలమ్స్' నిర్వహించారు. కర్నూలు కేంద్రంగా 'ఎక్స్‌ప్రెస్ యాడ్స్' త్రైమాస బులిటిన్ వెలువరిస్తున్నారు. అవార్డులు-పురస్కారాలు: మందాకిని పురస్కారం (1988, కర్నూలు), ఉగాది పురస్కారం (1996, గుంటూరు), ఎన్టీయార్ స్మారక అవార్డు (1996, హైదరాబాద్), మనోరంజని సాహితీ అవార్డు (హైదరాబాద్). రచనలు: ఎటునుండి నరుక్కు రావాలి (కథల సంకలనం). లక్ష్యం: మనం పూర్తిగా మరచిపోతున్న ఆచార-సంప్రదాయాలు, ఆర్థిక వ్యత్యాసాల వల్ల ప్రజలలో వేగంగా తరిగి పోతున్న ప్రేమైక బంధాలను సమాజానికి గుర్తు చేయడం. **చిరునామా: సయ్యద్ జహీర్ అహమ్మద్, ఇంటి నం.77/1076, ముజఫర్‌నగర్, కల్లూర్ ఏస్టేట్, కర్నూలు-3, కర్నూలు జిల్లా. సంచారవాణి: 93924 52601.**

**జైనుల్ ఆబెదీన్ ముహమ్మద్ :** తూర్పుగోదావరి జిల్లా సామర్లకోట జన్మస్థలం. పుట్టిన తేది: 24-12-1916. తల్లితండ్రులు: మహబున్నీసా, మహబూబ్ సాహెబ్. చదువు: బి.యస్.సి (అగ్రికల్చర్). కలంపేరు: భయ్యా. మంచి వక్త. ఇస్లాం సందేశాన్ని ప్రతిభావంతంగా ప్రజల్లోకి తీసుకెళ్ళడంలో దిట్ట. 1982లో హైదరాబాద్‌లో జరిగిన 'ఆంధ్రప్రదేశ్ ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనం' సందర్భంగా వెలువడిన 'వెలుగు దివెవ్వలు' ప్రత్యేక సంచికలో 'నా జీవితం పై తెలుగు ప్రభావం' శీర్షికన వ్యాసం ప్రచురితమైంది. రచనలు: ఖురాన్ సూక్తులు, ఖుర్-ఆన్ ప్రవచనములు, ముహమ్మద్ ప్రవక్త జీవితము-సందేశములు, భయ్యాశతకము, ముస్లిం విశ్వాస సాధనములు, పలు కవితలు-ధార్మిక, సాహిత్య వ్యాసాలు.



**జలాలుద్దీన్ యూసుఫ్ ముహమ్మద్ :** లోక శాంతికి దైవ సూత్రము, మతము-రాజకీయము, యదార్థమేది?, దైవ నియమావళి లాంటి పలు ధార్మిక గ్రంథాలను స్వయంగా రాసి ప్రచురించారు.

**జలీల్ అబ్దుల్ ముహమ్మద్ :** వరంగల్ జిల్లా మామనూరు గ్రామంలో 1970 జూన్ 26న జననం. తల్లితండ్రులు: ఫాతిమా బేగం, అబ్దుల్లా. కలం పేరు: జన్ను జలీల్. చదువు: బి.ఏ, తెలుగు పండిట్. గాయకుడు. 1988లో గీటురాయిలో ధార్మిక వ్యాసం రాయడంతో ఆరంభించి వివిధ పత్రికలలో వ్యాసాలు, గేయాలు, పాటలు ప్రచురితం అయ్యాయి.









1998లో స్వయంగా రాసి, పాడిన 'అదిగో ఎగురుతుంది యస్ఐఓ పతాకం' గుర్తింపు తెచ్చిపెట్టడం మాత్రమే కాకుండా అది క్యాసెట్ రూపం ధరించి ఆ సంస్థ అధికారిక ప్రబోధగీతం స్థాయిని పొంది, సంస్థ కార్యక్రమాల ఆరంభంలో ఆ పాట పాడడం ప్రధానం అయ్యింది. లక్ష్యం: సమాజం ఎదుర్కొంటున్న పలు రుగ్మతలకు ఇస్లామీయ ఆధ్యాత్మిక పరిష్కారాలు సూచించడం. **చిరునామా: మహమ్మద్ అబ్దుల్ జలీల్, సందేశ భవనం, లక్కడ్ కోట్, ఛత్తా బజార్, హైదరాబాద్-500002. సంచారవాణి: 97043 17015.**

**జమాల్ వలి ఎస్ :** కడప జిల్లా కనెకతప్పెట్ల నివాసి. ప్రభుత్వ ఉద్యోగి. రచనలు: విశ్వనాథ నాయకుడు (చారిత్రక నాటకం). పద్యాలు, పాటలు, వచన కవితలు రాశారు. కథకుడిగా, నాటకాల రచయితగా మాత్రమే కాకుండా మంచి నటుడిగా విఖ్యాతులు.

**జానీ బాషా సయ్యద్ :** గుంటూరు జిల్లా మాచర్లలో 1969 జూన్ 10న జననం. తల్లితండ్రులు: ఖాశింబీ, షేక్ సైదా సాహెబ్. చదువు:బి.ఏ. ఉద్యోగం: రాష్ట్ర వాణిజ్య పన్నుల శాఖ. 1982లో 'బాలజ్యోతి' మాసపత్రిక ఉత్తరాలు రాయడం ద్వారా రచనా వ్యాసాంగం ఆరంభమై వివిధ పత్రికలలో, సంకలనాలలో కథలు, కవితలు, వ్యాసాలు ప్రచురితం. అవార్డులు: కవిమిత్ర (పాలకొల్లు). లక్ష్యం: తెలుగు సాహిత్యంలోని సుగంధాలను పదిమందితో కలసి పంచుకోవడం, పంచడం. **చిరునామా: సయ్యద్ జానీ బాషా, ఇంటి నం. 9-542, ఏఎంజీ హాస్టల్ వద్ద, చిలకలూరిపేట-522 616, గుంటూరు జిల్లా. సంచారవాణి: 94414 09749.**



**జాస్మిన్ అహమ్మద్ సయ్యద్ :** గుంటూరు జిల్లా నరసరావుపేటలో 1980 జూలై15న జననం. తల్లితండ్రులు: షేక్ రమిజా బాను, సయ్యద్ నశీర్ అహమ్మద్. కలం పేరు: జాస్మిన్. చదువు: ఎం.ఏ (ఇంగ్లీష్). 1998 నుండి రచనా వ్యాసంగం ఆరంభం. వివిధ పత్రికలు, సంకలనాలలో చరిత్ర, సామాజిక అంశాల మీద వ్యాసాలు, కవితలు ప్రచురితం. లక్ష్యం: మూఢనమ్మకాల నుండి బయటపడే చైతన్యాన్ని ప్రజానీకంలో కలుగజేసేందుకు ప్రయత్నించడం. **చిరునామా: సయ్యద్ జాస్మిన్ అహమ్మద్, W/o. Dr. ఎస్.ఎం తల్మీజుద్దీన్, ఇంటి నం. 5-53, మెయిన్ రోడ్. ఉలవపాడు-523292, ప్రకాశంజిల్లా.**





**జవేరియా :** మెదక్ జిల్లా జోగిపేటలో 1969 ఏప్రిల్ 10న జననం. తల్లితండ్రులు: అర్షియా బేగం, ఎం.ఖాదీం. చదువు: ఎంఏ., విద్వాన్ (హిందీ). వృత్తి: విద్యాబోధన. 1982 నుండి రాయడం ఆరంభించి వివిధ పత్రికలలో, సంకలనాలలో పలు వ్యాసాలు, కవితలు ప్రచురితం. లక్ష్యం: ప్రజల్ని సామాజికంగా చైతన్యవంతుల్ని చేయడం. **చిరునామా: జవేరియా, టీచర్, ఇంటి నం. 10-132, అంబేద్కర్ కాలనీ, పటాన్ చెర్వు-502319, మెదక్ జిల్లా. సంచారవాణి: 98499 31255.**

**జవాద్ హుస్సేన్ :** శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఆర్ట్స్ కాలేజీ (తిరుపతి) లో ఉద్యోగం. చదువు: ఎం.ఎ. రచనలు: వివిధ తెలుగు పత్రికలలో గేయాలు, వ్యాసాలు ప్రచురితం. 1982లో హైదరాబాద్‌లో జరిగిన 'ఆంధ్రప్రదేశ్ ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనం' కార్యక్రమాన్ని కార్యనిర్వాహకుడిగా నిర్వహించడం మాత్రమే కాకుండా ప్రత్యేక సంచిక 'వెలుగు దివ్వెలు' ప్రచురిండంలో సహాయ సంపాదకత్వం వహించారు.

**జిలానీ అబ్దుల్ ఖాదర్ షేక్ :** గుంటూరు జిల్లా మంగళగిరిలో 1991 మే 8న జననం. తల్లితండ్రులు: అస్మత్ బేగం, ఆదం షఫీ. కలంపేర్లు: మంగళగిరి జిలాని, సత్యశ్రీ, చదువు: బి.ఎస్సీ., బి.ఇడి. వృత్తి: విద్యాబోధన (హైదరాబాద్). 2001 ఫిబ్రవరిలో గీటురాయి వారపత్రికలో ప్రచురితమైన 'ప్రేమమయం' వ్యాసం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభమై వివిధ పత్రికలలో, సంకలనాలలో సామాజిక సమస్యల పరిష్కారానికి ధార్మిక సమాధానాలను జోడించి రాసిన వ్యాసాలు, కవితలు, కథానికలు, సమీక్షా వ్యాసాలు ప్రచురితమయ్యాయి. ఖుర్ఆన్ గ్రంథంలో ప్రస్తావించబడిన శాస్త్రీయ సాంకేతిక విషయాలను సామాన్య పాఠకులకు పరిచయం చేయడం కోసం పలు పరిశోధనాత్మక వ్యాసాలు వెలువరించారు. ఆ క్రమంలో రాసిన 'సైన్స్ ఒప్పుకున్న ఖుర్ఆన్ సత్యాలు' (గీటురాయి) వ్యాసం పేరు తెచ్చి పెట్టింది. లక్ష్యం: సత్యాన్ని, శాంతిని, ప్రేమను, మంచి స్నేహాన్ని అందరికి పంచడం, **చిరునామా: షేక్ అబ్దుల్ ఖాదర్ జిలానీ, ఇంటి నం. 9-1-1/బి/4, డిఫెన్స్ కాలనీ, లంగర్ హౌస్, హైదరాబాద్-500008. సంచారవాణి: 94913 37852.** Email: ibn_adam.rediff.com.



**జిలాని ముహమ్మద్ :** పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు లో 1980 జూలై పదిన జననం. తల్లితండ్రులు: బషీరున్నీసా బేగం, మహమ్మద్ బాష. కలం పేర్లు: ఏలూరు









జిలాని, వివేక్ హేలాపురి. చదువు: ఎం.ఏ, ఎం.సి.ఏ. వృత్తి: జర్నలిజం. విద్యార్థి దశ నుండి రచనా వ్యాసం పట్ల ఆసక్తి. 2001లో 'అంతిమ గమ్యం ఏమిటీ' వ్యాసం గీటురాయి వారపత్రికలో ప్రచురితం కావడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి రాష్ట్రంలోని వివిధ తెలుగు పత్రికలలో, సంకలనాలలో కవితలు, కథానికలు, వ్యాసాలు చోటు చేసుకున్నాయి. యువతకు మార్గదర్శకంగా వ్యక్తిత్వ వికాసం ప్రధానాంశంగా ప్రత్యేకంగా రాసిన వ్యాసాలు బహుళ పాఠకాదరణ పొంది గుర్తింపు తెచ్చి పెట్టాయి. లక్ష్యం: సమాజానికి, మనవాళ్ళకు కాస్త మేలు చేయాలని, మంచి ఎక్కడున్నా గుర్తించి మరింతగా ప్రోత్సహించాలన్నది. **చిరునామా: ఏలూరు జిలాని, కేరాఫ్: సయ్యద్ హుస్సేన్, ఇంటి నం.21-1/89, ఢిల్లీ దర్వాజా, మోతి మస్జిద్ ఎదుట, నయాపూల్, అఫ్జల్ గంజ్, హైదరాబాద్-500002. సంచారవాణి: 8143369812**, Email: naanestham @yahoo.co.in

**జొహరా బాను :** కరీంనగర్ జిల్లా జమ్మిగుంట గ్రామంలో 1968 మే17న జననం. తల్లి తండ్రులు: సల్మా, ఎండి. షంషుద్దీన్. 1985లో 'విజడమ్' మాసపత్రికలో తొలి కవిత ప్రచురితమైంది. అప్పటి నుండి వివిధ పత్రికల్లో, సంకలనాలలో కవితలు, ప్రధానంగా 'నానీలు' చోటు చేసుకున్నాయి. రచన: మబ్బుచాటు చుక్కలు (నానీల సంకలనం, 2009). లక్ష్యం: ఆరోగ్యకరమైన సాహిత్యం సృష్టించడం. **చిరునామా : జొహరాబాను, ఇంటి నం. 8-2-72, కొత్త శ్రీనగర్ కాలనీ, కట్టరాంపూర్, కరీంనగర్ జిల్లా. సంచారవాణి: 99122 68440**, Email: raj_cartoonist@ yahoo.co.in.



**జానీ అమీర్ షేక్ :** 1978 డిసెంబర్ ఒకటిన జననం. తల్లి తండ్రులు: హఫిజున్నీసా, షేక్ గౌస్ బాషా. చదువు: ఏడవ తరగతి. వృత్తి: వ్యాపారం. విజయవాడ నుండి వెలువడుతున్న 'ఎక్స్‌రే' మాసపత్రికలో (2006) తొలి కవిత ప్రచురితం. అప్పటి నుండి వివిధ పత్రికలలో పలు కవితలు చోటు చేసుకున్నాయి. అవార్డు: ఎక్స్‌రే అవార్డు (విజయవాడ,2008) లక్ష్యం: మంచి దిశగా ప్రజల మనస్సులను మార్చడానికి రచయితగా ప్రయత్నించడం. **చిరునామా: షేక్ అమీర్ జానీ, ఇంటి నం.11-39, గురజాడ రోడ్, ఉయ్యూరు-521165, కృష్ణా జిల్లా. సంచారవాణి: 99855 76396**.



**కాలేషా షేక్ :** ప్రకాశం జిల్లా కందుకూరులో 1965 ఆగస్టు 18న జననం. తల్లితండ్రులు: మైమున్నీసా బేగం, అబ్దుల్ అజీజ్. వృత్తి: జర్నలిజం. కలం పేర్లు: మాలిక్, రేష్మా. 1986లో ఆంధ్రప్రభలో వ్యాసం ప్రచురితమైనప్పటి నుండి రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికలలో, సంకలనాల్లో వ్యాసాలు, కవితలు ప్రచురితం. 'ప్రకాశం ఎక్స్‌ప్రెస్' రాజకీయ సామాజిక వారపత్రిక కొంతకాలం నడిపారు. లక్ష్యం: ఆలోచింపజేయు వ్యాసాల ద్వారా ప్రజలలో సామాజిక చైతన్యం కలుగజేయడం. **చిరునామా: షేక్ కాలేషా, ఇంటి నం. 11-2- 56, సంతోష్‌నగర్, ఆర్డీవో కార్యాలయం ఎదుట, కందుకూరు-523105, ప్రకాశం జిల్లా. సంచారవాణి: 99599 43759, 98489 72765,** Email: prakasamexpressweekly@ yahoo.com



**కమాల్ సాహెబ్ షేక్ :** కడప జిల్లా రాజుపాలెం మండలం పర్లపాడులో 1948 ఏప్రిల్ రెండున జననం. తల్లితండ్రులు: హుస్సేన్ బీ, ఫక్రుద్దీన్. జమ్మలమడుగులోని జూనియర్ కళాశాలలో తెలుగు పండితులుగా ఉద్యోగం. కవితలు, గేయాలు రాశారు.

**కరీం ఖాన్ పఠాన్ :** ప్రకాశం జిల్లా మార్కాపురంలో 1973 జనవరి 10న జననం. తల్లి తండ్రులు: ఫాతిమా, పి. ఇస్మాయిల్ ఖాన్. కలం పేరు: కెకె. చదువు: బి.ఏ. ఉద్యోగం: గీటురాయి వారపత్రిక (హైదరాబాద్). 1997 మార్చిలో గీటురాయిలో వ్యాసం ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలలో, సంకలనాలలో కథానికలు, వ్యాసాలు ప్రచురితం. అప్పటి నుండి రాసిన వ్యాసాలలో 2005 జూలైలో రాసిన 'కట్నం...కాదు కానుకలు' కథకు గుర్తింపు లభించింది. ఉర్దూలో రాసిన ధార్మిక-సామాజిక వ్యాసాలను తెలుగులోకి అనువదించి ప్రచురణ. లక్ష్యం: ప్రజలలో ఇస్లాం పట్ల ప్రచారంలో ఉన్న అపోహలను దూరం చేయాలని, మూఢాచారాల నిర్మూలనకు అవసరమయ్యే చైతన్యం ప్రజానీకంలో కలుగజేయాలన్నది. **చిరునామా: పఠాన్ కరీం ఖాన్, సందేశ భవనం, లక్కడ్‌కోట్, చత్తాబజార్, హైదరాబాద్ - 500002. సంచారవాణి: 99489 50486,** Email: kk_deziner@ yahoo.co.in



**కరీముల్లా ఖాన్ పఠాన్ :** ప్రకాశం జిల్లా ఒంగోలులో 1975 జూన్ ఆరున జననం. తల్లితండ్రులు: సిలార్ బి, పఠాన్ ఖాన్. కలం పేరు: నబి, నబి-కె- ఖాన్. చదువు: పదవ తరగతి. వృత్తి: సోఫా వర్క్స్. 'మహా ప్రస్థానం' ప్రేరణతో తొలిసారిగా రాసిన 'ఒడ్డుకు







చేరని బ్రతుకులు' కవిత ఆంధ్రభూమి పత్రికలో 2000 ఏప్రిల్ మాసంలో ప్రచురితం కావడంతో రచనారంగ ప్రవేశం. అప్పటినుండి వివిధ పత్రికలలో, కవితా సంకలనాలలో పలు కవితలు, కథానికలు చోటు చేసుకున్నాయి. ఆకాశవాణి ద్వారా ప్రసారానికి నోచుకున్నాయి. గుజరాత్ గాయం (2000) లో రాసిన కవిత 'చిక్కు ప్రశ్న', ప్రియదత్త వారపత్రికలో (2004) ప్రచురితమైన 'సముద్రం' కథ గుర్తింపు తెచ్చిపెట్టాయి. కథలలో 'మౌనం మాట్లాడింది' ఆకాశవాణి ద్వారా 2009 డిసెంబరులో ప్రసారం అయ్యింది. పలు సన్మానాలు- సత్కారాలు లభించాయి. రచనలు: 1. నిషిద్ధాక్షరాలు (కవితా సంపుటి, 2003), 2. వేకువ కోసం (దీర్ఘ కవిత, 2007). నిషిద్ధాక్షరాలు ఖ్యాతి గుర్తింపు తెచ్చి పెట్టింది. లక్ష్యం: ముస్లిం ప్రజానీకం మనోభావాలు, కష్టాలు -కడగండ్లను సమాజం దృష్టికి తేవాలని, అభ్యున్నతి దిశగా ముస్లిం సమాజం ప్రయాణానికి ప్రేరణ ఇచ్చే, మత సామరస్యం, స్నేహభావం పటిష్టపర్చే రచనలు చేయాలని. **చిరునామా: పఠాన్ కరీముల్లా ఖాన్ (నబి.కె.ఖాన్), రాయల్ సీట్ కవర్ వర్క్స్, కృష్ణా థియేటర్ రోడ్డు, ఇస్లాంపేట, ఒంగోలు-523001, ప్రకాశం జిల్లా. సంచారవాణి: 99859 82292.**



**కరీముల్లా షేక్ :** గుంటూరు జిల్లా వినుకొండలో 1964 జూన్ ఒకటిన జననం. తల్లి తండ్రులు: షేక్ షంషున్నిసా, షేక్ మహబూబ్. చదువు: ఎం.ఏ., బి.ఇడి. వృత్తి: ఉపాధ్యాయులు. ప్రవృత్తి: కవిత్వం. విద్యార్థిగా సామాజిక సమస్యల మీద వ్యాసాలు, కవిత్వం రాయడం 1982 నుండి ఆరంభం. ఆ తరువాత రాష్ట్రంలోని వివిధ పత్రికలలో సామాజిక-ధార్మిక వ్యాసాలు, కవితలు, గేయాలు, సాహిత్య విమర్శనా వ్యాసాలు, కథలు చోటు చేసుకున్నాయి. తెలుగులో ప్రచురితమైన పలు కవితలు ఆంగ్లం, హిందీ భాషలలోకి తర్జుమా చేయబడి ఆయా భాషా పత్రికలలో ప్రముఖంగా ప్రచురితం అయ్యాయి. ఈ కవితల్లో 'దుఃఖ:లిపి', 'కవాతు', 'సూఫీ కల', 'నిషిద్ధాశ్రువు', 'నా నీడనైనా సరే' మంచి గుర్తింపు తెచ్చి పెట్టాయి. రచనలు: 1. ఆయుధాలు మొలుస్తున్నాయి (అభ్యుదయ కవిత్వం, 1998), 2. వినుకొండ చరిత్ర (పరిశోధనాత్మక రచన, 1999), 3. గాయ సముద్రం (కవిత్వం, 1999), 4. 'థూ' (కవిత్వం, 2002), 5. నా రక్తం కారు చౌక (కవిత్వం, 2002), 6. సాయిబు (ఇస్లాంవాద దీర్ఘకవిత, 2004), 7. ఖిబ్లా (సంపాదకత్వం, ఇస్లాంవాద కవితా సంకలనం, 2006), 8. కవాతు (సంపాదకత్వం, కవితా సంకలనం, 2007), 9. ఈద్ ముబారక్ (కవితా సంపుటి, 2009), 10. కొలిమి (సాహితీ వ్యాసాలు,



2009), 11. ముస్లిం విముక్తి గీతం (2010), 12. కరీముల్లా కవిత్వం (2010). 13. ఇస్లాం వాద వాదోపవాదాలు (సంపాదకత్వం, వ్యాసాలు, 2010). తొలి ఇస్లాంవాద దీర్ఘకవితగా 'సాయిబు' గుర్తింపు తెచ్చి పెట్టడమే కాకుండా తెలుగు సాహిత్యంలో 'ఇస్లాంవాదం' ఆరంభమై చర్చకు కారణమైంది. అనకాపల్లి ఇండియన్ హైకూక్లబ్ ఆధ్వర్యంలో 'సాయిబు' దీర్ఘ కవిత కవి స్వీయపఠనంతో ప్రత్యేకంగా తయారైన 'సిడి' విడుదలయ్యింది. అవార్డులు-పురస్కారాలు: జాతీయ కళాలయ విశిష్ట పురస్కారం (పాలకొల్లు, 2008), జాషువా ఫౌండేషన్ ట్రస్ట్ పురస్కారం (1995, హైదరాబాద్), ఆనందమయి పురస్కారం (2001, ఒంగోలు), అభినందన సంస్థ అవార్డు (1994, తెనాలి), సహృదయ సాహితి అవార్డు (విశాఖపట్నం, 1997), బాపట్ల చిల్డ్రన్ ఆర్ట్స్ థియేటర్ అవార్డు. రాష్ట్ర స్థాయి సాహితీ-సాంస్కృతిక సంస్థలచే సన్మానాలు-సత్కారాలు. లక్ష్యం: ఇస్లాం పట్ల ప్రజలలో కలుగజేస్తున్న అపోహలను తొలగించడం, ముస్లింలను అభ్యున్నతి దిశగా ప్రయాణింప జేసేందుకు తగిన ప్రేరణ కల్గించడం, అన్నిరకాల మతోన్మాదానికి-ఉగ్రవాదానికి వ్యతిరేకంగా, సామాజిక స్పృహ లక్ష్యంగా ప్రజా చైతన్యానికి దోహదపడడం. **చిరునామా: షేక్ కరీముల్లా, ఇంటి నం. 21-55, పెద్ద మసీదు బజార్, వినుకొండ-522647, గుంటూరు జిల్లా. సంచారవాణి: 94415 02990**, Email: karimullakavi2010@gmail.com.

**ఖదీర్ బాబు మహమ్మద్ :** నెల్లూరు జిల్లా కావలిలో 1972 ఏప్రిల్ 28న జననం. తల్లి తండ్రులు: సర్తాజ్, కరీం. చదువు: బిఎస్సీ (కంప్యూటర్స్), ఉద్యోగం: 'సాక్షి' దినపత్రిక, హైదరాబాద్. 1990 'స్వాతి' వారపత్రికలో 'కళ్యాణి' కథ ప్రచురితం కావడంతో రచనా వ్యాసంగం ఆరంభం. 1995లో రాసిన 'పుష్పగుచ్ఛం' ఆదివారం ఆంధ్రజ్యోతిలో ప్రచురితమై గుర్తింపు తెచ్చిపెట్టింది. అప్పటినుండి ప్రచురితమైన కథలలో 'దావత్, జమీన్, దూద్ బఖష్, న్యూ బాంబే టైలర్స్, ఖాదర్ లేడు, పెండెం సోడా సెంటర్, ఢాకన్, కింద నేల ఉంది' కథలు పాఠకుల ప్రశంసలందుకున్నాయి. ఈ కథలలో ఇంగ్లీషులో ఆరు, హిందీలో మూడు, మరాఠీలో రెండు, ఒరియాలో రెండు అనువాదమై ఆయా భాషా పత్రికలలో ప్రముఖంగా చోటుచేసుకున్నాయి. ప్రచురణలు: 1.దర్గా మిట్ట



కతలు (1997), 2. పోలేరమ్మ బండ (2004), 3.ఖాదర్ లేడు (2003), 4.పుప్పుజాన్ కతలు (2005), 5 ఢాకన్ (2006), 6.మన్ చాహె గీత్ (2007), 7. కింద నేల ఉంది (2007). 8.గెట్ పబ్లిష్డ్ (2010). 'దర్గామిట్ట కతలు' వెంకటేశ్వర విశ్వవిద్యాలయం (తిరుపతి), సెంట్రల్ యూనివర్శిటీ (హైదరాబాద్) లో ఎంఫిల్, పిహెచ్‌డిలకు పరిశోధనాంశంగా స్వీకరించారు. 'పోలేరమ్మ బండ' గతకాలపు ఉన్నతపాఠశాల విద్యార్థుల







జీవనాన్ని ప్రతిబింబించిన కథల సంపుటిగా ఆదరణ పొందింది. పిల్లల మౌఖిక కథా సాంప్రదాయాన్ని పట్టుకునే ప్రయత్నం చేసిన సంపుటిగా 'పుప్పుజాన్ కతలు' నూతన ఒరవడి సృష్టించింది. 'ఖాదర్ లేడు' కథ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయంలో పిజీ విద్యార్థులకు పాఠ్యాంశమయ్యింది. 'న్యూ బాంబే టైలర్స్' (2000), 'జమీన్' (2008) కథలకు 'కథా సంస్థ' రెండుసార్లు జాతీయ అవార్డును ప్రకటించింది. 'ప్రజాతంత్ర' ప్రచురించిన 'సాహిత్య సంచిక'లకు కె.శ్రీనివాస్‌తో కలసి సంపాదకత్వం వహించారు.'ఇప్పుడు వీస్తున్న గాలి' శీర్షికతో 'నిహర్ ఆన్‌లైన్'లో ఆరవై మంది సాహిత్య కారులను పరిచయం చేశారు. 'మన్ చాహెగీత్' వనితా టీవీలో ప్రసారమైంది. 'సాక్షి' దినపత్రికలో 'బాలివుడ్ క్లాసిక్స్' పేరిట హిందీ సినిమాల మీద విశ్లేషణాత్మక వ్యాసాలు ప్రచురితం. పురస్కారాలు-అవార్డులు: రావిశాస్త్రి పురస్కారం (రాజమండ్రి, 2005), భాషా సమ్మాన్ అవార్డు (మైసూరు, 2006), చాసో అవార్డు (విజయనగరం, 2005), లక్ష్యం: మనుషుల జీవితాల్లోని కష్టసుఖాలను పాఠకుల ఎదుట ఆవిష్కరించి, కథను చిత్తశుద్ధితో నడిపి చెప్పాలనుకున్న విషయం పట్ల పాఠకుడిలో చక్కని స్పృహను కల్గించడానికి ప్రయత్నించడం. **చిరునామా : మహమ్మద్ ఖదీర్‌బాబు, ఇంటి నం. 1-13-6, పాతూరు, పురపాలక సంఘం ఉన్నత పాఠశాల ఎదురు, కావలి-524 201, నెల్లూరుజిల్లా, సంచారవాణి: 92900 64047.**

**ఖాదర్ ఖాన్ మహమ్మద్ :** తూర్పుగోదావరి జిల్లా అమలాపురంలో 1949 జనవరి నాల్గున జననం. తల్లితండ్రులు: సఫియా బీబి, ఇబ్రహీం ఖాన్. కలంపేరు: బాబా. చదువు: బిఎస్సీ. ఉద్యోగం: రాజమండ్రిలో తపాలా శాఖలో పోస్టుమాస్టర్‌గా బాధ్యతలు నిర్వహిస్తూ



ఇటీవల పదవీవిరమణ. చిన్ననాటి నుండి సాహిత్యం పట్ల మక్కువ ఉన్నా, 1960 ప్రాంతంలో బాల కవిగా బాలకవుల సమ్మేళనంలో పాల్గొనడం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభమైంది. అప్పటి నుండి కవితలు, కథానికలు, సాహిత్య వ్యాసాలు, సమీక్షలు వివిధ పత్రికలలో ప్రచురితం. ప్రధానంగా హాస్యస్ఫోరక రచనలు చేయడం, ఆయా కార్యక్రమాలలో విస్తృతంగా పాల్గొనడం పట్ల ప్రత్యేక ఆసక్తి. రచనలు: నాకూ మనసున్నది (కవితా సంపుటి). అవార్డులు-పురస్కారాలు: ప్రజాకవి (ప్రజాపత్రిక వారపత్రిక, రాజమండ్రి), కవిరత్న (కళాదర్బార్, రాజమండ్రి), హాస్య రసాధిరాజు (సాహితీ వేదిక-అనకాపల్లి, హ్యూమర్ క్లబ్-రాజమండ్రి). లక్ష్యం: పాఠకుల మనస్సులకు బాగన్పించే రచనలు మాత్రమే ఎల్లకాలం చేయాలన్నది. **చిరునామా: మహమ్మద్ ఖాదర్ ఖాన్, ఇంటి నం. 86-15-6/10, పవనిక రెసిడెన్సీ, ఎస్-4, వాడరేవు నగర్, తిలక్‌రోడ్, రాజమండ్రి-533 103, తూర్పుగోదావరి జిల్లా. సంచారవాణి: 93902 35789.**

**ఖాదర్ మస్తాన్ అలీషా షేక్ :** ప్రకాశం జిల్లా కొమ్మలపాడు గ్రామంలో 1923లో జన్మించారు. తల్లితండ్రులు: మస్తానమ్మ, చిన్న మొహమ్మద్ ఖాశిం సాహెబ్. ఆయన పూర్వీకులు షేక్ ఖాదర్ మస్తాన్ అలీషా, షేక్ దరియా హుస్సేన్ అలీషాలు (అచల సిద్ధాంత పీఠం, కొమ్మల పాడు) రూపొందించిన ఆధ్యాత్మిక గ్రంథం 'ఆర్యానంద సుధా లహరి'ని పూర్తి స్థాయిలో విషయం పరంగా అభివృద్ధిపర్చి 1977లో వెలువరించారు. ఈ ఆధ్మాత్మిక గ్రంథంలో ప్రబోధించిన ధార్మిక-తాత్విక భావాలను జీవితాంతం ప్రచారం చేశారు. ఆ తరువాత ఈ గ్రంథం పలు ముద్రణలకు నోచుకుంది. షేక్ ఖాదర్ మస్తాన్ అలీషా అక్టోబర్ ఒకటి, 1983లో కొమ్మలపాడులో కన్నుమూశారు.



**ఖాదర్ మొహియుద్దీన్ ముహమ్మద్ అబ్దుల్ :** కృష్ణా జిల్లా ఎ.కొండూరు మండలం చీమలపాడు గ్రామంలో 1955 ఆగస్టు 10న జననం. తల్లితండ్రులు: తురాబ్ బీబీ, ముహమ్మద్ అబ్దుల్ రజాఖ్. కలంపేరు: ఖాదర్ మొహియుద్దీన్. చదువు: సాహిత్య విశారద (ప్రయాగ). తెలుగు, హిందీ, ఉర్దూ, ఇంగ్లీషు భాషల్లో ప్రవేశం. వృత్తి: జర్నలిజం. 1978 నుండి 1991 వరకు 'విశాలాంధ్ర', 'ఉదయం', 'ఆంధ్రభూమి' దినపత్రికల్లో పలు బాధ్యతల నిర్వహణ. పందొమ్మిది ఏండ్ల వయస్సులో 'విశాలాంధ్ర' దిన పత్రికలో 'చెహోవ్ సాత్విక విషాదం' వ్యాసం రాయడం ద్వారా రచన వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికల్లో, సంకలనాల్లో కవితలు, వ్యాసాలు, సాహిత్య విమర్శనా వ్యాసాలు, సమీక్షలు, సమీక్షా వ్యాసాలు చోటు చేసుకున్నాయి. ఆ కవితల్లో కొన్ని ఇతర భాషల్లోకి అనువదించబడి ఆయా భాషా పత్రికలలో ప్రచురితం అయ్యాయి. ఈ రచనలలో 1979లో రాసిన 'అనుభూతి వాదం అంటే ఏమిటి?' (ఆంధ్రజ్యోతి, 1979), 'ఆరుద్ర ఎక్కాల్సిన రైలు ఒక జీవితకాలం లేటు' (ఉదయం, 1985), 'గద్దర్ ఒక యుద్ధనౌక', 'బ్రాహ్మణీకం నుంచి బ్రాహ్మణీకంలోకి...' (ఆంధ్రజ్యోతి వారపత్రిక) అను సాహిత్య వ్యాసాలు చర్చకు కారణమయ్యాయి. 1991లో ఫిబ్రవరిలో వెలువరించిన 'పుట్టుమచ్చ' (కవితా సంపుటి), 'అప్పటి దాకా కొట్లాదిమంది ముస్లింల గొంతులోంచి బయటకు రాకుండా గుక్కపట్టిన దుఃఖాన్ని, వ్యథనూ...వ్యక్తీకరించింది. తొలిసారిగా ముస్లింల జీవితంలో అనేక పార్శ్వాలను ఈ కవిత ద్వారా ఖాదర్ ప్రపంచం దృష్టికి తెచ్చాడు' అని ప్రశంసలందుకుంది. ఈ కవితా సంపుటిలోని 'పుట్టుమచ్చ' కవిత జాతీయ స్థాయిలో బహుళ ప్రజాదరణ పొందింది. అంతర్జాతీయ సాహిత్య సదస్సుల్లో ప్రత్యేక గుర్తింపు సంపాదించి ఆంగ్లం,









జర్మన్, హిందీ, ఉర్దూ తదితర ఇతర భాషల్లోకి అనువదించబడింది. ఆయా భాషా పత్రికల్లో, సంకలనాల్లో చోటుచేసుకుంది. ఇండియా టుడే (పత్రిక), తానా, యువభారతి, భారత్ భవన్ (భోపాల్) లాంటి సంస్థలు రూపొందించిన ప్రపంచ ప్రఖ్యాతి పొందిన వంద కవితలతో కూడిన సంకలనాల్లో 'పుట్టుమచ్చ' కవిత స్థానం పొందింది. యాభై సంవత్సరాల స్వాతంత్ర్య దినోత్సవ సంబరాల సందర్భంగా 'భారతీయ ముస్లింల ముఖచిత్రం' అను సుదీర్ఘ చర్చా వ్యాసాన్ని ఎండి.రియాజ్ (వరంగల్)తో కలసి రాసి ప్రచురించారు. 1991లో విజయవాడ నుండి వెలువడిన 'షేర్ కాలమ్' పత్రికను నిర్వహించారు. 1998లో 'శ్రీ రాములయ్య' సినిమాకు కథను సమకూర్చారు. **చిరునామా: ఖాదర్ మొహియుద్దీన్ అబ్దుల్ ఖాదర్, కెజి గుప్తా మున్సిపల్ ఎంప్లాయీస్ కాలనీ, బందర్ రోడ్, విజయవాడ-520 010. దూరవాణి: 90009 76999, 0866-2475374**. Email: ushakhadar@yahoo.com.

**ఖాదర్ షరీఫ్ షేక్ :** నెల్లూరు జిల్లా సూళ్ళూరుపేటలో 1975 జూన్ ఆరున జననం. తల్లితండ్రులు: ముంతాజ్ బేగం, షేక్ మస్తాన్. ఉద్యోగం: రాష్ట్ర నీటిపారుదల శాఖ (సోమశిల). 1998లో ఆంధ్రప్రభలో 'సఫర్' కథ ప్రచురణతో రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటినుండి రాష్ట్రంలోని వివిధ పత్రికల్లో, పలు కథా-కవితా సంకలనాల్లో కవితలు, కథలు, సాహిత్య వ్యాసాలు, సమీక్షా వ్యాసాలు ప్రచురితం. రచనలు: శ్వేతసంబంధాలు (2000 లో ఐదుగురు మిత్రులతో కలసి రాసిన కవితా సంపుటి), పసుపునీళ్ళ వాన (కథా సంపుటి, 2010), వివశత్వం (కవితా సంపుటి, 2010). పురస్కారాలు: ఉత్తమ ప్రాంతీయ కవితా అవార్డు (2004, హైదరాబాద్), ప్లమింగ్‌గో ఫెస్టివల్ అవార్డు (సూళ్ళూరుపేట, 2007), కుందుర్తి -రంజనీ అవార్డు (2008, హైదరాబాద్), ఇండియన్ లిటరరీ అవార్డు (2009, న్యూఢిల్లీ), రాష్ట్రీయ ఉత్తమ కవితా అవార్డు (2009, న్యూఢిల్లీ), ఉగాది పురస్కారం (2008, హైదరాబాద్). లక్ష్యం: సమాజంలో నిజమైన మానవుని నిర్మాణం కోసం సాహిత్యం ద్వారా కృషి సాగించడం. **చిరునామా: ఖాదర్ షరీఫ్, క్వార్టర్ నం.18/3, సోమశిల ప్రాజెక్టు క్వార్టర్స్, సోమశిల-524301, నెల్లూరు జిల్లా. సంచారవాణి: 94419 38140.**



**ఖాదర్ వలి షేక్ :** చిత్తూరు జిల్లా శ్రీకాళహస్తిలో 1943 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: సయ్యద్ ఫాతిమాబీ, షేక్ అబ్దుల్ రహ్మాన్. కలంపేరు: అన్వర్. చదువు: ఎం.ఏ., బి.ఇడి. ఉద్యోగం: అధ్యాపకులు (రిటైర్డ్). తెలుగు, ఉర్దూ, హిందీ, అరబిక్ భాషల్లో ప్రవేశం. 1960లో 'చందమామ' మాసపత్రికలో 'స్నేహితులు' తొలి కథ ప్రచురితం. అప్పటినుండి వివిధ పత్రికల్లో కథలు, కవితలు, గేయాలు, వ్యాసాలు, ప్రధానంగా బాల



సాహిత్యానికి సంబంధించిన చిన్న చిన్న కథలు చోటు చేసుకున్నాయి. వివిధ భాషల్లో వెలువడిన మంచి కథలను తెలుగు లోకి అనువదించడం, బాలల భవిష్యత్తు పట్ల ప్రత్యేక ఆసక్తితో బాల సాహిత్యం అభివృద్ధి పట్ల శ్రద్ధ. తెలుగులో వచ్చిన మంచి కవితలను ఉర్దూలో తర్జుమా చేసి ప్రచురించడం. రచన: ప్రవక్తగారి న్యాయతీర్పులు. లక్ష్యం: సమాజాన్ని మంచి వైపుగా మార్గదర్శకం చేయడం. **చిరునామా: షేక్ ఖాదర్ వలి, ఇంటి నం.1-1948, పెద్ద మసీదు వద్ద, శ్రీకాళహస్తి, చిత్తూరు జిల్లా. దూరవాణి: 08578-320346.**

**ఖాద్రి సయ్యద్ మొహిద్దీన్ :** ఖమ్మం జిల్లా కల్లూరులో 1941 ఏప్రిల్ రెండున ఎస్.ఎ.ఖాద్రి, ఖాతూన్ బీలకు జన్మించారు. ఉర్దూ, అరబిక్ భాషా పండితులైన ఆయన ఉపాధ్యాయుడిగా సుదీర్ఘకాలం పనిచేసి ప్రధానోపాధ్యాయుడిగా రిటైర్డ్ అయ్యారు. 1979లో 'పరదా' మీద తొలి వ్యాసం రాయడంతో సాహిత్య ప్రస్థానం ఆరంభించారు. ఇతర భాషలలోని ధార్మిక గ్రంథాలను తెలుగులోకి అనువదించారు. ఈ మేరకు స్వతంత్ర, అనువాద గ్రంథాలు 20 వరకు ప్రచురితం అయ్యాయి. ఈ గ్రంథాలన్నీ పలుమార్లు పునర్ముద్రణకు నోచుకోవడం విశేషం. తెలుగు, హిందీ భాషలలో మంచి ప్రవేశం ఉన్న ఆయన రాసిన 150 పైగా ధార్మిక వ్యాసాలు, కవితలు, కథలు వివిధ తెలుగు పత్రికల్లో ప్రచురితమయ్యాయి. ఎస్.ఎం ఖాద్రి రాసిన మరికొన్ని బృహత్తర గ్రంథాలు ప్రస్తుతం ప్రెస్‌లో ఉన్నాయి. ఆయన రాసిన చాలా పుస్తకాలను తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్ (హైదరాబాద్) ప్రచురించింది. చివరిక్షణం వరకు రచనా వ్యాసంగంలో గడిపిన సయ్యద్ మొహిద్దీన్ ఖాద్రి ఖమ్మం జిల్లా కల్లూరు సమీపంలోని స్వగ్రామం రంగంబంజరులో 2008 డిసెంబరు 25న కన్నుమూశారు. (సమాచారం: సయ్యద్ మొహిద్దీన్ ఖాద్రితో ఇంటర్వ్యూ, 2008 ఆగస్టు 11న, హైదరాబాద్.)



**ఖాజా :** కర్నూలు జిల్లా. కలం పేరు-రోషన్. సాహిత్యాభిలాషి. రచనలు: విధివినోదం, గేయకవితలు.

**ఖాజా బి. ఎండి. :** అనంతపురం జిల్లా ఉరవకొండ నివాసి. నాటకాలు, నాటికలు, కవితలు గేయాలు, కథానికలు రాశారు. కవితలు, గేయాలు ప్రచురితం.

**ఖాజా హుస్సేన్ సయ్యద్ :** అనంతపురం జిల్లా గుత్తిలో 1926 జూన్ 16న జన్మించారు. తల్లితండ్రులు: మోహిద్దీన్‌బీ, సయ్యద్ సర్వర్ సాహెబ్. చదువు: బి.ఎ., ఎల్ఎల్.బి. భారత









ప్రభుత్వ పర్యావరణ శాఖలో చేరి పర్యావరణ శాస్త్రవేత్తగా 1981లో స్వచ్ఛంద పదవీ విరమణ చేశారు. పర్యావరణ పరిరక్షణ పట్ల సామాన్య ప్రజానీకంలో అవగాహన కల్గించాలన్న లక్ష్యంతో సామాన్యులకు కూడా సులభంగా అర్థం అయ్యేలా వ్యాసాలు రాశారు. అతి సరళమైన భాషలో రాసిన వ్యాసాలు పలు పత్రికలలో ప్రచురితం అయ్యాయి. రాయలసీమ ప్రాంతంలోని కరువు నివారణకు మేఘమథనం ఒక్కటే ఏకైక మార్గమని సూచించి అటు ప్రజలలో, ఇటు ప్రభుత్వాధినేతలలో మేఘ మథనం పట్ల అవగాహన కల్గించేందుకు వ్యాసాలు వెలువరించారు. పర్యావరణం, శాస్త్రీయ అంశాల మీదనే కాకుండా ముస్లిం సమాజానికి సంబంధించి ధార్మిక-సామాజిక -న్యాయ సంబంధిత అంశాల గురించి రాసిన పలు వ్యాసాలు వివిధ పత్రికలలో చోటు చేసుకున్నాయి. సామాజిక స్పృహ కలిగించే పలు కవితలు, వ్యాసాలు రాసిన ఆయన 2008 జూలై16న అనంతపురంలో కన్నుమూశారు.

**ఖాజా ఎండి. :** ఖమ్మం జిల్లా పాల్వంచలో 1968 ఆగస్టు ఒకటిన జన్మించారు. 1998లో 'ఫత్వా' స్వీయ కవితా సంపుటి వెలువరించారు. 2005లో 'ముస్లింవాద తాత్విక-సిద్ధాంతం, సాహిత్యం' సైద్ధాంతిక గ్రంథాన్ని వెలువరించారు. పలు కవితలు, సాహిత్య వ్యాసాలు, కథలు వివిధ పత్రికలలో, కథా-కవితా సంకలనాలలో ప్రచురితం అయ్యాయి. చాలా కవితలు ఇతర భాషల్లోకి అనువదించబడి ఆయా భాషా పత్రికల్లో చోటుచేసుకున్నాయి. **చిరునామా: ఎండి. ఖాజా, ఫ్లాట్ నం. 407, వెంకటాద్రి అపార్టుమెంట్స్, యర్రముక్కపల్లి, కడప, కడప జిల్లా. సంచారవాణి 9848212329.**

**ఖాజా మైనద్దీన్ మహమ్మద్ :** మహబూబ్ నగర్ జిల్లా పెబ్బేరులో 1956 జూన్ ఐదున జననం. కలంపేరు: పెబ్బే ఖాజామైనద్దీన్. తల్లితండ్రులు: జానుబీ, షేక్ బడేసాహెబ్. ఉద్యోగం: ఉపాధ్యాయులు. 1973లో 'కార్మికులు' కవితతో రచనా వ్యాసంగం ఆరంభమైంది. అప్పటి నుండి వివిధ పత్రికల్లో, పలు సంకలనాలలో కవితలు, వ్యాసాలు, కథానికలు ప్రచురితం అయ్యాయి. లక్ష్యం: ప్రజానీకాన్ని అభ్యుదయం దిశగా ఆలోచింపజేయడం. **చిరునామా: మహమ్మద్ ఖాజామైనద్దీన్, ఇంటి నం.1-10-85/18, షా షాహెబ్ గుట్ట, మహబూబ్‌నగర్-509002, సంచారవాణి: 93966 26276.**



**ఖాజావలి షేక్ :** గుంటూరు జిల్లా గుంటూరులో 1963 జూలై 15న జననం. తల్లి

తండ్రులు: జాన్ బి, షేక్ సైదా. చదువు: బి.ఏ. వ్యాపకం: సామాజిక కార్యకర్త. వినియోగదారుల ఉద్యమానికి సంబంధించి రాసిన వ్యాసాలు 1989 నుండి వివిధ పత్రికలలో ప్రచురితం కావడంతో రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికలలో సామాజిక-రాజకీయ వ్యాసాలు, సమీక్షలు, విశ్లేషణలు ప్రచురితం అయ్యాయి. వినియోగదారుల ఉద్యమ పత్రికగా 'వినియోగ వాణి' మాసపత్రిక (గుంటూరు) ను కొంత కాలం నిర్వహించారు. లక్ష్యం: ప్రజాస్వామిక హక్కులు-బాధ్యతల పట్ల ప్రజానికాన్ని చైతన్యవంతుల్ని చేయడం. **చిరునామా: షేక్ ఖాజావలి, ఇంటి నం. 26-18-30, మసీదు వీధి, కంకరగుంట గేటు వద్ద, గుంటూరు-522004 గుంటూరు జిల్లా, సంచారవాణి: 99492 75002**. Email: khajavaliguntur@ gmail.com



**ఖాలిదా పర్వీన్ :** కేరళ రాష్ట్రం పాలకాడ్ జిల్లా కుయల్‌మన్నన్ గ్రామంలో 1955 నవంబర్ 30న జననం. తల్లి తండ్రులు: రాజ్యలక్ష్మి, పంచాపకేసన్. వ్యాపకం: ధార్మిక ప్రచారం. ఆంధ్రప్రదేశ్ వచ్చి తెలుగు నేర్చుకుని కవితలు, వ్యాసాలు రాయడం ఆరంభించి చారు. పలు కవితలు, వ్యాసాలు వివిధ పత్రికలు, సంకలనాలలో ప్రచురితం అయ్యాయి. రచనలు: సందేశ ప్రచారంలో మహిళల పాత్ర (అనువాదం). లక్ష్యం: సత్య సందేశాన్ని రచనల ద్వారా ప్రజలకు అందించడం. మంచి వక్త. **చిరునామా: ఖాలిదా పర్వీన్, ఇంటి నం.12-2-881/31, జెబాబాగ్, ఆసిఫ్‌నగర్, హైదరాబాద్ -28. సంచార వాణి: 92465 78831**, Email: k_parveen2005@yahoo.com



**ఖాశిం ఖాన్ ముహమ్మద్ :** నల్లగొండ జిల్లా సూర్యాపేట జన్మస్థలం. విద్యాభ్యాసం: ఎం.ఏ. ఆంగ్లం, అరబ్బీ, సంస్కృత భాషల్లో పండితులు. రచనలు: అవిమారకము, ఆత్మాభిమానము, ఆల్బర్ట్ ఐన్‌స్టీన్, ఉత్తర రామచరిత్ర, ఖురానే షరీఫ్ (అనువాదం), దేవుడు -నాదేశము, దేశభక్తులు, ప్రతిమ, బాల విజ్ఞానసర్వస్వము, వాసవదత్త, భాష మహాకవి.

**ఖాశిం సాహెబ్ షేక్ :** కర్నూలు జిల్లా ఆళ్ళగడ్డ తాలూకా ఆలమూరు జన్మస్థలం. పుట్టిన తేది: 24-06-1924. తల్లితండ్రులు: మదార్‌బి, లాల్‌మియా. చదువు: బి.ఏ., బి.టి. అప్పటి నివాసం: 1/285 సి, శ్రీరామనగర్, కడప. రచనలు: వీరభద్ర విజయము, దేశమంటే? అనార్కలి, రాముడు, కబీరు స్వతంత్ర రచనలు. కబీరు బోధామృతము అనువాద గ్రంథం. 1964 ప్రాంతంలో కన్నుమూశారు.







**ఖాశిం సాహెబ్ షేక్ డాక్టర్ :** కడప జిల్లా తొండూరు గ్రామంలో 1938 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: ఫాతిమా బీబీ, ఫక్రుద్దీన్ సాహెబ్. కలంపేరు: డాక్టర్ బద్దేలి, కల్లూరు. చదువు: బివిఎస్సీ. ఉద్యోగం: వెటర్నరీ అసిస్టెంటు సర్జన్ (రిటైర్డ్). పద్నాల్గవ ఏట నుండి నాటకాలు రాయడం, మిత్రులతో కలసి ప్రదర్శించడంతో ఆరంభమైన ఆసక్తి మరింత ముందుకు సాగి 1955లో కవితలు ప్రచురితం. అప్పటి నుండి వివిధ పత్రికలలో కథలు, కవితలు, కథానికలు, వ్యంగ రచనలు, గేయ కథలు, గేయాలు, ధార్మిక వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ఉర్దూ నుండి పలు వ్యాసాలను తెలుగులోకి అనువదించి ప్రచురించారు. లక్ష్యం: మంచి మార్పుకోసం కృషి చేయడం. **చిరునామా: డాక్టర్ షేక్ ఖాశిం సాహెబ్, ఇంటి నం.7/4129/2, శ్రీనివాస నగర్, ప్రొద్దుటూరు-516360, కడప జిల్లా. సంచారవాణి: 90323 75939.**



**ఖాశిం సాహెబ్ డి. :** కడప జిల్లా పెద్దపసువుల గ్రామంలో 1967 జూన్ ఒకటిన జననం. తల్లితండ్రులు: దస్తగిరమ్మ, డి ఖాశిం సాహెబ్. కలంపేరు: డికె చదువుల బాబు. చదువు: బి.ఏ., బి.ఇడి., డి.ఇడి. ఉద్యోగం: ఉపాధ్యాయులు. 'బల్లి తన పాటెరుగదు' కథతో 1985లో సాహిత్యరంగ ప్రవేశం. అప్పటినుండి కథలు, కవితలు వ్యాసాలు పలు పత్రికల్లో, సంకలనాల్లో ప్రచురితం. కథలలో 'ఆలోచించకే మనసా, నాన్నా నేను చదువుకుంటా, యద్భావం తద్భవతి, అమూల్యం, స్వార్థం' అను కథలు గుర్తింపును తెచ్చిపెట్టాయి. బాలల్లో సద్భావనలు, సత్ప్రవర్తన కలుగచేయాలన్న ప్రధాన లక్ష్యంతో బాలలకు ఉపయుక్తమగు కథలు రాస్తున్నారు. 'కనువిప్పు' కథ మహారాష్ట్రలో ఉన్నతపాఠశాల విద్యార్థులకు పాఠ్యగ్రంథంలో భాగమైంది. రచనలు: మనసున్న మనిషి (2002), బాలల కథలు (2003), బంగారు రెక్కలు (2004), అప్పు-నిప్పు (2004), చిన్నారి మనస్సు (2005), విజయ రహస్యం (2005) అను కథల సంపుటాలతోపాటుగా కడప జిల్లాకు చెందిన 465 మంది కవులు-రచయితల వివరాలతో కూడిన 'కడప జిల్లా సాహితీ మూర్తులు' గ్రంథాన్ని 2007లో వెలువరించారు. రాష్ట్రంలోని ప్రముఖ సాహితీ సంస్థలచే, ప్రముఖులచే పలు సన్మానాలు-సత్కారాలు అందుకున్నారు. లక్ష్యం: బాలబాలికలను ఉత్తమ పౌరులుగా, మనసున్న మంచి మనుషులుగా మలచాలన్నది. **చిరునామా: డి.ఖాశిం సాహెబ్, ఉపాధ్యాయులు, ఇంటి నం. 3/528, వై.ఎం.ఆర్ కాలనీ, ప్రొద్దుటూరు-516361, కడపజిల్లా. సంచారవాణి: 94407 03716.**



**ఖాశిం సాహెబ్ షేక్ :** కృష్ణా జిల్లా నందిగామలో 1928 జూలై 15న జననం. చదువు: సివిల్ ఇంజనీరింగ్. ఉద్యోగం: రాష్ట్రప్రభుత్వంలోని ఇరిగేషన్ శాఖలో ఇంజనీర్‌గా 1983లో రిటైర్డ్ అయ్యారు. 1966 నుండి కవితలు రాయడం ఆరంభించి 2010 వరకు 18 వందలకు పైగా కవితలు రాశారు. ఆ కవితలు వివిధ పత్రికల్లో, కవితా సంకలనాలలో చోటుచేసుకున్నాయి. ఈ కవితల్లో ఎంపిక చేసిన కవితలు 1994 నుండి 2010 వరకు 16 కవితా సంపుటాలుగా వెలువడ్డాయి. ఆ కవితలలో కొన్నిటిని స్వయంగా స్వరకల్పన చేయటం మాత్రమే కాకుండా రెండు వందల కవితలకు తగిన బాణీలు సమకూర్చి గానం చేశారు. ప్రాంతీయ, జాతీయ, అంతర్జాతీయ సాహిత్య వేదికల మీద పలు సన్మానాలు-సత్కారాలు పొందారు. రచనలు: 1.గాలి గోపురం, 2.జాతి వైభవం, 3. కోడి కూసింది, 4. బంగారు పిచ్చుకలు, 5. చంద్రికలు, 6. నా పవిత్ర భూమి, 7. ఓ మనిషి, 8. స్త్రీ అంటేనే, 9. అభిషేకీయం, 10. అక్షరశిల్పాలు, 11. జీవన గీతం, 12. హ్యాపీ మెమోరీస్ ఆఫ్ షేక్ ఖాశిం, 13. కాంతి కిరణాలు, 14. సఖీ, 15. వేదనలో వేదం, 16. చందన తాంబూలాలు. ఈనాటికి కవితా సంపుటాల ప్రచురణలో తీరిక లేకున్నారు. లక్ష్యం: మస్తిష్కానికి పదనుపెట్టి, మనస్సుకు అహ్లాదానిచ్చే సాహిత్యం సృజించాలన్నది. **చిరునామా: షేక్ ఖాశిం సాహెబ్, ఇంటి నం.12-110, నేతాజీనగర్, నందిగామ, కృష్ణా జిల్లా. దూరవాణి: 08678-273737, సంచారవాణి: 9848820627.**



**ఖాశిం షేక్ :** కృష్ణా జిల్లా నందిగామ తాలూకా పెనుగంచిప్రోలులో జననం. తల్లితండ్రులు హుస్సేన్ బీ, హుస్సేన్ సాహెబ్. చదువు: భాషాప్రవీణ. ఉద్యోగం: ఉపాధ్యాయులు. అప్పటి చిరునామా: శనగపాడు, నందిగామ తాలూకా, కృష్ణా జిల్లా. రచనలు:జగత్ప్రవక్త మొహమ్మదు జీవితచరిత్ర (1990), శ్రీ సీతారామ కళ్యాణము (బుర్రకథ,1990), సాధుశీల శతకము.

**ఖాశిం యూసుఫ్ :** 1982లో చిత్తూరు నివాసి. విద్య: ఎం.ఏ (ఉర్దూ). వృత్తి : అధ్యాపకులు. రచనలు : 'చీకటి తరగలు', 'తమోనలం' రచయితలలో ఒకరు.

**ఖతిజా హయాత్ బేగం :** కడప జిల్లా జమ్మలమడుగు నివాసి. రచనలు: పలు భక్తి గీతాలు, కథలు, గేయాలు.

**ఖుర్షీద్ సయ్యద్ :** వరంగల్ జిల్లా మహబూబాబాద్‌లో 1964 మే 12న జననం. తల్లి తండ్రులు: జహరాబీ, సయ్యద్ అలీ. చదువు: బి.ఏ., బి.ఇడి., హెచ్‌డిసిఎం. ఉద్యోగం: సహకారశాఖలో సహాయక రిజిస్ట్రార్. 1988 ఆగస్టులో 'గీటురాయి' లో 'తెలుగు పత్రికల తీరుతెన్నులు' వ్యాసం ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలు, సంకలనాలలో కవితలు,









కథలు, కథానికలు, కవితలు, సమీక్షలు, సామాజిక-సమీక్షా వ్యాసాలు ప్రచురితం. గీటురాయి పత్రికలో ధారావాహిక రచన, త్వరలో గ్రంథ రూపం ధరించనున్న 'ఆంధ్రప్రదేశ్ అధికార రాజకీయాలు- ముస్లింలు' గుర్తింపు తెచ్చి పెట్టింది. 'తెలంగాణ కవితలు' (కవితా సంకలనం,2010) వెలువరించారు. లక్ష్యం: ప్రగతి దిశగా జాతి జనులు సాగేందుకు అవసరమైన చైతన్యాన్ని కల్గించడం, మత సామరస్యాన్ని మరితంగా పటిష్ట పర్చే సాహిత్యాన్ని రూపొందించడం. **చిరునామా : సయ్యద్ ఖుర్షీద్, ఇంటి నం. 5-5-72, కంకర బోడ్, మహబూబాబాద్-506101, వరంగల్ జిల్లా. సంచారవాణి: 99895 11786**. Email: ksyed64@yahoo.com

**లాల్ షేక్ :** పశ్చిమగోదావరి జిల్లా మల్లిపూడిలో 1944 జూలై ఆరున జననం. తల్లితండ్రులు: షేక్ జైనాబీ, షేక్ మీరా. చదువు: బి.కామ్., ఐసిడబ్లూఏ. వృత్తి: కాస్ట్ అకౌంటెంట్. 1974లో మద్రాసు కేంద్రంగా 'స్నేహబాల' (1974-1979) బాలల మాసపత్రిక ఆరంభించారు. తెలుగులో బాలల కోసం పత్రిక నడపాలన్న ఉద్దేశ్యంతో ఆరంభమైన 'స్నేహబాల'లో పిల్లలకు బాగా అర్థమయ్యే విధంగా నాలుగు సంవత్సరాలు 'మహాభారతం' కథనాన్ని సులభతరంగా రాసి సీరియల్‌గా ప్రచురించారు. లక్ష్యం: పసిబిడ్డల మానసిక వికాసం కోసం కృషి. **చిరునామా: షేక్ లాల్, కాస్ట్ అకౌంటెంట్, న్యూనం-33, 2వ అంతస్థు, తిరునగర్, రెండవ వీధి, వడపళని, చెన్నయ్-600026. సంచారవాణి: 90422 46570.**



**లతీఫ్ సాహెబ్ షేక్ :** ప్రకాశం జిల్లా దర్శి మండలం పొతకమూరు గ్రామంలో 1958 డిసెంబర్ నాల్గున జననం. తల్లితండ్రులు: ఖాశింబీ, షేక్ బాజీ సాహెబ్. కలం పేరు: లతీఫ్ కుట్టీ. చదువు: ఎం.ఏ (ఇంగ్లీష్). వ్యాపకం: విద్యాబోధన. 1974లో కళాశాల పత్రికలో 'మూఢ నమ్మకాల ఖండనలో వేమన పాత్ర' వ్యాసం రావడంతో రచనా వ్యాసంగం ఆరంభమై వివిధ పత్రికలలో కవితలు, వ్యాసాలు ప్రచురితం అయ్యాయి. ప్రస్తుతం నెల్లూరు నుండి వెలువడుతున్న 'విజ్ఞాన జగతి' మాసపత్రికలో 'కాకులు చెప్పిన కథలు' అను ధారావాహిక రచన ప్రచురితమవుతుంది. అవార్డు: గురుమిత్ర (మా తెలుగుతల్లి ఫౌండేషన్స్, హైదరాబాద్, 2003) లక్ష్యం: సమాజాన్ని



మరింతగా మానవీకరించేందుకు తోడ్పాటు. **చిరునామా: షేక్ లతీఫ్ సాహెబ్, పావని హోమ్స్, 402, బి బ్లాక్, టెక్కేమిట్ట, మాగుంట అండర్ బ్రిడ్జి వద్ద, నెల్లూరు-522 004, నెల్లూరు జిల్లా. సంచారవాణి: 92964 33371.**

**మహబూబ్ సాహెబ్ షేక్ :** గుంటూరు జిల్లా వినుకొండలో 1933 జూలై ఒకటిన జన్మించారు. తల్లితండ్రులు: షేక్ లాల్ అహమ్మద్, సుభాన్ బీ. చదువు: పియుసి. 1955లో రాష్ట్ర సర్వేయర్‌గా ప్రభుత్వ ఉద్యోగంలో చేరి పలు ప్రాంతాలలో పని చేశారు. మంచి చదువరి. తెలుగు భాష, ప్రజాకవి వేమన సాహిత్యం పట్ల వల్లమాలిన అభిమానం. వేమన పద్యాలను అలవోకగా విన్పిస్తూ, ఆ పద్యాలలో ఇమిడి ఉన్న తాత్విక భావాలను వివరిస్తూ ప్రజల అభిమానాన్ని చూరగొన్నారు. ఆయన కుమారుడు షేక్ కరీముల్లా సహకారంతో 'మేధావుల మదిలో ఇస్లాం' (సంకలనం) పుస్తకాన్ని 2003లో ప్రచురించారు. 1991లో ఉద్యోగ విరమణ చేసిన షేక్ మహబూబ్ సాహెబ్ 2009 జూలై 27న వినుకొండలో కన్నుమూశారు.



**మహబూబ్ జాన్ షేక్ :** ప్రకాశం జిల్లా తూర్పు గంగవరంలో 1949 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: ఫాతిమాబీ, షేక్ హసన్ సాహెబ్. చదువు: ఎం.ఏ (హిందీ)., ఎం.ఏ (చరిత్ర)., బి.ఇడి., రాష్ట్రభాషా ప్రవీణ. ఉద్యోగం: ఉపాధ్యాయులు. విద్యార్థి దశ నుండి రచనా వ్యాసంగం ఆరంభం. తెలుగు, హిందీ భాషల్లో రాసిన కవితలు, కథలు, సాహిత్య వ్యాసాలు, గేయాలు ఆయా భాషా పత్రికల్లో ప్రచురితం. రచనలు: దేశం కోసం (మహాపురుషుల కథలు, 2001), భారతీయ నోబుల్ గ్రహీతలు (2002), జన్మభూమి (కవితల సంపుటి 2003), రాతిపూలు (కథల సంపుటి, 203), మహానది (కవితల సంపుటి, 2004), జైత్రయాత్ర (రాజశేఖర రెడ్డి చరిత్ర,2005), అభిషిక్తుడు అపొస్తలు (క్రీస్తు చరిత్ర, 2005), క్రీస్తు జననం (నాటిక, 2005), సాహిత్య వ్యాస మందాకిని (వ్యాసాలు,2006), బహుదూరపు బాటసారులు (కవితా సంపుటి,2007), మౌలానా అబుల్ కలాం ఆజాద్ (చరిత్ర,2007), అమ్మ చెప్పిన కమ్మని కథలు (బాల సాహిత్య కథల సంపుటి, 2009), నా హజ్ యాత్ర (2010), ప్రాత:స్మరణీయులు (2010), ఒంగోలు కోట వీధి కథలు (2010), మా తెలుగు తల్లికి మల్లెపూదండ (సంపాదకులు, 2009). అవార్డులు -పురస్కారాలు: ఎక్స్‌రే అవార్డు (1998), ఎయిర్ ఇండియా బోల్డ్ అవార్డు (2001),









మైత్రేయ కళాసమితి అవార్డు (2003), మహాకవి ఎర్రన సాహితీ పురస్కారం (ఒంగోలు, 2009). బిరుదులు: కవిమిత్ర, కవితా భారతి. లక్ష్యం: మనస్సును పట్టే మంచి సాహిత్య సృష్టి. **చిరునామా:షేక్ మహబూబ్‌జాన్, ఇంటినం.19-3-13, కోట వీధి, ఒంగోలు-523001, ప్రకాశం జిల్లా. సంచారవాణి: 99599 50191, 08592-238580.**

**మహబూబ్ మియా :** కడప జిల్లా ప్రొద్దుటూరు నివాసి. పలు కవితలు, గేయాలు రాశారు. 'నీతి సుధానిధి' గ్రంథాన్ని కసిరెడ్డి సుబ్బారెడ్డి, భూతపురి నారాయణ స్వామిలతో కలసి రాశారు. ఈ ముగ్గురు కవిత్రయంగా సుప్రసిద్ధులు.

**మహమూద్ పాషా :** 1982 నాటి నివాసం: 1-1-51, మోచిగల్లి, సిద్దిపేట. చదువు: బి.ఎ., 1982లో హైదరాబాద్‌లో జరిగిన 'ఆంధ్రప్రదేశ్ ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనం' సందర్భంగా తెచ్చిన 'తెలుగు దివ్వెలు'లో 'వాస్తవిక చిత్రాలు' కవిత రాశారు.

**మహబూబ్ సాహెబ్ షేక్ :** కర్నూలు జిల్లా పాములపాడు నివాసి. కలం పేరు: బాపు, మధురకవి, వెలుగోడు. రచనలు: శ్రీశైల క్షేత్ర మహాత్యము, నల్లకలువ, శ్రీ లక్ష్మీనృసింహ స్వామి మహాత్యము, శ్రీ వెంకటేశ్వర వైభవము. పలు కవితలు, వ్యాసాలు.

**మహబూబ్ షేక్ :** ఖమ్మం జిల్లా ఖమ్మం పట్టణంలో 1964 ఆగస్టు ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ జైనబ్బీ, షేక్ ఖాజా. చదువు: ఐదవ తరగతి. ఉద్యోగం: రెవిన్యూ శాఖ. ఉర్దూ, తెలుగు భాషల్లో ప్రవేశం. 2000లో 'పాపానికి పరిష్కృతి' వ్యాసం 'వార్త' దినపత్రికలో ప్రచురితం అయ్యింది. అప్పటి నుండి వివిధ తెలుగు పత్రికలలో పలు ధార్మిక వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ధార్మిక ప్రసంగాలు చేస్తారు. రచనలు: నమాజ్ తరీఖా (2005). లక్ష్యం: ఇస్లాం సందేశ ప్రచారం. **చిరునామా : షేక్ మహబూబ్, ఇంటి నం. 8-33, దమ్మపేట-507306, ఖమ్మంజిల్లా, సంచారవాణి: 99491 53576, 93905 58469, 80199 60296.** Email: mahaboobnf@yahoo.in.co



**మహబూబ్ యస్. యం :** కడప జిల్లా జంగాలపల్లి. పుట్టిన తేది: 01-07-1924. తల్లితండ్రులు: హుస్సేన్ బీ, మహబూబ్ సాహెబ్. చదువు: ఎం.ఏ. సికిందరాబాద్‌లోని మహబూబియా స్కూలులో తెలుగుపండితులుగా ఉద్యోగం. రచనలు: సమత, గేయకవితలు.

**మహబూబ్ టంగుటూరి :** కడప జిల్లా రాయచోటి తాలూకా మూసాపేటలో 1953 జూన్ ఒకటిన జననం. తల్లితండ్రులు: టి.కమాల్‌బీ, టి.హన్నూ సాహెబ్. కలంపేరు: టంగుటూరు. చదువు: ఎం.ఏ., ఎల్ఎల్.బి., విశారద (హిందీ). ఉద్యోగం: రాష్ట్ర వాణిజ్య



పన్నుల శాఖలో సహాయ కమీషనర్ (చిత్తూరు). 1988లో 'ఉద్యోగ క్రాంతి' మాసపత్రికలో 'ప్రపంచీకరణ' వ్యాసం ప్రచురితం కావడంతో రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటినుండి వివిధ అంశాల మీద వివిధ పత్రికల్లో కవితలు, వ్యాసాలు, సాహిత్య వ్యాసాలు ప్రచురితం. 1999లో రాసిన 'విదేశీ మోజులో స్వదేశీ విలవిల' వ్యాసం గుర్తింపు తెచ్చిపెట్టింది. మంచి వక్త. అవార్డులు: మదర్ థెరిస్సా అవార్డు (హైదరాబాద్, 2009), లక్ష్యం: సామాజిక ప్రయోజనం చేకూర్చగల రచనలు చేయడం. **చిరునామా: టంగుటూరు మహబూబ్, ఫ్లాట్ నం. 301, రోహిత అపార్ట్‌మెంట్, రైల్వేగేటు రోడ్, వేదాయపాలెం, నెల్లూరు-4, సంచారవాణి: 99499 92516.** Email: mahaboobt@rocketmail.com.

**మహమూద్ పీర్ల షేక్ :** కడప జిల్లా ప్రొద్దుటూరులో 1971లో జననం. తల్లితండ్రులు: హస్మత్‌బి, ఎస్.పి అహమ్మద్ హుసేన్. చదువు: బి.ఏ., బి.ఇడి. వృత్తి: వ్యాపారం. కలంపేరు: మహమూద్. 1994 నుండి రాస్తున్నా, 1998లో ఆహ్వానం పత్రికలో 'అగాధంలోకి' కవిత ప్రచురితం అయినప్పటి నుండి వివిధ పత్రికలలో, సంకలనాలలో పలు కవితలు, కథానికలు చోటు చేసుకున్నాయి. తొట్టతొలి కథ 'హజరా' విజయవిహారంలో ప్రచురితమైనప్పటి నుండి రాసిన కథలలో 'మిష్కిన్' (ఆంధ్రజ్యోతి), 'చార్‌బేటియా' (అరుణ తార) గుర్తింపు తెచ్చి పెట్టాయి. లక్ష్యం: మనం చూస్తున్న ప్రజల జీవితాల్ని ఉన్నది ఉన్నట్టుగా ఆవిష్కరించడం. **చిరునామా: షేక్ పీర్ల మహమూద్, ఇంటి నం.21/573, ఖాదర్ హుసేన్ మసీదు వీధి, ప్రొద్దుటూరు-516360, కడప జిల్లా. సంచారవాణి: 934722 5279, 08564-255561.**



**మహమూద్ షేక్ :** గుంటూరు జిల్లా నరసరావుపేటలో 1937లో జననం. తల్లితండ్రులు: షేక్ జహెరాబీ, షేక్ ఖాజా సాహెబ్. వృత్తి: జర్నలిజం. 1960లో 'బాలజ్యోతి' బాలల లిఖిత పత్రికను ఆరంభించినప్పటి నుండి రచనా వ్యాసంగం ఆరంభం. ఆ తరువాత 'ఆదర్శం', 'ప్రగతి' లిఖిత పత్రికలను ప్రారంభించి పలు రచనలు చేశారు, పలువురు కవులు-రచయితలను ప్రోత్సహించారు. రచనలు: చైతన్యం (సాంఘిక నాటిక, 1975), రాణి సంయుక్త (చారిత్రక నాటిక, 1979). 1975 నుంచి 'సత్యజ్యోతి' మాసపత్రికను నిర్విఘ్నంగా









నిర్వహిస్తున్నారు. రాష్ట్రంలోని చిన్నపత్రికలను ప్రోత్సహిస్తూ, కోరినవారికి వివిధాంశాల మీద వ్యాసాలు అందించటం అభిరుచి. లక్ష్యం: ప్రజా చైతన్యం. **చిరునామా: షేక్ మహమూద్, ఇంటి నం.16-4/2/2, నిమ్మతోట, నరసరావుపేట-522601, గుంటూరు జిల్లా. సంచారవాణి: 93999 07041.**

**మహజబీన్ :** నెల్లూరు జిల్లా నెల్లూరులో 1961 మార్చి 30న జననం. తల్లితండ్రులు: వాహిద్ పర్వీన్, మహమ్మద్ ఇస్మాయిల్. చదువు: ఎం.ఏ., ఎల్ఎల్.బి. వృత్తి: న్యాయవాది, సామాజిక కార్యకర్త. ప్రవృత్తి: రచన. విద్యార్థిదశ నుండి రచనా వ్యాసంగం ఆరంభం. వివిధ పత్రికలలో కవితలు, కథానికలు, సామాజిక-సాహిత్య వ్యాసాలు, సమీక్షలు ప్రచురితం.



'సాక్షి' దినపత్రికలో 'ఇందురేఖ' కాలమ్ రాశారు. జాతీయ, అంతర్జాతీయ సాహిత్య సదస్సులలో పాల్గొన్నారు. కవితలలో 'స్ట్రీట్ చిల్డ్రన్' కవిత మన రాష్ట్రంలోని పదవ తరగతి తెలుగు వాచకంలో పాఠ్యాంశంగా స్థానం సంపాదించుకుంది. 'ఖిల్వత్' కవిత ఎం.ఏ (లిటరేచర్) పాఠ్యాంశంలో చేరింది. రచనలు: 1.ఆకురాలే కాలం (కవితా సంపుటి, 1997), 2.విరామం తర్వాత (కవితా సంపుటి, 2010). అవార్డులు-పురస్కారాలు: జ్యోత్స్న కళాపీఠం అవార్డు (2006), యువజన అవార్డు (న్యూఢిల్లీ,1997), రమణ-సుమనశ్రీ అవార్డు (1998), రాజీవ్ గాంధీ జాతీయ అవార్డు (2007), పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు (2005) అధికార భాషా సంఘం అవార్డు (2009). ఫెలోషిప్స్: డాడ్ జర్మన్ ఫెలోషిప్ (2000), కల్చరల్ యూరోపియన్ యూనివర్సిటీ ఫెలోషిప్ (2001). **చిరునామా: మహజబీన్, ఇంటి నం. 2-1-562/2, నల్లకుంట, హైదరాబాద్-500004. దూరవాణి: 040-277660020, సంచారవాణి: 98665 87919.**

**మక్బూద్ అహమ్మద్ సయ్యద్ :** కరీంనగర్ జిల్లా జరాజంగం మండలం చిలకలపల్లిలో 1963 మే ఐదున జననం. తల్లితండ్రులు: సాబిరా బేగం, సయ్యద్ ఈసా. చదువు: ఇంటర్. ఉద్యోగి. ఉర్దూ, తెలుగు భాషల్లో ప్రవేశం. తెలుగు పత్రికల్లో, వివిధ కవితా సంకలనాలలో పలు కవితలు ప్రచురితం. తెలుగులోని మంచి సాహిత్యాన్ని ఉర్దూ పాఠకులకు పరిచయం చేయడం, ఉర్దూలోని ఉత్తమ సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు తెలియపర్చడం కోసం ఉర్దూ నుండి తెలుగులోకి ఆయా భాషల సాహిత్యాన్ని అనువదించి ప్రచురించడం పట్ల ప్రత్యేక ఆసక్తి. లక్ష్యం: తెలుగు-ఉర్దూ భాషా



కవుల సాహిత్యాన్ని ఆయా భాషల పాఠకులకు పరిచయం చేయడం. **చిరునామా: సయ్యద్ మక్సూద్, క్వార్టర్ నం.8/6, మహేంద్రనగర్, జహీరాబాద్, మెదక్ జిల్లా. సంచారవాణి: 94408 36492**

**మలిక్ సుల్తాన్ మొహిద్దీన్ సయ్యద్ :** ప్రకాశం జిల్లా కంభంలో 1940 ఏప్రిల్ 10న జననం. తల్లితండ్రులు: సయ్యదా సలీమున్నీసా, హకీం సయ్యద్ అబ్దుల్ గఫూర్ నిజామి. కలంపేర్లు: నిజామి కుమార. ఎస్.ఎం.మలిక్. చదువు: ఎస్ఎస్ఎల్‌సి. తెలుగు, ఉర్దూ, అరబిక్, పారశీకం, తమిళ భాషలలో ప్రవేశం. తొమ్మిదేళ్ళ వయస్సులో తండ్రి నుండి పారశీకం నేర్చుకున్నారు. ఆ తరువాత మిగతా భాషల మీద పట్టు సంపాదించి ఆయా భాషల్లోని సాహిత్య-ధార్మిక గ్రంథాల అధ్యయనం. రాష్ట్ర-కేంద్ర ప్రభుత్వ శాఖల్లో 1970 వరకు ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించి ధార్మికసేవలో గడపాలన్న నిర్ణయం మేరకు రైల్వేలో చేస్తున్న ఉద్యోగానికి 1970లో రాజీనామా చేశారు. ఉన్నత పాఠశాల విద్యార్థిగా గురువుల ప్రోత్సాహం మేరకు చిన్నప్పటి నుండి ఛందోబద్ధ కవిత్వం రాస్తూ



వచ్చారు. ఆ క్రమంలో 1964లో నెల్లూరు నుండి వెలువడుతున్న 'విజ్ఞాన చంద్రిక'లో రాసిన తొలి వ్యాసంతో రచనా వ్యాసంగం ఆరంభం. 1968లో ఉర్దూలోంచి తెలుగులోకి 'శ్రేయోమార్గం' అను అనువాద గ్రంధాన్ని తొలిసారిగా వెలువరించారు. 1974లో పూర్తి కాలపు ధార్మిక సేవకుడిగా హైదరాబాద్ నగరం చేరుకున్నారు. ఇస్లామియా సాహిత్యాన్ని తెలుగులో ప్రచురించాలన్న ఉద్దేశ్యంతో 1977లో ఏర్పడిన 'తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్' వ్యవస్థాపక సంచాలకులుగా కృషి చేశారు. ఆ తరువాత 1979లో 'గీటురాయి' మాసపత్రిక వ్యవస్థాపక సంపాదకులుగా బాధ్యతలు స్వీకరించాక 'నిశ్శబ్ద శబ్దాలు' శీర్షికతో కవిత్వం రాయడం ఆరంభించారు. అప్పటి నుండి వివిధ పత్రికలలో కవితలు, సామాజిక-సాహిత్య వ్యాసాలు ప్రధానంగా ధార్మిక వ్యాసాలు అసంఖ్యాకంగా ప్రచురితం అయ్యాయి. గత మూడు దశాబ్దాలుగా 'గీటురాయి' పత్రికకు సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. ఈ మధ్య కాలం వరకు వివిధ దినపత్రికలలో వారం వారం ఆయన అందించిన ధార్మిక వ్యాసాలు వెలువడ్డాయి. ఉర్దూ, అరబిక్ భాషలో ప్రచురించబడిన 50కు పైగా ధార్మిక గ్రంథాలను తెలుగులోకి అనువదించారు.'ఖుర్‌ఆన్ అవగాహన' ఖుర్‌అన్ తెలుగు అనువాదాన్ని మొత్తం నాలుగు వేల పుటలతో 10 భాగాలుగా రూపొందించగా ప్రస్తుతానికి మూడు భాగాలు వెలువడ్డాయి. స్వతంత్ర రచనలు: 1.ప్రభువు పిలుస్తున్నాడు, 2.వెన్నెల తెరలు, 3.తూరుపు తావి, 4.విపులాచల పృధ్వీ, 5.సాహిత్యం-వాదవివాదాలు, 6.సందేహాలు-సమాధానాలు, 7.ఇస్లామీయ పరిభాషలో జిహాద్ (ప్రథమ భాగం). లక్ష్యం:







దైవప్రసన్నత. ఇస్లాంను తెలుగు తెలిసిన ప్రజలకు ఎరుకపర్చడం. **చిరునామా: ఎస్.ఎం. మలిక్, 105 బి, సంతోష్ నగర్ కాలనీ, గ్రంథాలయం గ్రౌండ్ వద్ద, సంతోష్‌నగర్, హైదరాబాద్-500059. సంచారవాణి: 98482 29218, దూరవాణి:040-2453305.** Email: smmallick@hotmail.com.

**మస్తాన్ షేక్ డాక్టర్ :** గుంటూరు జిల్లా ప్రత్తిపాడులో 1952 జూలై రెండున జననం. తల్లితండ్రులు: షేక్ మొహిద్దీన్ బి, నన్నే సాహెబ్. చదువు: ఎం.ఏ(తెలుగు)., ఎం.ఏ (లింగ్విస్టిక్), పిహెచ్.డి. ఉద్యోగం: అలీఘర్ విశ్వవిద్యాలయంలో అధ్యాపకులు. చిన్ననాటి నుండే రచనా వ్యాసంగం ఆరంభం. వివిధ పత్రికలలో పరిశోధనాత్మక-సాహిత్య వ్యాసాలు, కవితలు, సమీక్షలు ప్రచురితం. తెలుగు సాహిత్యానికి ముస్లింల సేవకు సంబంధించి



పరిశోధన జరిపి ముస్లింల సాహిత్య సేవా చరిత్రను వెల్లడించిన మొట్టమొదటి తెలుగు సాహిత్య చరిత్రకారునిగా ఖ్యాతిగాంచారు. తెలుగు సాహిత్యాన్ని, ఇతర భాషల్లోని సాహిత్య ప్రక్రియలను తులనాత్మకంగా అధ్యయనం చేసి, పరిశోధనలు జరిపి జాతీయ, అంతర్జాతీయ సదస్సులలో పరిశోధనా పత్రాలను సమర్పించారు. ఈ సందర్భంగా పలు దేశాలను పర్యటించారు. తెలుగు సాహిత్య విలువలను వివరిస్తూ ఆంగ్లంలో గ్రంథాలను వెలువరించారు. జాతీయ-అంతర్జాతీయ స్థాయిలో పలు సన్మానాలను అందుకున్నారు. రచనలు: తెలుగు సాహిత్యం-ముస్లింల సేవ (1991), తెలుగు సాహిత్య వ్యాసాలు (1999). అవార్డులు-పురస్కారాలు: విజయశ్రీ అవార్డు (న్యూఢిల్లీ, 2005), బెస్ట్ సిటిజన్ అఫ్ ఇండియా (న్యూఢిల్లీ, 2006), శ్రీ హసన్ షా స్మారక అవార్డు (భీమవరం, 2007). లక్ష్యం: తెలుగు సాహిత్య విలువలను ప్రపంచానికి చాటి చెప్పాలని. **చిరునామా: ప్రొఫెసర్ షేక్ మస్తాన్, ప్రొఫెసర్ ఇన్ తెలుగు, డిపార్ట్‌మెంట్ ఆఫ్ మోడరన్ ఇండియన్ ల్యాంగ్వేజస్, అలీఘర్ ముస్లిం యూనివర్శిటీ, అలీఘర్-202002, ఉత్తరప్రదేశ్. దూరవాణి: 0571- 3291097, సంచారవాణి: 098377 29542**. Email: prof.mastan@gmail.com



**మస్తాన్ వలి షేక్ :** కృష్ణా జిల్లా రామన్నపేట గ్రామంలో 1980 ఫిబ్రవరి నాల్గున జననం. తల్లితండ్రులు: షేక్ సఫియాబీ, జాన్ సాహెబ్. కలం పేరు: వలి. చదువు: ఎం.ఎస్సీ (జువాలజీ). ఉద్యోగం: అధ్యాపకులు. 1999 లో కళాశాల పత్రికలో 'వ్యర్థమేనోయ్ వలి' కవిత ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ తెలుగు పత్రికలలో, కవితలు ప్రచురితం అవుతున్నాయి. 2005లో రాసిన 'తెలుగు గమక చమకాలు'

గుర్తింపు తెచ్చి పెట్టింది. లక్ష్యం: సామాజిక సేవకు ప్రేరణ కల్గించేందుకు సాహిత్యం ద్వారా కృషి చేయాలన్నది. **చిరునామా: షేక్ మస్తాన్, ఇంటి నం. 2-121, జి. రామన్నపేట -521182, చందర్లపాడు మండలం, కృష్ణా జిల్లా. దూరవాణి: 08678-254473, సంచారవాణి: 99483 57673.**

**మస్తాన్ వలి షేక్ :** కడప జిల్లా ముద్దనూరు గ్రామంలో 1968 జూన్ 23న జననం. తల్లితండ్రులు: షేక్ గౌసున్నీసా బేగం, షేక్ మహబూబ్ సాహెబ్. చదువు: బి.ఏ. ఉద్యోగం: ప్రజాశక్తి దినపత్రిక. 2004లో రచనా రంగ ప్రవేశ చేసినప్పటి నుండి పలు వ్యాసాలు, కవితలు వివిధ పత్రికలలో ప్రచురితం అయ్యాయి. రచనలు: 1.మన కడప (కడప జిల్లా చరిత్ర, 2009), 2.సీమ అందాలు (ఆధ్యాత్మికం-పర్యాటకం, 2010). లక్ష్యం: నలుగుర్ని చైతన్యపర్చే రచనల ద్వారా సమాజ సేవలు అందించడం. **చిరునామా: షేక్ మస్తాన్ వలి, ఇంటి నం.3/1367, కోఆపరేటివ్ కాలనీ, కడప-516001, కడప జిల్లా. సంచారవాణి: 94900 99284**, Email: shaikmasthanvali786@ gmail.com



**మహమ్మద్ ఇలియాస్ :** గుంటూరు జిల్లా సత్తెనపల్లిలో 1970 ఆగస్టు మూడున జననం. తల్లితండ్రులు: మునీరున్నీసా, షేక్ హుస్సేన్. చదువు: ఎంఎస్సీ., ఎం.ఇడి., డిపిఇ. ఉద్యోగం: అధ్యాపకులు (కేంద్రీయ విద్యాలయం, హైదరాబాద్). విశాలాంధ్ర దినపత్రికలో 'యూనిఫారం' కవిత 2009లో ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికల్లో, కవితా సంకలనాలల్లో కవితలు, వ్యాసాలు చోటు చేసుకున్నాయి. లక్ష్యం: ముస్లిం సమాజాన్ని చుట్టుముట్టి వేధిస్తున్న అపోహల్ని బద్దలు కొట్టి, వాస్తవాలను వెల్లడి చేయాలన్నది. **చిరునామా: మహమ్మద్ ఇలియాస్, ఇంటి నం. 5-9-27/2, నాగార్జుననగర్, సత్తెనపల్లి, గుంటూరు జిల్లా. సంచారవాణి: 9492689808**. Email: arshiyallas@ gmail.com



**మహబూబ్ అలీ షేక్ :** ప్రకాశం జిల్లా గజ్జెలకొండ గ్రామంలో 1957 జూన్ 16న జననం. తల్లితండ్రులు: షేక్ ఖాశింబీ, కరీం సాహెబ్. చదువు: ఏడవ తరగతి. ఉద్యోగం: దక్షిణ మధ్యరైల్వేలో గేట్‌మన్ (నరసరావుపేట) 'ఓ కోహినూర్ వజ్రమా!' కవిత 2001లో 'నడుస్తున్న చరిత్ర' మాసపత్రికలో (విజయవాడ) ప్రచురితమైనప్పటి నుండి రచనా వ్యాసంగం ఆరంభం. పలు కవితలు వివిధ పత్రికలలో, కవితా సంకలనాలలో చోటు చేసుకున్నాయి.









'రమ్యభారతి'లో (త్రైమాస పత్రిక, విజయవాడ, 2000) ప్రచురితమైన 'డాన్స్ తారలు' కవిత గుర్తింపు తెచ్చి పెట్టింది. సమాజానికి ఉపయోగపడే విలువైన సూక్తులను సేకరించడంలో ఆసక్తి వలన వేలాది సూక్తులను ప్రోదిచేశారు. రచన: అక్షర తపస్సు (కవితాసంపుటి, 2006). రాష్ట్రంలోని పలు సేవా-సాహితీ-సాంస్కృతిక సంస్థలచే సన్మానాలు. లక్ష్యం: వక్రంగా సాగుతున్న సమాజాన్ని సక్రమ దారిలో నడిపేందుకు అవసరమైన దిద్దుబాటు విధానాలను రచనల ద్వారా సూచించడం. **చిరునామా: షేక్ మహబూబ్ అలీ, కేరాఫ్ షేక్ అబ్దుల్ సత్తార్ (పెయింటర్), ఇంటి నం.12-1-90, మహబూబ్‌నగర్, బిలాల్ మసీదు వద్ద, నరసరావుపేట -522601, గుంటూరు జిల్లా. సంచారవాణి: 9394195978 (పి.పి).**

**మహబూబ్ సయ్యద్ :** గుంటూరు జిల్లా సత్తెనపల్లి గ్రామంలో 1938 జనవరి 12న జననం. తల్లితండ్రులు: సయ్యద్ ఖాశింబి, సయ్యద్ అక్బర్. చదువు: ఎం.ఏ., బి.యల్. వ్యాపకం: అధ్యాపకులు (విశ్రాంత ప్రిన్సిపాల్: ఆంధ్ర ముస్లిం కళాశాల, గుంటూరు) ప్రస్తుతం న్యాయవాది. 1992 నుండి పలు పత్రికల్లో వ్యాసాలు చోటు చేసుకున్నాయి. మతసామరస్యాన్ని ఆకాంక్షిస్తూ రాసిన పలు ప్రసంగ వ్యాసాలు ఆకాశవాణిలో ప్రసారం. రచనలు: 1.'భిన్నత్వంలో ఏకత్వం' (1999), 2. సద్ధర్మాచరణ (2008), 3. ఆంధ్ర ముస్లిం కళాశాల చరిత్ర (2008). ఈ గ్రంథాలలో 'భిన్నత్వంలో ఏకత్వం' 'యూనిటీ ఇన్ డైవర్సిటీ' పేరుతో ఆంగ్లంలో అనువాదం అయ్యింది. అవార్డులు: బెస్ట్ సిటిజన్ ఆఫ్ ఇండియా (ఇండియన్ ఇంటర్ నేషనల్ ఫ్రెండ్షిప్ సొసైటీ, న్యూఢిల్లీ, 1999), చైతన్య భారతి పురస్కారం (హైదరాబాద్, 2007), గౌరవ డాక్టరేట్ (ఇంటర్‌న్నేషనల్ ప్రేయర్ గ్రూప్, గుంటూరు, 2007). లక్ష్యం: సర్వేశ్వరుడు ఒక్కడేనన్న ప్రచారం చేస్తూ మత సామరస్యాన్ని పటిష్టంగావించడం. **చిరునామా: సయ్యద్ మహబూబ్, న్యాయవాది, 6/13, బ్రాడీపేట, గుంటూరు, గుంటూరు జిల్లా. సంచారవాణి: 92993 01825.**



**మెహబూబ్ అలీ ఖాన్ షేక్ :** 1916లో విజయవాడలో జననం. విజయవాడ నుండి వెలువడిన స్వతంత్ర పత్రిక 'ది ఆజాద్' సంపాదకులు. ప్రధాన వృత్తి ప్రజావైద్యం. వక్త. ఆంధ్రప్రదేశ్, చరిత్రను భవిష్యత్తును వివరిస్తూ పలు గ్రంథాలను ప్రచురించారు.

**మహబూబ్ బాషా షేక్ :** నెల్లూరు జిల్లా కసుమూరులో 1941 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ గౌసున్నీసా బేగం, షేక్ హబీబ్ సాహెబ్. చదువు: ఎం.ఏ.,



బి.ఇడి. ఉద్యోగం: విశ్రాంత ఉపాధ్యాయులు. 1969 నుండి వ్యాసంగం ఆరంభించి కవి సమ్మేళనాలు, కవితా గోష్టులలో పాల్గొన్నారు. వివిధ పత్రికలలో, కవితా సంకలనాల్లో కవితలు చోటుచేసుకున్నాయి. పద్యరచన మీద పట్టు సంపాదించి 2008 లో 'అందని ఆమని' (పద్యకావ్యం) వెలువరించారు. లక్ష్యం: సాహిత్య ప్రియులైన పాఠకులకు సుమధుర కవిత్వం అందించడం. **చిరునామా: షేక్ మహబూబ్ బాషా, రవినగర్, బైపాస్ రోడ్డు, కోట-524411, నెల్లూరు జిల్లా. దూరవాణి: 08624-229920.**

**మహబూబ్ గులాం :** కడప జిల్లా పగిదేల గ్రామంలో 1928 ఫిబ్రవరి మూడున జననం. తల్లితండ్రులు: రసూల్ బీబి, గులాం హుస్సేన్ సాహెబ్. చదువు: బిఎస్సీ., ఎంఎస్సీ (ఇంజనీరింగ్), ఉద్యోగం: అధ్యాపకులు (రిటైర్డ్). ఉర్దూ, తెలుగు భాషల్లో మంచి ప్రవేశం కలిగి ఉర్దూ నుండి తెలుగులోకి ప్రముఖ ఉర్దూ కవుల రచనలను అనువదించారు. రచన: షిక్వ జవాబె షిక్వ అల్లామ ఇక్బాల్ (2003). లక్ష్యం: ఉత్తమ ఉర్దూ సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేయాలన్నది ప్రధాన లక్ష్యం. **చిరునామా: ప్రొఫెసర్ గులాం మహబూబ్, ఇంటినం. 17-1-179, ఎడ్లవారి వీధి, నెల్లూరు-524 001, నెల్లూరు జిల్లా. దూరవాణి: 0861-2300103, 99593 01405.**



**మహబూబ్ ఖాన్ పి. :** ప్రకాశం జిల్లా యర్రగొండపాలెంలో 1947లో జననం. తల్లితండ్రులు: షేక్ ఖాశింబీ, పి. ఖాశిం ఖాన్. చదువు: పదవ తరగతి. వ్యాపకం: ధార్మికసేవ. 1982లో గీటురాయి వారపత్రికలో 'మాట' ధార్మిక వ్యాసం ప్రచురితం. అప్పటి నుండి పలు వ్యాసాలు వివిధ పత్రికల్లో చోటు చేసుకున్నాయి. ప్రధానంగా గీటురాయి పత్రికలో పలు వ్యాసాలు ప్రచురితం అయ్యాయి. లక్ష్యం: ధార్మికసేవ-సామాజిక సేవ. **చిరునామా: పి మహబూబ్ ఖాన్, ఇంటి నం.1-51/3, శివాలయం వీధి, యర్రగొండపాలెం -523327, ప్రకాశం జిల్లా. సంచారవాణి: 95028 83508.**



**మిరాజాన్ షేక్ :** పశ్చిమ గోదావరి జిల్లా పెనుగొండ జన్మస్థలం. పుట్టిన తేది: 15-06-1922. తల్లితండ్రులు: సైదాబీ, పీర్ సాహెబ్. చదువు: ఎస్.ఎస్.ఎల్.సి, వృత్తి :వైద్యులు (ఆర్ఎంపి). బహు భాషా పండితులు. స్వాతంత్ర్య సమరయోధులు. కలం పేరు:







కవిరాజ్. బిరుదులు: కవిరాజ్, కవితిలక. రాష్ట్రస్థాయి 'నేషనల్ ఇంటిగ్రేషన్ ఫోరం' (పెనుకొండ) ఏర్పాటు చేసి మతసామరస్యం, జాతీయ సమైక్యత-సమగ్రతలు, మత సామరస్యం ప్రధాన లక్ష్యంగా రాష్ట్రరాజధాని నగరంలోనే కాకుండా రాష్ట్ర స్థాయిలో వివిధ ప్రాంతాలలో పలు సాహిత్య-సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తూ, ఆ దిశగా విశేష కృషి చేశారు. ఆయన సేవలకు గుర్తింపుగా 1981లో 'జాతీయ సమగ్రతావాది' గా ప్రజలు గౌరవించుకున్నారు. రచనలు: సర్వమత సార సంగ్రహం, తౌహిద్ -కా-రవుషన్. హిందూ-ముస్లిం-క్రైస్తవ ఆచారాలు, కర్మకాండలు. హిందూ మతస్థుల ప్రార్థనాధికారాలను చాలా వివరంగా ప్రస్తావిస్తూ సప్రమాణ, సాధికాధికారిక గ్రంథాలు ఆయన రచించారు.



**మిష్కన్ సాహెబ్ షేక్ :** అనంతపురం జిల్లా ధర్మవరం తాలూకా గుండంపల్లి జన్మస్థలం. పుట్టిన తేది: 06-07-1914. చదువు: 6వ తరగతి. అప్పటి నివాసం: అనంతపురం జిల్లా చియ్యేడు. రచనలు: నానార్థ నవనీతము.

**మహమ్మద్ అలీ మహమ్మద్ :** నెల్లూరు జిల్లా తిమ్మసముద్రంలో 1955 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: ఖాదర్ బీ, హుస్సేన్ సాహెబ్. చదువు: ఎం.ఏ., బి.ఇడి. ఉద్యోగం: ఉపాధ్యాయులు. కలంపేరు: మానస. కళాశాల పత్రికలో కవితలు రాయడంతో రచనా వ్యాసంగం ఆరంభించి వివిధ పత్రికలలో కవితలు ప్రచురితం. లక్ష్యం: బడుగు బలహీన వర్గాల ప్రజానీకంలో చైతన్యం కలుగచేయడం. **చిరునామా: ఎండి మహమ్మద్ అలీ, కలిగిరి-524224, నెల్లూరు జిల్లా. సంచారవాణి: 94414 77804.**



**ముహమ్మద్ ఆరీజ్ :** గుంటూరు జిల్లా పెనుమూలిలో 1963 నవంబర్ 24న జననం. తల్లితండ్రులు: అఫ్సరున్నీసా, ఉస్మాన్ షరీఫ్. చదువు: ఎం.ఏ. వ్యాపకం: సామాజిక కార్యకర్త. కలం పేరు: భాస్కర్. సామాజిక -రాజకీయ అంశాల మీద ప్రత్యేక అధ్యయనం. 1978లో కళాశాల పత్రికలో 'స్త్రీ పక్షపాతి మహమ్మద్ ప్రవక్త' వ్యాసం ప్రచురణ ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి తెలుగు, ఆంగ్ల భాషల్లో రాసిన పలు సామాజిక-రాజకీయ వ్యాసాలు వివిధ పత్రికల్లో, సావనీర్‌లలో ప్రచురితం. రచనలు:



మైనార్టీ సంక్షేమ పథకాలు (అనువాదం, 2006), సచార్ నివేదికలో ఆంధ్రప్రదేశ్ ముస్లింలు (2007), ముస్లింల సమస్యలు (రంగనాథ్ మిశ్రా కమీషన్ సిఫారస్సులు, 2010), దళిత ముస్లింల ఐక్యతకు మిశ్రా కమీషన్ మార్గదర్శకాలు (2010). లక్ష్యం: ప్రజలకు అవసరమైన సమాచారాన్ని, రాజ్యాంగం ప్రసాదించిన హక్కులు-బాధ్యతలు, చట్టాలకు సంబంధించిన విశేషాలు సామాన్య ప్రజానీకానికి తెలియపర్చడం తద్వారా ప్రజాచైతన్యం కోసం కృషి చేయడం. **చిరునామా: మహమ్మద్ ఆరీఫ్, ఇంటి నం.1-72/6 ఏ, రాఘవేంద్రకాలనీ, ఉప్పల్, హైదరాబాద్-500039. సంచారవాణి: 93913 34685.**

**ముహమ్మద్ ఉమరి అబూ అబ్దుల్లా :** చిత్తూరు జిల్లా కలికిరి గ్రామంలో 1953 నవంబర్ నాల్గున జననం. తల్లితండ్రులు: బీబిజాన్, కె.బుడన్ సాహెబ్. చదువు: అఫ్జలుల్ ఉలమా., అదీబే ఫాజిల్., బి.ఏ., ఎం.ఏ., పిహెచ్.డి (జామియా మిల్లియా ఇస్లామియా, న్యూఢిల్లీ, 2008). తెలుగు, ఉర్దూ, అరబిక్, పారశీకం, ఆంగ్లం, తమిళం, హిందీ భాషల్లో ప్రవేశం. వ్యాపకం: ధార్మికసేవ, రచన, ప్రసంగాలు. అరబిక్ నుండి ఉర్దూలోకి పలు గ్రంథాలను అనుదించారు. అరబిక్ నుండి తెలుగులోకి అనువదించిన గ్రంథాలు: 1. ఇస్లాం మూల సూత్రాలు, 2. ప్రవక్త నమాజ్ విధానం, 3. ఇస్లాం నుంచి మతం బహిష్కరణ విధానం, 4. మరణాంతర న్యాయ విచారణ,



5. ఖుర్ఆన్, హదీస్‌ల ఆధారంగా హజ్, ఉమ్రా, జియారత్‌ల విధానం. లక్ష్యం: అరబిక్, ఉర్దూల్లోని ఇస్లామియా ధార్మిక జ్ఞానాన్ని తెలుగు పాఠకులకు ఎరుకపర్చడం. **చిరునామా: ముహ్మద్ ఉమరి అబు అబ్దుల్లాహ్, ఇంటి నం.8-2-316/ఎం/2, రోడ్‌నం.14, బంజార హిల్స్, హైదరాబాద్- 500034. సంచారవాణి: 98493 13744.**

**మహమ్మద్ ఆజం యస్. :** కర్నూలు జిల్లా బేతంచర్ల జన్మస్థలం. పుట్టినతేదీ: 15-02-1928. తల్లితండ్రులు: గౌస్‌బీ, మహబూబ్. చదువు: బి.ఏ., బి.ఇ.డి. రచనలు: సూక్తి శతకము, కవితలు.

**మహమ్మద్ గౌస్ :** కలం పేరు 'ఇబ్నెజాఫర్'. కడప జిల్లా ప్రొద్దుటూరు నివాసి. బహుళ ప్రచారం పొందిన 'ఆదర్శ మహాప్రవక్త' గ్రంథాన్ని రచించారు. చాలా కాలం 'ప్రబోధిని' మాసపత్రికకు సంపాదకులుగా వ్యవహరించారు. ఉర్దూ నుండి తెలుగులోకి పలు ధార్మిక గ్రంథాలను అనువదించారు.

**మహమ్మద్ హుస్సేన్ షేక్ :** పశ్చిమగోదావరి జిల్లా దొరసానిపాడు. పుట్టిన తేదీ: 08-08-1919. తల్లితండ్రులు: హుస్సేన్ బీ, సిలార్ సాహెబ్. చదువు: భాషాప్రవీణ, వృత్తి : ఉపాధ్యాయులు. కర్నూలు ఉస్మానియా కళాశాలలో ఉద్యోగం. రచనలు: భక్త కల్పద్రుమ శతకము, హరిహరనాథ శతకము, సుమాంజలి, లేఖా గుచ్ఛము, తెలుగుబాల (విద్యార్థుల నీతి బోధ), అనుగుబాల, మిత్రా (శతకము), చిన్నారి చెల్లెలు (జానపద నవల), మణి దీపిక (ఖండకావ్యము,1989), ఇల్లాలు(ఆధునిక నారీ సమాలోచనము), శ్రీ మూర్తిరాజ శతకం, 1984), శ్రీ మిత్రా- తెలుగు బిడ్డ-శతక ద్వయం (నీతి ప్రబోధకాలు), మణి మంజూష (ఖండ కావ్య సంపుటి), అనుమానం పెనుభూతం (నవల), స్త్రీ నైతిక శక్తి చలిస్తే (నవల), దంపతులు (మనో విశ్లేషణ, వచన కవిత, 1995), తాజాపూలు (వచనకవిత) సమదర్శనం (ఖండకావ్యం, 2002). వాడని పూలు (గేయ ఖండకృతి). రాష్ట్ర, జాతీయ స్థాయిలో పలు సారస్వత సంస్థలచే సత్కారాలు, సన్మానాలు, పురస్కారాలు పొందారు. 2002 నాటి చిరునామా: షేక్ మహమ్మద్ హుస్సేన్, దొరసానిపాడు -534426, వయా ద్వారకా తిరుమల, పశ్చిమ గోదావరి జిల్లా.









**ముహమ్మద్ ఖాశిం ఖాన్ :** కవితా సమితి సభ్యులు. శ్రీశ్రీ, పురిపండా అప్పల స్వామి, అబ్బూరివారి మిత్రులు. 1932లో 'భారతి' లో పారశీక వాఙ్మయ చరిత్రను మూడు భాగాలుగా రచించారు. రచనలు: వర్డ్సువర్తు కవిత్వం, మహమ్మద్ ఇక్బాల్, జలాలుద్దీన్ రుమి రాసిన మసన్నవీ, సూఫివేదాంతి హఫీజ్ అనువాదం. ఇవికాక జైనమత చరిత్ర కూడా రాశారు. ఆయన కలం నుండి పలు వ్యాసాలు, కవితలు జాలువారాయి.

**ముహమ్మద్ రుస్తుంజీ షేక్ :** మెదక్ జిల్లా మిరుదొడ్డి మండలం ఆల్వాల్‌లో 1960 ఆగస్టు ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ బీబిజాన్, షేక్ ఇబ్రహీం.'చిత్రకవి' బిరుదం.

**మహమ్మద్ యార్ :** కర్నూలు జిల్లా యాళ్ళూరులో 1911 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: ఇమాంబీ, మదార్ సాహెబ్. చదువు: ఎస్.ఎల్.సి. రచనలు: సోదర సూక్తులు, ఆవేదన తదితరాలు.



**మొహిద్దీన్ బాచ్చా షేక్ :** గుంటూరు జిల్లా బ్రాహ్మణ కోడూరులో 1936 నవంబర్ ఎనిమిదిన జననం. తల్లితండ్రులు: ఆషాబీ, గౌస్ సాహెబ్. చదువు: ఎస్.ఎస్.ఎల్.సి., ఉపాధ్యాయ శిక్షణ. వృత్తి: ఉపాధ్యాయులు. ప్రవృత్తి: యోగ శిక్షణ. 1994లో ఉద్యోగ విరమణ తరువాత సామాజిక-సాంస్కృతిక సేవా కార్యక్రమాలకు అంకితం. రాష్ట్ర వ్యాప్తంగా ఉచితంగా యోగా శిక్షణ కార్యక్రమాల నిర్వహణ. పత్రికలలో సామాజిక

వ్యాసాలతోపాటుగా చరిత్ర, యోగాకు సంబంధించిన వ్యాసాలు ప్రచురితం. రచనలు: 1.యోగాసనాలు, 2.బ్రాహ్మణ కోడూరు వైభవం, 3.తెనాలి శిల్పము. స్థానిక చరిత్రల గ్రంథాలలో 'బ్రహ్మణ కోడూరు వైభవం' గ్రంథానికి జాతీయ స్థాయి గుర్తింపు (2008). లభ్యం. అవార్డులు: జాతీయ స్థాయి ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు (1985), పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అవార్డు (1999), చక్రపాణి-కొలసాని అవార్డు. లక్ష్యం: ప్రజోపకర సాహిత్యాన్ని, సమాచారాన్ని ప్రజల దృష్టికి తెచ్చుట, సామాజిక సేవకు ప్రజలను ప్రోత్సహించుట. **చిరునామా: షేక్ మొహిద్దీన్ బాచ్చా, ఇంటి నం.2-16-17, లెనిన్ రోడ్, గాంధీనగర్, నందులపేట, తెనాలి, గుంటూరు జిల్లా. దూరవాణి: 08644- 226233, సంచారవాణి: 99893 68270.**

**మొహిద్దీన్ హుసైనీ సయ్యద్ షామ్ :** ఉర్దూ, అరబిక్, తెలుగు భాషల్లో ప్రవేశం. ఉర్దూ నుండి పలు అనువాదాలు చేశారు. ప్రచురితమైన రచన : తౌహిద్ (అనువాదం)

**మొహిద్దీన్ పిరాన్ ఏలూరు :** కడప జిల్లా కమలాపురం. పుట్టిన తేది: 15-02-1927. తల్లితండ్రులు: మహబూబ్‌బీ, హుస్సేన్‌మియా. అప్పటి నివాసం: కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా మోడమీది పల్లె. రచనలు: ఇస్లాం జీవిత విధానము, ఆర్థిక సమస్య-ఆర్థిక పరిష్కారము, జమాయేత్ ఇస్లామీ సందేశము, నిర్యాణము-విచ్చిన్నము, కలిమ-ఏ-తయ్యిబ అర్థము, ప్రపంచ మార్గదర్శి, ఇస్లాం శిక్షణ, ఖుత్బాత్ (హఖీఖతే ఇమాన్) ఖురాన్ (అలీఫ్-లాం-మీం) జిందగీ బాద్ మౌత్, లైలతుల్ ఖద్ర, మేరాజ్‌కిరాత్.

**మొహిద్దీన్ సయ్యద్ కే. :** చిత్తూరు జిల్లా పలమనేరు గ్రామంలో 1955 నవంబర్ తొమ్మిదిన జననం. తల్లితండ్రులు: జులేకా బీ, సయ్యద్ ఫకృద్దీన్. చదువు: బి.కాం., బి.ఎల్. వృత్తి : న్యాయవాది. 1980 నుండి కవితలు రాయడం ఆరంభం. 1981లో 'సాహిత్య నిధి' సాహిత్య మాసపత్రిక ప్రారంభించారు. ఈ పత్రిక ఆధ్వర్యంలో పలు సాహిత్య-సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించారు. వివిధ తెలుగు పత్రికలలో పలు కవితలు, కథానికలు, సాహిత్య వ్యాసాలు ప్రచురితం. 1982లో జరిగిన 'ఆంధ్రప్రదేశ్ ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనం' లో పాల్గొన్నారు. నటుడు, వక్త. రచన: తొలి వెలుగులు (కవితా సంపుటి, 1980). సాహిత్య-సాంస్కృతిక సంస్థల ఆధ్వర్యంలో సన్మానాలు పొందారు. లక్ష్యం: ఉత్తమ సాహిత్యాన్ని ప్రజలకు అందించడం. **చిరునామా: కే. సయ్యద్ మొహిద్దీన్, న్యాయవాది, ఇంటి నం.3-60, పోలీసు లైను వీధి, పాతపేట, పలమనేరు-517408, చిత్తూరు జిల్లా. సంచారవాణి: 94413 92939.**









**మౌలా షేక్ మున్షీ :** 1892లో ప్రచురితమైన 'చింతామణి' పత్రికలో 'నీతివాక్య రత్నాకరం' శీర్షిక వ్యాసం ప్రచురితం.

**మహమూద్ అలీ ఖాన్ కాట్లగల్ :** అనంతపురం జిల్లా కదిరి గ్రామంలో 1962 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: కె. జైబున్నీసా, కె. ఫరీద్ ఖాన్. చదువు: ఎం.ఏ (లిట్). వృత్తి: ఉర్దూ ఉపాధ్యాయులు. తెలుగు, ఉర్దూ భాషలో ప్రవేశం. 1988లో 'ఆవేదన చెందుతున్న బస్సు' కవిత ప్రచురితం కావడం ద్వారా రచనా రంగప్రవేశం. అప్పటినుండి కవితలు, వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురితం. లక్ష్యం: సామాజిక స్పృహను, మానవతా విలువలను మరింతగా పెంచడం. **చిరునామా: కాట్లగట్ల మహమూద్ అలీ ఖాన్, రజ్వి ప్రిన్స్ ప్యాలెస్, ఇంటి నం.12-55-8, మున్సిపల్ కార్యాలయం రోడ్, కదిరి-515591, అనంతపురం జిల్లా.**



**మహమ్మద్ ఖాన్ :** కృష్ణాజిల్లా అలీ నగరంలో 1952 జనవరి ఐదున జననం. తల్లి తండ్రులు: రహీమున్నీసా, మహమ్మద్ వారిస్ ఖాన్. చదువు: బి.ఏ. ఉద్యోగం: విశ్రాంత ఉద్యోగి. 1976లో విద్యార్థిగా రాసిన కవిత ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలలో, సంకలనాల్లో పలు కవితలు చోటు చేసుకున్నాయి. అవార్డులు: జ్వాలాముఖి అవార్డు (ఆంధ్ర సాంస్కృతిక సమాఖ్య, విజయవాడ, 2009), పోలవరపు కోటేశ్వరరావు అవార్డు (ఆంధ్ర ఆర్ట్స్, విజయవాడ, 2009), శ్రీశ్రీ పురస్కారం (కళాదర్బార్, రాజమండ్రి). రచనలు: కెరటాలు (కవితా సంపుటి, 2010), సప్త స్వరాలు (హైకూలు, 2010). **చిరునామా: మహమ్మద్ ఖాన్, ఇంటి నం.11-161, స్రవంతి హైస్కూలు రోడ్, గన్నవరం-521101, కృష్ణా జిల్లా. సంచారవాణి: 94401 37475.**



**ముజీర్ సయ్యద్ :** గుంటూరు జిల్లా బాపట్లలో 1939 జూలై ఒకటిన జననం. చదువు: బి.ఎస్సీ., బిఏ., డిఐపి., డిఐ.టెక్నాలజీ. ఉద్యోగం: అధ్యాపకులు (రిటైర్డ్). 1962 నుండి ఉర్దూ, ఆంగ్లం, తెలుగులో రాసిన కవితలు, సాహిత్య వ్యాసాలు, గేయాలు, అనువాదాలు ఆయా భాషా పత్రికలలో ప్రచురితం. రచనలు: రాగపరాగాలు (గేయసంపుటి, 1980). లక్ష్యం: మానవతావాద ప్రచారం. **చిరునామా: సయ్యద్ ముజీర్, అల్**



**అఫియా, ఇంటి నం. 4/1175 ఏ, సర్ సయ్యద్ నగర్, అలీఘర్-202002, ఉత్తరప్రదేశ్ రాష్ట్రం. దూరవాణి 0571-2400902, 98978 83405.**

**ముంతాజ్ అలీ ముహమ్మద్ :** ఖమ్మం జిల్లా పాల్వంచలో 1973 మే 15న జననం. తల్లితండ్రులు: హాలిమా బీ, ముహమ్మద్ అజీజ్ అలి. చదువు: ఎం.ఎస్సీ., బి.ఇడి. ఉద్యోగం: అధ్యాపకులు. 1991లో 'ఒకవేళ' కవిత ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలలో పలు కవితలు, వ్యాసాలు చోటుచేసుకున్నాయి. లక్ష్యం: ఇస్లామియా సందేశ ప్రచారం. **చిరునామా: ముహమ్మద్ ముంతాజ్ అలీ, ఇంటి నం. 10-1-151, పాల్వంచ-507115, ఖమ్మం జిల్లా. సంచారవాణి: 94923 10102**..



**ముంతాజ్ బేగం :** కృష్ణా జిల్లా విజయవాడలో 1955 ఫిబ్రవరి 15న జననం. తల్లితండ్రులు: కరీమున్నీసా బేగం, షేక్ పెంటూ సాహెబ్. చదువు: బి.ఏ., హిందీ పండిట్. ఉద్యోగం: ఉపాధ్యాయు రాలు. 1979 'గీటురాయి'లో 'అందం-ఆత్మ సౌందర్యం' వ్యాసం రావడంతో రచనా వ్యాసంగం ఆరంభమై వివిధ పత్రికలలో కథానికలు, వ్యాసాలు చోటుచేసుకున్నాయి. లక్ష్యం: ఇస్లాం సందేశ ప్రచారం. **చిరునామా: ముంతాజ్ బేగం, హిందీ పండిట్, దర్స్‌గాహె ఇస్లామీ హైస్కూల్, లబ్బీపేట, బందర్ రోడ్ విజయవాడ-520010, కృష్ణా జిల్లా. సంచారవాణి: 9290167489.**



**మునీర్ మహమ్మద్ :** అదిలాబాద్ జిల్లా బెల్లంపల్లిలో 1959 డిసెంబర్ 14న జననం. తల్లితండ్రులు: హాలిమా బేగం, మహమ్మద్ గౌస్. కలంపేర్లు: మమూర్, మసిమనిషి. చదువు: బి.ఏ. వృత్తి: జర్నలిజం. 1988 లో 'సారా మరకల ఖాకీ అంగీ' కథ ఆంధ్రజ్యోతిలో ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలలో, కథా-కవితా సంకలనాలలో పలు కవితలు, కథలు, కథానికలు, వ్యాసాలు చోటుచేసుకున్నాయి. 2008లో ఆంధ్రజ్యోతి దినపత్రిక 'నవ్య'లో ప్రచురితమైన 'నేనురా పోచవ్వను మాట్లాడుతున్నా...' కథానిక గుర్తింపు తెచ్చింది. రచనలు: సింగరేణి (2001), అమ్మా తుజేం సలాం (2010). ప్రస్తుతం 'ఆంధ్రజ్యోతి' దినపత్రికలో స్టాఫ్‌రిపోర్టర్‌గా పని చేస్తున్నారు. లక్ష్యం: అంతరిస్తున్న మనిషితనాన్ని, మానవత్వాన్ని పెంపొందించడం. **చిరునామా: మునీర్**









**మహమ్మద్, జర్నలిస్ట్, ఇంటి నం.12-176, గౌతమీ నగర్, మంచిర్యాల, ఆదిలాబాద్ జిల్లా. సంచారవాణి: 9985411280.**

**మున్షీ మీర్ సుజాయత్ ఖాన్ :** 1875లో ప్రచురితమైన 'లోకరంజని' పత్రికలో 'విద్వన్మనోహరిని' శీర్షికతో 'లోకరంజని' పత్రికాధిపతి మీద రాసిన విమర్శనా వ్యాసం ప్రచురితం.

**మున్వరున్నీసా బేగం :** పశ్చిమగోదావరి జిల్లా తాడేపల్లిగూడెంలో 1960 అక్టోబరు 22న జననం. తల్లితండ్రులు: హసన్ బేగం, ఎంఏ.సత్తార్, చదువు: ఇంటర్. 2004 నుండి వివిధ పత్రికల్లో, సంకలనాలు, సావనీర్లల్లో కవితలు, వ్యాసాలు, సమీక్షలు ప్రచురితం అయ్యాయి. లక్ష్యం: మంచిని ప్రబోధించు రచనలు చేయాలని. **చిరునామా: మున్వరున్నీసా బేగం, కేరాఫ్: ఎస్‌విహెచ్ అలీ, బిఎస్ఎన్ఎల్ స్టాఫ్ క్వార్టర్స్, టైప్.3 ఎ/3, లాలాచెర్వు, రాజమండ్రి-533106, తూర్పుగోదావరి జిల్లా. దూరవాణి: 9441638651.** Email:valisheik1971@gmail.com



**ముష్తాఖ్ అహ్మద్ ముహమ్మద్ :** తూర్పు గోదావరి జిల్లా మండపేటలో 1966 జనవరి తొమ్మిదిన జననం. తల్లితండ్రులు: హఫీజున్నీసా, సనావుల్లా. కలంపేరు: అఖిలాష్. చదువు: ప్రాథమిక విద్య. వృత్తి: వ్యాపారం. 1996లో 1. 'ప్రపంచీకరణ ప్రయోజనకరం కావాలంటే' వెలువరించడంతో రచనా రంగప్రవేశం. రచనలు: 2. సృష్టికర్త మనశ్శాంతి, 3. యేసు ఎవరు?, 4. దేవుడు తృతీయమా? ఒక్కడా? 5. ఏసు దేవుడా ? మెస్సయ్యా?, 6. విజయవంతమైన యేసు సంస్కరణా విధానం, 7. ఖురాన్ సందేశ విధానం, 8. ప్రస్థానం (2008) గ్రంథాలను ప్రచురించారు. లక్ష్యం: సత్య సందేశ ప్రచారం. **చిరునామా: ముహమ్మద్ ముష్తాఖ్ అహ్మద్, ఇంటి నం. 16-33-6/2 ఏ, పచ్చిపాలవారి వీధి, రాచర్లపేట, కాకినాడ-533003, తూర్పుగోదావరి జిల్లా. సంచారవాణి: 98485 16362.**



**ముస్తఫా మహమ్మద్ షేక్ డాక్టర్ :** కడప జిల్లా హనుమన గుత్తిలో 1939 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ ఖాశింబి, షేక్ బాలె పీరాన్ సాహెబ్. చదువు: బి.ఏ (ఇంగ్లీష్)., ఎం.ఏ(తెలుగు)., పి.హెచ్‌డి., సాహిత్యరత్న (హిందీ). వృత్తి: అధ్యాపకులు (రిటైర్డ్). 1963లో నలుగురు కవులతో కలసి 'వసంతోదయం' పద్యకావ్యాన్ని తొలిసారిగా

వెలువరించారు. తెలుగు, హిందీ భాషల్లో వెలువడుతున్న వివిధ పత్రికలలో పలు కవితలు, గేయాలు, పద్యాలు, సామాజిక వ్యాసాలు, సాహిత్య వ్యాసాలు, సమీక్షలు ప్రచురితం. రచనలు: 1.డాక్టర్ ఉమర్ అలీషా గారి ఉమర్ ఖయ్యూమ్ రుబాయిల అనుశీలన, 2. వెలుగుల రవ్వలు (వచన కవితా సంపుటి). డాక్టర్ ఉమర్ అలీషా గారి ఉమర్ ఖయ్యూమ్ రుబాయిల అనుశీలన గుర్తింపు తెచ్చి పెట్టింది. అవార్డులు -పురస్కారాలు: ఉగాది పురస్కారం (1987, హైదరాబాద్), లలిత కళాపరిషత్ పురస్కారం (అనంతపురం), కళాజ్యోతి పురస్కారం (ధర్మవరం), శ్రీ హుస్సేన్ షా కవి స్మారక అవార్డు (భీమవరం, 2003). రాష్ట్రంలోని పలు సాహితీ-సాంస్కృతిక సంస్థలచే సన్మానాలు. లక్ష్యం: మంచిని మరచిన లోకానికి మంచిగా మెలగమని ఉపదేశం చేయడం. **చిరునామా: డాక్టర్ షేక్ మహమ్మద్ ముస్తఫా, ఇంటి నం.24-301, పవర్ హౌస్ రోడ్, ప్రొద్దుటూరు-516360, కడప జిల్లా. సంచారవాణి: 97049 16336, దూరవాణి: 08564 -255482.**



**ముస్తఖీమ్ ముహమ్మద్ :** మహబూబ్‌నగర్ జిల్లా కొల్లాపూర్‌లో 1975 ఏప్రిల్ 27న జననం. తల్లితండ్రులు: ఎంఎస్ రుఖియాబీ, ఎం.డి మహమూద్. ఉద్యోగం: హిందీ పండిట్. 1995 నుండి వివిధ పత్రికలలో కవితలు, సమీక్షలు ప్రధానంగా ధార్మిక వ్యాసాలు ప్రచురితం. గీటురాయి వారపత్రికలో ధారావాహికంగా ధార్మిక వ్యాసాలను రాశారు. లక్ష్యం: అసూయా ద్వేషాల నుండి మనిషిని దూరంగా ఉంచడం, సత్సమాజం కోసం కృషి చేయడం.. **చిరునామా : ఎం.డి ముస్తఖీమ్, ఇంటి నం. 1-1-194, ఛావని స్ట్రీట్, కొల్లాపూర్-509102, మహబూబ్‌నగర్ జిల్లా.**



**ఎన్నెస్ ఖలందర్ :** కడప జిల్లా ప్రొద్దుటూరులో 1971 నవంబరు 15న జననం. తల్లి తండ్రులు: ఛోటీ రసూల్ బీ, ఎన్. బాబ్‌జాన్. చదువు: ఎం.ఏ. వృత్తి: అధ్యాపకులు. ఎనిమిదవ తరగతిలో చదువుతున్న రోజుల్లో 'జాబిల్లి' పిల్లల మాసపత్రికలో ఒకేసారి రెండు కథలు (బడాయికి హద్దు ఉండాలయ్యా, పులి చెలిమి) ప్రచురణ కావడంతో రచనా వ్యాసంగం ఆరంభమై వివిధ పత్రికలలో, సంకలనాలలో కథలు, కథానికలు, కవితలు, ప్రచురితం. 'వార్త' దినపత్రికలో ప్రచురితమైన 'మున్నీబేగం' కథ









గుర్తింపు తెచ్చిపెట్టింది. 'ప్రియదత్త' వారపత్రికలో 'సార్వభౌమ' నవల సీరియల్ వచ్చింది. హిందీ నుండి పలు కథలను తెలుగులోకి అనువదించారు. లక్ష్యం: మానవత్వపు పరిమళాలు వెదజల్లడం. **చిరునామా: ఎన్నెస్ ఖలందర్, ఇంటి నం.21/573, ఖాదర్ హుసేన్ మసీదు వీధి, ప్రొద్దుటూరు-516360, కడప జిల్లా. సంచారవాణి: 93472 25279.**

**నబీ రసూల్ కంబదూరి :** అనంతపురం జిల్లా కంబదూరిలో 1952 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: ఖాజాబీ, షేక్ మస్తాన్ సాహెబ్. కలంపేరు: కంబదూరి. చదువు: బి.కాం. ఉద్యోగం: రాష్ట్ర విద్యుత్‌శాఖ (రిటైర్డ్). 1973లో 'సమరం పూరించండి' కవిత ప్రచురణతో రచనా వ్యాసంగం ఆరంభమై వివిధ పత్రికలలో, సంకలనాలలో కవితలు, వ్యాసాలు, సమీక్షలు ప్రచురితం. 'అనంత వినియోగవాణి' అను వినియోగదారుల మాసపత్రికను సంపాదకునిగా నిర్వహిస్తున్నారు. వక్త, సాహిత్య-సాంస్కృతిక కార్యక్రమాల నిర్వహణలో దిట్ట. రాష్ట్రంలోని పలు సాహితీ-సాంస్కృతిక-సేవా సంస్థలచే సన్మానాలు-సత్కారాలు పొందారు. లక్ష్యం: అట్టడుగు వర్గాల ఉన్నతి. **చిరునామా: కంబదూరి నబీ రసూల్, ప్లాట్ నం.7, మోడరన్ హౌసింగ్ కాలనీ, సంగమేష్‌నగర్, అనంతపురం-515001, అనంతపురం జిల్లా. సంచారవాణి: 98667 14867.**



**నబీ సాహెబ్ షేక్ :** రచనలు: అంబరీషోపాఖ్యానము, కపోతేశ్వర చరిత్రము, చంద్రహాస చరిత్రము, ధ్రువోపాఖ్యానము.



**నబి షేక్ :** గుంటూరుజిల్లా అగ్నిగుండాలలో 1971 మే పదిన జననం. తల్లితండ్రులు: నరసంబి, చిన నబి. చదువు: బిఎస్సీ. వృత్తి: విద్యాబోధన. కవితలు, వ్యాసాలు వివిధ పత్రికలలో, సంకలనాలలో ప్రచురితం. రచనలు: చదువంటే? (2005), వినుకొండ కలాలు (2005). లక్ష్యం: మనస్సులను ఏకం చేయడం. **చిరునామా: షేక్ నబి, సిద్ధార్థ నగర్, వినుకొండ-522647, గుంటూరు జిల్లా. సంచారవాణి: 81218 40062.**

**నఫీజుద్దీన్ మహమ్మద్ :** గుంటూరు జిల్లా తెనాలిలో 1940 మే 25న జననం. తల్లి తండ్రులు: మహమ్మద్ ఇస్మాయిల్, హజరా బీబీ. 'యండి. సౌజన్య' కలంపేరుతో ప్రసిద్ధులు. ఆంధ్రపత్రిక ఎడిటర్ వీరాజి 1982లో ఈ కలం పేరును ఎంపికచేశారు. చదువు: ఎం.ఏ., (ఇంగ్లీష్)., ఎం.ఫిల్. వృత్తి: అధ్యాపకులు. 1965లో 'పాపం బిచ్చగత్తె' కథ ప్రచురితం అవుతుండంతో రచనా వ్యాసంగం ఆరంభించి అదే సంవత్సరం 'జ్ఞానోదయం, తమమసోమా

జ్యోతిర్గమయ, ధర్మ సంరక్షణార్థం, దేముడూ నీకు దిక్కెవరు నాటికలు రాసి విద్యార్థుల ద్వారా అంతర్‌కళాశాలల నాటిక పోటీలకు పంపి పలు బహుమతులు గెలుచుకోవడంతో విస్తృతంగా రచనలు చేయడం ఆరంభించారు. ఆ క్రమంలో నవలలు: 1.విముక్తి, 2. విధి విన్యాసాలు, 3.కలల అలలు, 4. ఈ చరిత్ర ఎవరు రాస్తారో, 5. ఆపదలో అనురాధా, 6. జాదూ నగర్, 7. మృత్యు లోయ, 8. ఈ నేరం ఎవరిది?, 9.మాయా బజార్, 10. మృత్యువుతో ముఖాముఖి, 11. ఓ నటి కథ, 12. మరో ధరిత్రి, 13. త్రికాల్, 14. బలికోరిన ప్రేమ; నాటికలు: 15. జ్ఞానోదయం, 16. తమసోమా జ్యోతిర్గమయ, 17. ధర్మ సంరక్షణార్థం, 18. దేముడూ నీకు దిక్కెవరు, 19. కనకపు సింహాసనమున; రేడియో నాటికలు: 20. కోటి విద్యలు, 21. తాతయ్య పరీక్ష, 22. తనదాకా వస్తే, 23. పరిహారం, 24. ఇది దారి కాదు, 25. ఐడియాల అప్పారావు; హాస్యరస గ్రంథాలు: 26. ప్రముఖుల హాస్యాలు, 27. మహనీయుల జీవితాల్లో మధుర ఘట్టాలు, 28. హాస్యవల్లరి, 29. నవరసాల తెలుగు హాస్యం, 30.నవ్వుతూ బ్రతకాలిరా (2010); విద్యార్థులకు ఉపయుక్త గ్రంథాలు: 31. వ్యాససుధ, 32. నమ్మలేని నిజాలు, 33. చరిత్ర పురుషులు చారిత్రక ఘట్టాలు, 34. ప్రపంచ అద్భుతాలు, 35. రాబిన్‌సన్ క్రూసో; సాహిత్యవిమర్శనా గ్రంథాలు: 36. ప్రపంచ సాహిత్యంలో ప్రేమ ఘట్టాలు, 37.షేక్స్‌పియర్ నాటకాలు, కథలు-విమర్శ, 38. విశ్వ సాహిత్యంలో విశిష్టతలు-వింతలు తదితర గ్రంథాలు వెలువడ్డాయి. ఈ గ్రంథాలు కాకుండా ఆంగ్ల అధ్యాపకులు కావడంతో 1. వరల్డ్ ఫేమస్ స్టోరీస్,2. సోషల్ షార్ట్ స్టోరీస్ ఫర్ చిల్డ్రన్ అను ఆంగ్ల గ్రంథాలను వెలువరించారు. ఐదు



దశాబ్దాలుగా రాసిన నవలలు, నాటికలు-నాటకాల మీద రాష్ట్రంలోని పలు విశ్వవిద్యాలయలలోని విద్యార్థులు పరిశోధనలు జరిపి ఎం.ఫిల్., పి.హెచ్‌డి పట్టాలను పొందారు. రాష్ట్రంలోని వివిధ పత్రికలలో కథలు, కవితలు, సాహిత్య, సమీక్షా వ్యాసాలు, పలు నవలలు ధారవాహికంగా ప్రచురితం అయ్యాయి. ఆయన ప్రత్యేకంగా రాసిన రేడియో నాటికలన్నీ ఆకాశవాణి ద్వారా ప్రసారం కావడం మాత్రమే కాక ఆయన రూపొందించిన స్టేజి నాటకాలు ఈనాటికి కూడా రాష్ట్రంలోనే కాకుండా ఇతర రాష్ట్రాలలో తెలుగు ప్రజలు అధికంగా గల ప్రాంతాలలో ప్రదర్శించ బడుతున్నాయి, ఉత్తమ నాటక రచన క్యాటగిరిలో బహుమతులు అందుకుంటున్నాయి. ఉత్తమ దర్శకులు, ఉత్తమ నటుడు, ఉత్తమ రచయితగా బహుమతులు అందుకున్న ఆయన హస్య నటుడిగా, మంచి చిత్రకారులుగా సుప్రసిద్ధులు. కథలు, నవలలు, నాటికలు పలు ఇతర భాషలలో అనువాదమై పుస్తకాలు వెలువడ్డాయి, రేడియో నాటికలు జాతీయ స్థాయిలో ప్రసారానికి నోచుకున్నాయి. అవార్డులు-పురస్కారాలు







-బిరుదులు: చక్రపాణి అవార్డు (హైదరాబాద్), కొలసాని-చక్రపాణి అవార్డు (చిలువూరు), జాషువా స్మారక అవార్డు (తెనాలి), తెలుగు విశ్వవిద్యాలయం సాహితీ అవార్డు (హైదరాబాద్), షార్జా తెలుగు అసోసియేషన్ అవార్డు (షార్జా), రసమయి-దుబాయ్ లిటరరీ అవార్డు (దుబాయ్), కొలసాని వెంకట సుబ్బయ్య అవార్డు, బాలజ్యోతి అవార్డు, బొల్లిముంత శిరామకృష్ణయ్య అవార్డు, తాగూర్ సెంటినరీ అవార్డు (గుంటూరు), హస్యచక్రవర్తి (దుబాయి), నవలా చక్రవర్తి (నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు). సాహిత్య-సాంస్కృతిక సంస్థల ద్వారా పలు సన్మానాలు అందుకున్నారు. లక్ష్యం: ఉత్తమ, ఉపయుక్త సాహిత్యాన్ని సంఘానికి అందించడం. **చిరునామా: మహమ్మద్ నఫీజుద్దీన్, (ఎండి.సౌజన్య), కొత్తపేట, తెనాలి-522 201, గుంటూరు జిల్లా. దూరవాణి: 08644- 226015, సంచారవాణి: 99490 16732.**

**నశీర్ అహమ్మద్ సయ్యద్ :** నెల్లూరు జిల్లా అల్లూరు తాలూకా పురిణి గ్రామంలో 1955 డిసెంబరు 22న జననం. తల్లితండ్రులు: షేక్ బీబిజాన్, సయ్యద్ మీరా మోహిద్దీన్. చదువు: ఎం.కామ్., ఎల్ఎల్.బి., సాహిత్యరత్న (హిందీ)., డి.జె. వృత్తి: న్యాయవాది-పాత్రికేయుడు. ఏడవ తరగతి నుండి రాయడం ఆరంభించినా 1975లో 'మరోప్రపంచం' లిఖిత మాసపత్రికలో తొలిసారిగా కవితలు ప్రచురణ. 1976లో 'ప్రగతి' సచిత్ర వారపత్రికలో కథానికలు, కార్టూన్లు చోటుచేసుకున్నాయి. అప్పటి నుండి వివిధ పత్రికల్లో పలు కవితలు, గేయాలు, కథలు, వందలాది రాజకీయ-సామాజిక-సాహిత్య- చరిత్ర-సమీక్షా వ్యాసాలు,



పలు వ్యంగ్య చిత్రాలు ప్రచురితం. స్వయంగా మిత్రుడు వివిస్సార్ అవధానితో కలసి 'మరో ప్రపంచం', 'భేరి' లిఖిత మాసపత్రికలు వెలువరించారు, 2006 నుండి 'ఇండియా' మాసపత్రికకు సంపాదకత్వం వహిస్తున్నారు. భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లిం జన సముదాయాల పాత్ర వివరిస్తూ, 1999 నుండి గ్రంథ ప్రచురణ ప్రారంభించి, 1. భారత స్వాతంత్ర్యోద్యమం - ముస్లింలు, 2. భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం మహిళలు, 3. భారత స్వాతంత్ర్యోద్యమం: ఆంధ్రప్రదేశ్ ముస్లింలు, 4. మైసూరు పులి : టిపూసుల్తాన్, 5. భారత స్వాతంత్ర్యోద్యమం: ముస్లిం ప్రజా పోరాటాలు, 6. షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్, 7. భారత స్వాతంత్ర్య సంగ్రామం: ముస్లిం యోధులు (ప్రథమ భాగం), 8. చిరస్మరణీయులు, 9. 1857: ముస్లింలు అను గ్రంథాలు వెలువరించారు. ఈ గ్రంథాలలో మొదటి నాలుగు గ్రంథాలు మూడుసార్లు, ఆ తరువాతి నాలుగు గ్రంథాలు రెండుసార్లు పునర్ముద్రణయ్యాయి. ఈ గ్రంథాలలో షహీద్-యే-ఆజం అష్ఫాఖుల్లా ఖాన్, భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింలు ఉర్దూలోకి అనువాదం అయ్యాయి. 'భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింలు' ఆంగ్ల వ్యాసం అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయం

ప్రచురించిన 'భారత స్వాతంత్ర్యోద్యమం-ముస్లింల పాత్ర' వ్యాససంపుటిలో చోటుచేసుకుంది. నటుడు, చిత్రకారుడు, వ్యంగ్యచిత్రకారుడు, వక్త. అంతర్జాతీయ-జాతీయ-ప్రాంతీయ సభలు, సమావేశాలు, సదస్సులలో పాల్గొన్నారు. అవార్డులు- పురస్కారాలు: వి.ఆర్ నార్ల విశిష్ట జర్నలిస్టు అవార్డు (విజయవాడ), తెలుగు భాషా పురస్కారం (గుంటూరు), డాక్టర్ బి.ఆర్. అంబేడ్కర్ ఫెలోషిప్ అవార్డు (న్యూఢిల్లీ). లక్ష్యం: ఆర్థిక-సామాజిక అసమానతలు లేని లౌకిక, ప్రజాస్వామ్య వ్యవస్థ నిర్మాణంలో రచయితగా భాగస్వామ్యం అందించడం, జ్ఞానం ప్రజాస్వామీకరించబడాలన్న ఆకాంక్షతో రచనా వ్యాసంగం చేయడం. **చిరునామా: సయ్యద్ నశీర్ అహమ్మద్, శివప్రసాద్ వీధి, కొత్తపేట, వినుకొండ-522567, గుంటూరు జిల్లా. సంచారవాణి: 94402 41727, 93964 29722.** Email: naseerahamed@ yahoo.com.

**నసీరా బేగం :** కృష్ణా జిల్లా విజయవాడలో 1972 మే 17న జననం. తల్లితండ్రులు: సలీమున్నీసా బేగం, సయ్యద్ నయీమూర్ రహ్మాన్. చదువు: బి.ఏ. వ్యాసంగం: రచన-అనువాదం. ఉర్దూ, తెలుగు భాషలలో ప్రవేశం. 1987లో తండ్రి ప్రోత్సాహంతో రచనారంగ ప్రవేశం. అప్పటినుండి రాష్ట్రంలోని వివిధ పత్రికలలో వ్యాసాలు ప్రచురితమయ్యాయి. 'ఈనాడు' దినపత్రికలో 'అంతర్యామి' శీర్షిక క్రింద రాస్తున్న వ్యాసాలు గుర్తింపు తెచ్చాయి. ఉర్దూ నుండి తెలుగులోకి అనువదించి ధార్మికంగా ప్రజలకు మార్గదర్శకం చేసే వ్యాసాలు రాస్తున్నారు. లక్ష్యం: అల్లాహ్ ప్రసన్నత. **చిరునామా: నసీరా బేగం, ఫ్లాట్.405, అన్సారి ఎన్‌క్లేవ్, అజీజియా మస్జిద్ ఎదురు, మెహదీపట్నం, హైదరాబాద్-28. సంచారవాణి: 92465 31645, దూరవాణి: 040-66253022.**



**నవాజ్ అలీ ముహమ్మద్ :** 1938 సెప్టెంబర్ 25న జననం. వరంగల్ జిల్లా నర్సంపేట నివాసి. తల్లితండ్రులు: మహబూబ్ బీ, మహబూబ్ అలీ, వృత్తి: అధ్యాపకులు. 1954లో 'భాగ్యనగర్' పత్రికలో 'జోహారు' తొలి కవిత ప్రచురితం. అప్పటి నుండి వివిధ పత్రికలలో పలు కవితలు, వ్యాసాలు చోటు చేసుకున్నాయి. 'సహజ కవి' బిరుదాంకితులు. రచన: 'సంజీవని' (గేయ సంపుటి,1989). చిరునామా: ఎండి నవాజ్ అలీ, 8-22, నేతాజీ రోడ్, నర్సంపేట- 506132, వరంగల్ జిల్లా.

**నాజర్ సాహెబ్ షేక్ :** బుర్రకథా పితా మహుడుగా విఖ్యాతిగాంచి 'నాజర్' పేరుతో ప్రసిద్ధుడైన షేక్ నాజర్ సాహెబ్ గుంటూరు జిల్లా తాడికొండ మండలం పొన్నెకల్లు గ్రామంలో 1920 ఫిబ్రవరి 5న జన్మించారు. తల్లితండ్రులు : షేక్ బీబాబి, షేక్ మస్తాన్ సాహెబ్.







చిన్నతనం నుండి సంగీతం పట్ల మక్కువ చూపిన నాజర్ నాటకాలు, నాటికలు రచిస్తూ, నటిస్తూ తొలుత గ్రామ ప్రజల మన్నన పొందారు. ఆ తరువాత నాట్యం, నటనను నేర్చుకున్న ఆయన ప్రజా నాట్యమండలి సభ్యుడిగా బుర్రకథను ప్రచార సాధనంగా స్వీకరించి బుర్రకథ కళాకారుడిగా స్థిరపడ్డారు. ఈ క్రమంలో జీవితాంతం బుర్రకథను ప్రదర్శిస్తూ, ఆ కళారూపానికి ప్రాణం పోసి 'బుర్రకథ పితామహుడు' గా ప్రజల పురస్కారాన్ని అందుకున్నారు. జానపద కళలను బాగా అధ్యయనం చేసిన నాజర్ 'బెంగాల్ కరువు', 'రాయలసీమ కరువు' లను బుర్రకథలుగా మలచి తన అద్భుత గానంతో, అద్వితీయ నటనతో ప్రజలను ఉగ్రూతలూగించే విధంగా బుర్రకథలను చెబుతూ ప్రాంతీయ స్థాయి నుండి జాతీయ స్థాయికి చేరుకున్నారు. ఆ తరువాత 'పల్నాటి యుద్ధం' 'బొబ్బిలి యుద్ధం' 'వీరాభిమన్యు' చారిత్రక పౌరాణిక కథలను బుర్రకథలుగా రాశారు. 'ఆసామి' అను సాంఘిక నాటకాన్ని, 'నా చేతిమాత్ర' ఏకపాత్రాభినయం, 'భక్త ప్రహ్లాద' యక్షగానం, రూపొందించారు. ఆయన రూపొందించిన వివిధ సాహిత్య ప్రక్రియలకు, జాదపద కళా రూపాలకు చెందిన రచనలకు సుమధుర గాత్రం అందించటమే కాకుండా ఆయన స్వయంగా నటించారు. ప్రజా కళాకారుడిగా ప్రజా హృదయాలను చూరగొన్న ఆయనను 1986లో 'పద్మశ్రీ' అవార్డు వరించింది. ఆనాటికి మరే జానపద కళాకారుడికి అంతటి గౌరవం దక్కకపోవడంతో జానపద కళాకారులలో 'పద్మశ్రీ' అవార్డు అందుకున్న తొలి జానపద కళాకారునిగా ఆయన చరిత్ర సృష్టించారు. జాతీయ స్థాయిలో పలువురు ప్రముఖుల, ప్రముఖ సాహిత్య సంస్థల ప్రశంశలు, పురస్కారాలు అందుకున్నారు. బుర్రకథకు పర్యాయపదంగా మారిన పద్మశ్రీ షేక్ నాజర్ సాహెబ్ చలన చిత్రాలలో నటించడమే కాకుండా 'నిలువుదోపిడి', 'పెత్తందార్లు', 'సగటు మనిషి', చిత్రాలకు రచనా సహకారం అందించారు. ఆయన సాహిత్యం, కళాజీవితం మీద అంగడాల వెంకట కృష్ణమూర్తి పరిశోధన చేసి సిద్ధాంత వ్యాసం సమర్పించి ఆచార్య నాగార్జున విశ్వ విద్యాలయం (గుంటూరు) నుండి 'పి.హెచ్‌డి' పట్టా పొందారు. పద్మశ్రీ నాజర్ జీవిత చరిత్ర 'పింజారి' పేరుతో ముద్రితమైంది. 'జాతి జీవితం -కళాపరిణామం' పేరుతో ఆయన రాసిన పరిశోధనాత్మక గ్రంథం 1997లో ప్రచురితమైంది. ఆయన స్వయంగా రాసుకున్న 'ఆత్మకథ' ముద్రణకు నోచుకోకుండానే పద్మశ్రీ షేక్ నాజర్ సాహెబ్ 1997 ఫిబ్రవరి 21న గుంటూరులో కన్నుమూశారు. (సమాచారం: షేక్ నాజర్ భార్య శ్రీమతి ఆదంబి, కుమారుడు, బుర్రకథ కళాకారుడు షేక్ బాబూజీలతో ఇంటర్వ్యూ, 06-06-2008, గుంటూరు)





**నజీర్ అహమ్మద్ సి.యం :** చిత్తూరు జిల్లా కార్వేటినగరంలో 1939 సెప్టెంబర్ 29న జననం. తల్లితండ్రులు: జిలానీ బి, ముహమ్మద్ అక్బర్ సాహెబ్. కలంపేరు: షఫీ. చదువు: యస్.యస్.ఎల్.సి. ఉద్యోగం: విశ్రాంత సహకార సబ్రిజిస్ట్రార్. 1995 నుండి రచనా వ్యాసంగం ఆరంభం. కవితా సంకలనాల్లో, పత్రికల్లో కవితలు, వ్యాసాలు చోటుచేసుకున్నాయి. రచన: షఫీ సౌరభ కుసుమాలు (కవితా సంపుటి, 2009). లక్ష్యం: సామాజిక చైతన్యం. **చిరునామా: సి.ఎం. నజీర్ అహమ్మద్, ఇంటి నం.15-1742/1, లాలూ గార్డెన్, చిత్తూరు- 517001, చిత్తూరు జిల్లా. దూరవాణి: 94415 76555.**



**నజీర్ బాషా షేక్ :** నెల్లూరు జిల్లా నెల్లూరులో 1960 జూన్ 19న జననం. తల్లితండ్రులు: షేక్ రసూల్ బీ, షేక్ దాదా సాహెబ్. కలంపేరు: వివేక్. ఉద్యోగం: స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (నెల్లూరు). 2006లో ప్రచురితమైన 'మేథో వాఖ్య' వ్యాసం ద్వారా రచనా వ్యాసంగం ఆరంభమైంది. ప్రధానంగా 'ధ్యాన మాలిక' మాసపత్రికలో (విజయవాడ) 'ఖుర్ఆన్' ను పరిచయం చేస్తూ రాస్తున్న ధారావాహిక వ్యాసాలు గుర్తింపు తెచ్చిపెట్టాయి. లక్ష్యం: అందరి ఆరాధ్యదైవం ఒక్కడేనన్న సత్యసందేశాన్ని ప్రచారం చేయడం. **చిరునామా: షేక్ నజీర్ బాషా, ఇంటి నం. 21/450, ఆచారి హౌస్, బాశికాల వారి వీధి, పెద్దబజారు, నెల్లూరు-524001, నెల్లూరు జిల్లా. సంచారవాణి: 97050 03231, 93471 06719.**



**నజీరుద్దీన్ ఎండి. :** నల్గొండ జిల్లా గోపువారి గూడెంలో 1964 సెప్టెంబర్ రెండున జననం. తల్లితండ్రులు: గోరిబీ, మొగల్ ఖాజా సాహెబ్. చదువు: ఎం.ఏ., ఎల్ఎల్.బి. వృత్తి: న్యాయవాది. 1984లో 'మరుభూమి' కవితతో ఆరంభమై పలు వ్యాసాలు, కవితలు వివిధ పత్రికల్లో, సంకలనాలలో ప్రచురితం. 'జంబు ద్వీపం', 'మహాఆదిగా' కవితలు గుర్తింపు తెచ్చి పెట్టాయి. లక్ష్యం: సమకాలీన సమస్యల మీద అభిప్రాయాలు ప్రజలకు చేరువయ్యేలా సూటిగా, ధాటిగా వెల్లడించడం. **చిరునామా: ఎండి. నజీరుద్దీన్, ఇంటి నం. 8-1-3750, ఆర్టీసి కాలనీ, నల్గొండ- 508001, నల్గొండ జిల్లా. సంచారవాణి: 98488 12056, 80191 73505.** Email: nazeeruddinbsp@gmail.com.









**నిసార్ అహమ్మద్ సయ్యద్ :** కర్నూలు జిల్లా ఆదోనిలో 1979 సెప్టెంబర్ 30న జననం. తల్లితండ్రులు: సయ్యద్ రహమత్, సయ్యద్ యానిన్ మియా. కలంపేరు: ఎండి. రహమత్. చదువు: ఎం.ఏ., పి.ఏడి. వృత్తి: పాత్రికేయులు. గత దశాబ్దంగా వివిధ పత్రికల్లో బాధ్యతలు నిర్వహిస్తూ వ్యాసాలు రాసినా 2007 నుండి 'గీటురాయి' వారపత్రికలో వరుసగా వ్యాసాలు ప్రచురితం అయ్యాయి. అప్పటి నుండి సమకాలీన సమస్యల మీద, ఇతర పలు సామాజిక అంశాల మీద వివిధ పత్రికలలో వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ఆ వ్యాసాలలో గీటురాయిలో వచ్చిన 'అల్లరి మూకలకు శిక్షేది?' గుర్తింపు తెచ్చింది. లక్ష్యం: జాతిజనుల చైతన్యం. **చిరునామా: సయ్యద్ నిసార్ అహమ్మద్, జర్నలిస్ట్, ఇంటి నం.1-1-300/17, అశోక్‌నగర్, 12వ వీధి, హైదరాబాద్ -20. సంచారవాణి: 97001 42615**. Email: nisarahamedsyed@gamil.com



**నిసార్ యం.డి :** నల్లగొండ జిల్లా గుండాల మండలం సుద్దాల గ్రామంలో 1962 డిసెంబర్ 16న జననం. కలం పేరు: నిసార్. తల్లితండ్రులు: హలీమాబీ, మహమ్మద్ అబ్బాస్. చదువు: బి.ఏ. వృత్తి: ఆర్టీసి ఉద్యోగి. 1986లో 'ప్రజా రచయితల సమాఖ్య'లో చేరినప్పటి నుండి పాటలు రాయడం, పాడడం, ఆడడం ఆరంభమైంది. 'ఆంధ్ర ప్రజా నాట్యమండలి'తో సంబంధాలు ఏర్పడ్డాక కవితలు, పాటలు, పల్లె సుద్దులు రాయడం, పాడడం, ప్రదర్శనలు ఇవ్వడం విస్తృతంగా జరిగింది. 'పల్లెసుద్దుల' మీద ప్రత్యేక కృషి చేసి సమకాలీన ప్రజా సమస్యల మీద తయారు చేసిన ప్రత్యేక కార్యక్రమాలను స్వయంగా దర్శకత్వం వహించి ఆడుతూ పాడుతూ రాష్ట్ర పరిధుల్ని దాటి జాతీయ స్థాయి కార్యక్రమాలలో భాగంగా ఢిల్లీ, లక్నో, మద్రాసులలో ప్రదర్శనలు ఇచ్చారు. ఈ క్రమంలో రాసిన పాటలు, కవితలు, గేయాలు, కథానికలు వివిధ పత్రికల్లో, సంకలనాల్లో, రాష్ట్రంలోని పలు ఉద్యమ పత్రికల్లో పెక్కు సంఖ్యలో చోటుచేసుకున్నాయి. అభ్యుదయ చలనచిత్రాలకు పాటలు రాశారు, ఆయా చిత్రాలలో నటించారు. రచనలు: నిసార్ పాట (పాటల సంపుటి, 2009), నిసార్ పాటల క్యాసెట్టు (ఎంపిక చేసి నిసార్ స్వయంగా గానం చేసిన పాటలు, 2009). లక్ష్యం: అవినీతికి, అసమానతలకు దూరంగా వివక్షారహిత మానవీయ సమాజాన్ని ఆకాంక్షిస్తూ వాగ్గేయకారునిగా నిరంతరం ప్రజల్లో బతకాలని. **చిరునామా: ఎండి. నిసార్, ఇంటి నం. 4-52-169, మగ్దూం నగర్, జగద్గిరి గుట్ట, బాలనగర్, హైదరాబాద్-37. సంచారవాణి: 9490952285.**

**నూర్జహాన్ షేక్ :** పశ్చిమ గోదావరి జిల్లా పండిత వెల్లూరులో 1969 మే 11న జననం. తల్లితండ్రులు: అమీనా బీబి, మీరా సాహెబ్. కలంపేరు: బాబ్జీ. చదువు: యం.ఏ., బి.ఇడి. ఉద్యోగం: ఉపాధ్యాయులు. 1984లో 'నడుస్తున్న చరిత్ర' మాసపత్రికలో తొలిసారిగా కవిత ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికల్లో, సంకలనాల్లో కవితలు చోటు చేసుకున్నాయి. పలు గేయ రూపకాలు విద్యార్థుల ద్వారా ప్రదర్శించబడ్డాయి. సాహిత్యసంస్థల ద్వారా సన్మానాలు -సత్కారాలు. లక్ష్యం: సామాజిక రుగ్మతల పట్ల ప్రజలలో చైతన్యం కల్గించుట. **చిరునామా: షేక్ నూర్జహాన్, ఇంటి.నం. 3-286-14, శ్రీ సాయిదుర్గా నగర్, పాలంగి-534216, పశ్చిమగోదావరి జిల్లా.**



**నూరుల్లా ఖాద్రి సయ్యద్ :** ఉర్దూ మున్షీ, కర్నూలు. రచనలు: రమజాను మహిమలు, నమాజు బోధిని, సుందరమగు నమూనా, విశ్వాసములు, ఆరు మాటలు, జుంబా.

**పాపా సాహెబ్ తక్కెళ్ళపల్లి :** అనంతపురం జిల్లా గుత్తి తాలూకా అప్పేచర్ల జన్మస్థలం. తల్లి తండ్రులు: ఫక్రూబీ, ఫక్రుద్దీన్. 1928లో జననం. రచనలు: అవధి, అంబ, కన్నీటి చుక్కలు, ప్రేమ విలాసము, రసఖండం, రాణీ సంయుక్త, శకుంతల, సత్యాన్వేషణము, పాపాసాబు మాట పైడిమూట.

**పర్వీన్ ముస్తఫా :** కరీంనగర్ జిల్లా గోదావరిఖనిలో 1974 సెప్టెంబర్ 25న జననం. తల్లితండ్రులు: రజియా బేగం, మొహమ్మద్ ఖాశిం సాహెబ్. కలంపేరు: కిరణకాంతి. చదువు: బి.ఏ. 2007 ఏప్రిల్‌లో 'నమాజ్ ప్రాముఖ్యత' వ్యాసం ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికల్లో పలు ఆధ్యాత్మిక వ్యాసాలు చోటుచేసుకున్నాయి. లక్ష్యం: సత్య సందేశాన్ని ప్రజలకు అందించడం. **చిరునామా: పర్వీన్ ముస్తఫా, ఇంటి నం.607 /డిబి, పంజాబ్ గడ్డ, రామవరం, కొత్తగూడెం-507118, ఖమ్మంజిల్లా. సంచారవాణి: 92927 50406.**

**పిరాన్ నిజాయి టి.హెచ్ :** రచనలు: హజరత్ హుస్సేన్ సంస్మరణము, సూాయె ఫాతెహా (అనువాదం) హజ్రత్ ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వస్సలాం గారి సీరత్ గురించి ఉపన్యాసములు (అనువాదాలు).

**ఖుతుబుద్దీన్ సయ్యద్ డాక్టర్ :** హైదరాబాద్ ఫలక్‌నుమ ఖాద్రిచమన్‌లో 1945 మే15న జననం. తల్లితండ్రులు: సయ్యదా నూరాం బీ, సయ్యద్ మహబూబ్ అలీ. కలంపేరు: కుతుబ్ సర్‌షార్. చదువు: ఎం.ఏ., పి.హెచ్‌డి. ఉద్యోగం: విశ్రాంత అధ్యాపకులు. 1973లో 'నిర్మాణం' (మహబూబ్‌నగర్) పత్రికలో 'వికృత సత్యాలు' (కవిత) రాసినప్పటి నుండి వివిధ









పత్రికలు, కవితా సంకలనాలలో కవితలు, గేయాలు, వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ఉర్దూ కవితా మాధుర్యాన్ని విశ్లేషిస్తూ ఆకాశవాణి కేంద్రం ద్వారా తెలుగులో ప్రసంగ వ్యాసాలు ప్రసారం. తెలుగులో రాస్తున్న కవుల, రచయితల రచనల విశిష్టతను, ఘనతను విశ్లేషిస్తూ ఉర్దూలో రాసిన వ్యాసాలు ఉర్దూ పత్రికల్లో ప్రచురితం అయ్యాయి. లక్ష్యం: మానవతా విలువలను పరిపుష్టం చేయడం. **చిరునామా : డాక్టర్ సయ్యద్ ఖుతుబద్దీన్, ఇంటి నం.1-10-80, షా సాహెబ్ గుట్ట, మహబూబ్‌నగర్-509001, మహబూబ్‌నగర్ జిల్లా. సంచారవాణి: 97037 71012.**

**రఫి యండి. డాక్టర్ :** వరంగల్ జిల్లా ముత్యాలపల్లిలో 1974 ఆగస్టు 17న జననం. తల్లి తండ్రులు: అహమద్‌బీ, ముహమ్మద్ అబ్బాస్. చదువు: యం.డి. వృత్తి: వైద్యం. 1998లో సమకాలీన సామాజికాంశం మీద రాసిన వ్యాసం ద్వారా రచనా రంగ ప్రవేశమైనప్పటి నుండి వివిధ పత్రికలు, సావనీర్లు, సంకలనాలలో కవితలు, ప్రధానంగా సామాజిక, శాస్త్రీయ వ్యాసాలు ప్రచురితం అయ్యాయి. లక్ష్యం: అణగారిన వర్గాల సాధికారికత కోసం కృషి చేయడం. **చిరునామా : డాక్టర్ యం.డి. రఫి, ప్లాట్ నం.102, ఇంటి నం. 12-13-633, కోకిల అపార్ట్ మెంట్స్, వీధి నం.14, నాగార్జున నగర్, తార్నాక, సికింద్రబాద్ -1. సంచారవాణి: 98481 55960.**



**రఫి మహమ్మద్ ఎస్ :** శ్రీకాకుళం జిల్లా కాశీబుగ్గలో 1969 మే 19న జననం. తల్లి తండ్రులు: ఫాతిమా బీ, ఫరీదు సాహెబ్. చదువు: బి.ఏ. వృత్తి: మార్కెటింగ్. కలంపేరు: ఈవేమన. 1984 'అమ్మ' మాసపత్రికలో 'అమ్మ' శీర్షికతో కవిత ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలలో, సంకలనాలలో కవితలు, కథానికలు, కథలు, నాటికలు చోటు చేసుకున్నాయి. పలు నాటికలు ఆకాశవాణి ద్వారా ప్రసారం అయ్యాయి. పురస్కారాలు: సాహితీ సుధ (పాలకొల్లు). లక్ష్యం: సామాజిక చైతన్యం. **చిరునామా : ఎస్. మహమ్మద్ రఫీ, జెండా వీధి, జడ్పీ రోడ్, శ్రీకాకుళం-532001, శ్రీకాకుళం జిల్లా. సంచారవాణి: 99637 50632.**



**రఫి షేక్ :** ప్రకాశం జిల్లా చీరాలలో 1965 జూలై 15న జననం. తల్లితండ్రులు: షేక్



మెహరున్నీసా, షేక్ మస్తాన్. చదువు: బి.ఏ. వ్యాపకం: అనువాదకుడు ('వార్త' దినపత్రిక, హైదరాబాద్). 1981లో బాలమిత్ర మాసపత్రికలో తొలిసారిగా 'అందం తెచ్చిన అపకారం' కథ ప్రచురితం కావడంతో రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటినుండి వివిధ పత్రికల్లో, సంకలనాలలో కథలు, కవితలు, వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ఆ క్రమంలో ఫెమినిజం ప్రధానాంశంగా రాసిన 'స్పందన' నవల, 'పచ్చని జ్ఞాపకం' కవిత గుర్తింపు తెచ్చి పెట్టాయి. రచన: స్పందన (నవల 2002). లక్ష్యం: మంచి సాహిత్యాన్ని రచించడం, మంచి సాహిత్యాన్ని ఆస్వాదించడం. **చిరునామా : షేక్ రఫి, ఇంటి నం. 16-11658/ఏ, మూసరంబాగ్, హైదరాబాద్-36. సంచారవాణి: 94907 51886.**

**రఫి సయ్యద్ :** కృష్ణా జిల్లా నూజివీడులో 1958 మే ఎనిమిదిన జననం. తల్లితండ్రులు: సయ్యద్ అఫ్రపున్నీసా, సయ్యద్ హాఫీజ్. చదువు: బి.ఏ, ఐటిఐ. ఉద్యోగం: దక్షిణ మధ్యరైల్వే.



1979లో విజయవాడ నుండి వెలువడిన 'ఎన్‌కౌంటర్' పక్షపత్రికలో తొలిసారిగా వ్యాసం ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికల్లో, సంకలనాల్లో వ్యాసాలు చోటుచేసుకున్నాయి. వక్త, రాజకీయ విశ్లేషకుడు. లక్ష్యం: మూఢ నమ్మకాల నుండి, అన్నిరకాల అసమానతల నుండి సమాజాన్ని విముక్తం చేయడం. **చిరునామా: సయ్యద్ రఫి, ఇంటి నం. 745-ఎం, ఆర్ ఇ కాలనీ, కాల్‌టెక్స్ రోడ్, విజయవాడ-520 001, కృష్ణాజిల్లా. సంచారవాణి: 99490 93044.** Email: syedrafimrs@gamil.com

**రఫి మహమ్మద్ టింగిరి షేక్ :** కడప జిల్లా నరసాపురంలో 1973 జూన్15న



జననం. తల్లితండ్రులు: జైనుబీ, బాషు సాహెబ్. చదువు: ఎం.ఏ., బి.ఇడి. ఉద్యోగం: ఉపాధ్యాయుడు. కలంపేరు: టిఎండి రఫి. 1988లో ఆంధ్రభూమి వీక్లీలో రాసిన 'కోయిలా...కోయిలా' కవితతో ఆరంభమై వివిధ పత్రికల్లో, సంకలనాలలో పలు కవితలు, కథలు, వ్యాసాలు చోటు చేసుకున్నాయి. ముస్లిం రిజర్వేషన్లను సమర్థిస్తూ దినపత్రికల్లో ప్రచురితమైన వ్యాసాలు గుర్తింపు తెచ్చి పెట్టాయి. లక్ష్యం: ముస్లింలు బాగుండాలి, అందరూ బాగుపడాలి, నా దేశం సుభిక్షంగా ఉండాలన్నది. **చిరునామా: టిఎండి రఫి, ఇంటి నం.14-421, కొత్తవీధి, పోరుమామిళ్ళ-516193, కడప జిల్లా. సంచారవాణి: 94416 36821.**







**రహమతుల్లా బేపారి షేక్ :** కడప జిల్లా సిద్దవట్టంలో 1957 డిసెంబర్ ఆరున జననం. తల్లితండ్రులు: షేక్ సలీమాబి, షేక్ అబ్దుల్ రసూల్. కలంపేరు: 'శశిశ్రీ'. చదువు: బి.ఏ., బి.యల్., ఎం.ఏ. వృత్తి: పాత్రికేయుడు. ప్రాథమిక విద్య నాటి నుండి కవిత్వం మీద ఏర్పడిన మక్కువకు డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యుల మార్గదర్శకం లభించడంతో 1977లో 'అభ్యుదయ' మాసపత్రికలో 'సమాజం' కవిత తొలిసారిగా ప్రచురితమైంది. అప్పటి నుండి వివిధ పత్రికల్లో, సంకలనాల్లో కవితలు, కథానికలు, గేయాలు, పద్యాలు, సాహిత్య- సామాజిక-సమీక్షా వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ప్రచురితమైన చాలా కవితలు, కథానికలు ఆంగ్లం, ఉర్దూ భాషల్లో తర్జుమా చేయబడి ఆయా భాషా పత్రికల్లో ప్రచురితం అయ్యాయి. 1995 నుండి 'సాహిత్యనేత్రం' త్రైమాస పత్రిక నిర్వహిస్తున్నారు. ఆశువుగా కవిత్వం చెప్పడంలో దిట్ట. వక్త, సామాజిక-రాజకీయ విశ్లేషకుడు. రచనలు: 1.రాతిపూలు (కథా సంపుటి, 1996), 2.పల్లవి (వచన కావ్యం, 1978), 3.శబ్దానికి స్వాగతం (వచన కావ్యం, 1991), 4.జేబులో సూర్యుడు (వచన కావ్యం,2008), 5.దహెజ్ (కథల సంపుటి,



2007), 6.మనకు తెలియని మన కడప జిల్లా (చరిత్ర గ్రంథం, 2007). ఈ గ్రంథాలలో 'జేబులో సూర్యుడు' వచన కావ్యం 'జేబ్ మే సూరజ్' పేరుతో 2006లో ఉర్దూలో, 'దహెజ్' కథల సంపుటి 'ట్యూన్స్ ఆఫ్ లైఫ్' పేరుతో 2008లో ఆంగ్లంలో వెలువడ్డాయి. తెలుగుకు ప్రాచీన హోదా కోసం కడప జిల్లాలోని తొలినాటి తెలుగు శాసనాల గురించి ప్రచారం చేసిన భాషా సేవకుడిగా గుర్తింపు. పురస్కారాలు-అవార్డులు: ఎంవి గుప్తా ఫౌండేషన్ ప్రత్యేక అవార్డు (ఏలూరు, 1989), గుర్రం జాషువా అవార్డు (కడప, 1990), తెలుగు అధికార భాషా సంఘంచే 'విశిష్ట భాషా పురస్కారం' (2004 మరియు 2008), ఉత్తమ సాహిత్య సంపాదకుడు అవార్డు (కథానిలయం నందలూరు, 2007), డాక్టర్ పట్టాభిరామి రెడ్డి స్మారక పురస్కారం (హైదరాబాద్, 2008), కొండేపూడి శ్రీనివాసరావు స్మారక సాహిత్య పురస్కారం (2008, గుంటూరు), ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే 'రాష్ట్ర స్థాయి ఉత్తమ పాత్రికేయుడు' అవార్డు (హైదరాబాద్, 2008), యూనిసెఫ్ అంతర్జాతీయ పురస్కారం (2009, హైదరాబాద్). అరసం వజ్రోత్సవ సాహితీ పురస్కారం (గుంటూరు, 2010). ప్రముఖ సాహిత్య-సాంస్కృతిక సంస్థలచే సన్మానాలు, సత్కారాలు. లక్ష్యం: తెలుగు సాహిత్య, సాంస్కృతిక వైభవ-ప్రాభవాలను మరింతగా ప్రతిష్టింప జేయాలన్నది. **చిరునామా : షేక్ బేపారి రహమతుల్లా, ఇంటి నం.1-778 (2ఏ), జర్నలిస్టు కాలనీ, ద్వారకా నగర్, కడప-516004, కడప జిల్లా. సంచారవాణి : 93474 10689, 99899 13818.** Email: sasisreekdp@gmail.com

**రహమతుల్లా షేక్ :** ప్రకాశం జిల్లా సంతనూతలపాడులో 1963 ఫిబ్రవరి పదిన జననం. తల్లితండ్రులు: రొఖయాబి, షేక్ గఫూర్. కలంపేరు: బా రహమతుల్లా. చదువు: ఎం.ఏ (లిట్). ఉద్యోగం: బిఎస్ఎన్ఎల్ (హైదరాబాద్). 1994 ఫిబ్రవరి 25నాటి ఆంధ్రజ్యోతి వారపత్రికలో 'తెలివి ఎవడి సొమ్ము' కథ



ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికల్లో కథలు, కథానికలు, కవితలు చోటుచేసుకున్నాయి. 2003లో వెలువడిన 'బా' కథల సంపుటి మంచి గుర్తింపు తెచ్చిపెట్టి షేక్ రహమతుల్లాను కాస్తా 'బా రహమతుల్లా' గా మార్చేసింది. 'బా' కవితా సంపుటి ఉర్దూలో తర్జుమా చేయబడి 2006లో ప్రచురితమైంది. రచనలు: 'బా' (కథల సంపుటి, 2004), 'పీపల్ మే నీం' (కవితల సంపుటి, 2007), 'మా' (కథల సంపుటి, 2009). పురస్కారాలు-అవార్డులు: విశాల సాహితి బి.ఎస్ రాములు కథా పురస్కారం (2004), హసన్ ఫాతిమా సాహితీ స్మారక ఆత్మీయ పురస్కారం (ఒంగోలు, 2008), శ్రీకృష్ణదేవరాయ సాహిత్య సాంస్కృతిక సేవా సమితి ఉగాది పురస్కారం (హైదరాబాద్, 2009). లక్ష్యం: మరుగున పడుతున్న మానవత్వాన్ని పట్టం కట్టడం. **చిరునామా: బా రహమతుల్లా, ప్లాట్ నం. 104, సాయి చైతన్య అపార్ట్‌మెంట్స్, డిఎస్ఎన్ అర్, హైదరాబాద్-60. సంచారవాణి: 94908 06022,** Email: juggymeraj@yahoo.co.in

**రహమతుల్లా షేక్ :** ప్రకాశం జిల్లా ఒంగోలులో 1938 నవంబర్ నాల్గున జననం. తల్లితండ్రులు: షేక్ రహమతున్నీసా, షేక్ మహబూబ్ సాహెబ్. చదువు: బి.కామ్ (ఆనర్స్), ఎసిఎస్, ఎసిఐఎస్. ఉద్యోగం: వాణిజ్య శాస్త్ర అధ్యాపకులు (రిటైర్డ్). మూడు దశాబ్దాల క్రితం రచనా వ్యాసం ఆరంభం. కళాశాల మ్యాగజైన్స్‌లో, ఇతర పత్రికలలో వివిధ అంశాల మీద వ్యాసాలు ప్రచురితం అయ్యాయి. 1975లో 'ముహమ్మద్ జీవిత చరిత్ర' అను గ్రంథం రాసినా అది 2010లో వెలువడింది. రచనలు: 1. ఇస్లాంను రక్షించిన మేధావులు (2009), 2. షరియత్ (2010), 3. ఇస్లాం చరిత్ర (2010), 4. మహమ్మద్ జీవిత చరిత్ర (2010), 5. ఉస్వా-యే-రసూలే కరీం (ఉర్దూ నుండి తెలుగు అనువాదం, 2010). లక్ష్యం: ఇస్లాం ఔనత్యాన్ని, ఘన చరిత్రను ప్రజలకు సులభగ్రాహ్యమైన తీరులో వివరించడం. **చిరునామా: షేక్ రహమతుల్లా, ఇంటి. నం.జి-1, రాహుల్ అపార్ట్‌మెంట్స్, వైవి రావు అసుపత్రి దగ్గర, లబ్బీపేట, విజయవాడ-10, కృష్ణా జిల్లా. దూరవాణి: 0866-2486390.**

**రహంతుల్లా షాలీ :** అనంతపురం జిల్లా వజ్రకరూరులో 1942 జనవరి పదిన జననం. తల్లితండ్రులు: సాహెబ్‌బీ, మహబూబ్ సాహెబ్. కలం పేరు: షాలీ. చదువు:







ఎం.ఏ., ఎం.ఇడి. ఉద్యోగం: విశ్రాంత చరిత్ర అధ్యాపకులు. 1961లో 'ఆంధ్రమహిళ'



పత్రికలో ప్రచురితమైన 'ఒరిపిడిరాళ్ళు' కవితతో ఆరంభమై వివిధ పత్రికల్లో, సంకలనాల్లో కవితలు, కథలు, వ్యాసాలు, పద్యాలు చోటుచేసుకున్నాయి. రచనలు: బాబ్రీ మసీదు (ఒక చారిత్రక పరిశీలన, 1990), భారతీయ ముస్లింలు (నిన్న-నేడు-రేపు), 2003, హజ్, ఉమ్రా ఔర్ జియారత్ (2004), ముస్లిం మతాచారాలు (2005), కంబ్లివాల (మహమ్మద్ ప్రవక్త జీవిత చరిత్ర, 2009). లక్ష్యం: అట్టడుగున పడి కన్పించని వాస్తవాలను వెలికి తీయాలన్నది. **చిరునామా: షాలీ రహంతుల్లా, ఇంటి నం. 6-1-911, కోవూరు నగర్ ఎక్స్‌టెన్షన్, అనంతపురం-515004, అనంతపురం జిల్లా. సంచారవాణి: 08554-233402.**

**రహమతుల్లా నూర్‌బాషా :** గుంటూరు జిల్లా బాపట్ల మండలం కంకటపాలెంలో 1959 ఏప్రిల్ 18న జననం. తల్లితండ్రులు: నూర్‌బాషా రోషన్‌బి, నూర్‌బాషా మౌలాలి. కలం పేరు: నూర్‌బాషా. చదువు: యం.కామ్. ఉద్యోగం: స్పెషల్ డిప్యూటీ కలక్టర్. 1978లో విద్యార్థిగా కళాశాల పత్రికలలో 'తుఫాను మీద విజయం' కవిత రాయడంతో రచనా వ్యాసంగం ఆరంభం. ప్రజల సమస్యలను విశ్లేషిస్తూ, పరిష్కారాలు సూచిస్తూ ఉత్తరాలు,



వ్యాసాలు వివిధ పత్రికల్లో ప్రచురితం. ఆంగ్ల భాషలోని ఆర్థిక-సామాజిక-ధార్మిక వ్యాసాలను తెలుగులోకి అనువదించి వెలువరించడం పట్ల ప్రత్యేక ఆసక్తి. ఇస్లాం-క్రైస్తవం మీద రాసిన తులనాత్మక వ్యాసాల పరంపర మంచి గుర్తింపు తెచ్చిపెట్టాయి. ప్రభుత్వ అధికారిక వ్యవహారాలు, ఉత్తర-ప్రత్యుత్తరాలు ప్రజల భాష తెలుగులో సాగాలన్న ప్రయత్నాలకు ఆచరణ రూపం ఇస్తూ 2008లో 'భూసేకరణ అవార్డు'ను రాష్ట్ర చరిత్రలో తొలిసారిగా ఆంగ్లంలో కాకుండా తెలుగు భాషలో రాసి పలువురికి మార్గదర్శకులయ్యారు. రచనలు: తెలుగు అధికార భాష కావాలంటే (2004). పురస్కారాలు: తెలుగు భాషా పురస్కారం (2004, హైదరాబాద్). లక్ష్యం: తెలుగు భాషలో ప్రభుత్వం వ్యవహారాలు సాగించాలి, ఉత్తరప్రత్యుత్తరాలు తెలుగులో జరగాలన్నది. **చిరునామా : నూర్ బాషా రహమతుల్లా, ఇంటి.నం. 11-121, పోలకంపాడు, తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా. సంచారవాణి: 97035 43390,** Email: nrahmthulla@yahoo.com

**రహిమాన్ ఎస్ :** అనంతపురం నివాసి. 1984 ప్రాంతంలో అనంతపురం జిల్లా

అనంతపురంలోని స్టేషన్ రోడ్డులో నివాసం. రచనలు: నీలం రాజు.

**రహిమాన్ ఎస్.ఎ :** గుంటూరు జిల్లా మాచర్ల తాలూకా ఓబులేసునిపల్లె జన్మస్థలం. పుట్టిన తేది:15-08-1946. తల్లితండ్రులు: అమీర్‌బీ, అల్లీ సాహెబ్. చదువు: పియుసి. రచనలు: పరివర్తన గేయాలు.

**రాజ్ మహమ్మద్ డాక్టర్ :** వరంగల్ జిల్లా హసన్‌పర్తి మండలం సీతంపేరు గ్రామంలో 1959 ఏప్రిల్ ఒకటిన జననం. తల్లితండ్రులు: యాఖూబీ, అబ్దుల్లా. కలంపేరు: రాజ్, రాజ్ ముహమ్మద్. చదువు : ఎం.ఏ., పి.హెచ్‌డి. ఉద్యోగం: ఉపాధ్యాయులు. 1987లో తొలి వ్యాసం ప్రచురితం కావడంతో రచనా వ్యాసంగం ఆరంభమై పలు వ్యాసాలు వివిధ పత్రికల్లో చోటు చేసుకున్నాయి. 1998 ఏప్రిల్ 12న ప్రజాతంత్ర పత్రికలో ప్రచురితమైన 'అగ్రరాజ్యం చేతుల్లోకి వేపచెట్టు' వ్యాసం గుర్తింపు తెచ్చిపెట్టింది. జాతీయ, అంతర్జాతీయ సదస్సుల్లో పాల్గొని ఆంధ్ర ప్రదేశ్ జానపద సాహిత్యం మీద సమర్పించిన ప్రసంగ వ్యాసాలు ఆకాశవాణి, దూరదర్శన్, టెలివిజన్ ఛానెల్స్‌లో ప్రసారం.



పురస్కారాలు : జానపద సాహిత్య పురస్కారం. లక్ష్యం: ప్రజా చైతన్యం. **చిరునామా : డాక్టర్ రాజ్ మహమ్మద్ ఇంటి నం.6-4-21, హన్మకొండ-506011, వరంగల్ జిల్లా. సంచారవాణి: 99480 37665.**

**రజా హుస్సేన్ అబ్దుల్ :** గుంటూరు జిల్లా మంగళగిరిలో 1957 ఏప్రిల్ 11న జననం. కలం పేరు: మహతి. తల్లితండ్రులు: ఫరీద్‌బీ, అబ్దుల్ రసూల్. చదువు: బి.ఏ (లిట్)., ఎం.ఏ., ఎం.ఫిల్. ఉద్యోగం: తెలుగు అధ్యాపకత్వం. ఆ తరువాత 'ఈనాడు' దినపత్రికలో పాత్రికేయుడిగా ఎనిమిదేళ్ళు బాధ్యతల నిర్వహణ. ప్రస్తుతం రాష్ట్ర ప్రభుత్వాధికారి. 1972 నుండి విద్యార్థిగా కళాశాల మ్యాగ్‌జైన్‌లో రాయడం ద్వారా రచనా వ్యాసాంగం ఆరంభం. అప్పటినుండి వివిధ పత్రికలలో కవితలు, వ్యాసాలు, కథానికలు, గల్పికలు, సాహిత్య వ్యాసాలు, విమర్శలు, సమీక్షలు ప్రచురితం. ప్రొఫెసర్ తూమాటి దోణప్ప ప్రోత్సాహంతో 1988లో తొలి పుస్తకం 'పింగళి వెంకయ్య' ప్రచురించారు. రచనలు: 1. పింగళి వెంకయ్య (1988), 2.ఆనవాలు (సాహిత్య వ్యాసాల సంకలనం,



2005), 3. చుక్కా రామయ్య (జీవిత కథనం), 2006, 4. బాలల కలామ్, 2006, 5. ఇంటి భాష (2005), 6. తిరంగా ముసల్మాన్ (కవితలు) 2006, 7. చేవ్రాలు (సాహిత్య







వ్యాసాలు), 2006, 8. అపరాజిత (ఎయిడ్స్ బాధిత మహిళల యదార్థగాథలు), 2007, 9. ఎగరేసిన ఎర్రజెండా (భీమిరెడ్డి నరసింహారెడ్డి జీవిత కథనం), 2008, 10. నెల్లూరు బ్రౌన్ బంగోరె (బండి బాలగోపాలరెడ్డి జీవిత కథనం), 11. వాల్మీకి రామాయణం. 'తేజ' వారపత్రికలో 'మహతి' కలం పేరుతో సాహిత్య శీర్షిక నిర్వహణ. లక్ష్యం: ప్రజల్లో సాహిత్యాభిలాష, అభిరుచి కల్గించడం. **చిరునామా: అబ్దుల్ రజా హుస్సేన్, ఇంటి నం. 11-5-410, లిల్లీ బ్లాక్, ఫ్లాట్ నం.402, నయీంఖాశిం అపార్ట్‌మెంట్స్, రెడ్‌హిల్స్, హైదరాబాద్-500004, సంచారవాణి: 95055 17052**, Email: a.rajahussain@gmail.com

**రజాక్ అబ్దుల్ మొహమ్మద్ :** వరంగల్ జిల్లా నర్సాపూర్ మండలం వెంకటాపూర్‌లో



1966 మే 11న జననం. తల్లితండ్రులు: ఖాజాబీ, రాజ్ మహమ్మద్. చదువు: బి.యస్సీ., బి.ఇడి., డి.జే. ఉద్యోగం: జర్నలిస్ట్. 1987 నుండి రచనా వ్యాసంగం ఆరంభం. వివిధ పత్రికలలో కవితలు, వ్యాసాలు ప్రచురితం. లక్ష్యం: గ్రామీణ ముస్లిం జీవన విధానం మీద పరిశోధనాత్మక వ్యాసాల ప్రచురణ. **చిరునామా : మొహమ్మద్ అబ్దుల్ రజాక్, ఇంటి నం.7-261087/ ఏ/134, రాజరాజేశ్వర్ నగర్ కాలనీ (బి.కె. గూడా), సనత్‌నగర్, హైదరాబాద్- 500038. సంచారవాణి: 99481 22798.**

**రమిజా బాను షేక్ :** నెల్లూరు జిల్లా బిట్రగుంటలో 1965 మార్చి మూడున జననం. తల్లితండ్రులు: హాజిమా షేక్ సర్తాజ్ బేగం, హాజీ షేక్ పీర్ అహమ్మద్. కలం పేరు: రమిజా. చదువు: ఎం.ఏ., బి.ఇడి. ఉద్యోగం: ఉపాధ్యాయురాలు. 1986లో 'హేతువాదం'



మాసపత్రికలో (నరసరావుపేట) మూఢనమ్మకాల వలన సమాజానికి కలిగే నష్టాలను వివరిస్తూ రాసిన వ్యాసంతో ఆరంభించి వివిధ పత్రికలలో వ్యాసాలు, సమీక్షలు ప్రచురితం అయ్యాయి. 'భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లిం మహిళలు నిర్వహించిన పాత్ర'ను వివరిస్తూ వివిధ పత్రికల్లో రాసిన వ్యాసాలు గుర్తింపు తెచ్చిపెట్టాయి. లక్ష్యం: సమాజాన్ని చైతన్యవంతం చేయటం-సర్వజనావళి ప్రగతికి రచనలు ఉపయుక్తం కావాలి. **చిరునామా: షేక్ రమిజా బాను, శివప్రసాద్ వీధి, కొత్తపేట, వినుకొండ-522647. గుంటూరు జిల్లా. దూరవాణి: 94413 70070.**

**రషీద్ బాషా :** నెల్లూరు నివాసి. ఇస్లాం మతంలోని పండుగల మీద 'విక్రమ సింహపురి మండల సర్వస్వం'లో వ్యాసాలు రాశారు.

**రషీదా డి :** కడప జిల్లా కడపలో 1962 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: ఖుర్షీద్ బేగం, సనావుల్లా ఖాన్. చదువు: హిందీ పండిట్. ఉద్యోగం: ఉపాధ్యాయురాలు. 2006లో 'గీటురాయి' వారపత్రికలో రాసిన 'దైవకారుణ్య వర్థిని' వ్యాసంతో ఆరంభించి పలు ధార్మిక మహిళలో ధార్మిక చింతనను మరింతగా పెంపొందించాలన్న లక్ష్యంతో పత్రికలలో వ్యాసాలు, కథానికలు ప్రచురితం అయ్యాయి. 2009లో స్వీయ సంపాదకత్వంలో 'దైవ కారుణ్య వర్షిణి' అను త్రైమాసిక పత్రికను కడప కేంద్రంగా ఆరంభించి కొంతకాలం నడిపారు. లక్ష్యం: ఇస్లాం సందేశాన్ని సర్వవ్యాప్తం చేయడం. **చిరునామా : డి. రషీదా, ఇంటి నం. 2/75, మారుతీనగర్, కడప-516001, కడప జిల్లా. దూరవాణి : 93463 73044.**



**రసూల్ ఖాన్ పఠాన్ :** ప్రకాశం జిల్లా యర్రగొండపాలెంలో 1982 మార్చి ఒకటిన జననం. తల్లితండ్రులు: పఠాన్ హసన్ బీబి, పఠాన్ ఖాశిం పీరా ఖాన్. కలంపేరు. పి రసూల్ ఖాన్. చదువు: ఆరవ తరగతి. వ్యాపకం: ఆటోమెకానిక్. 2007లో మొదటిసారిగా రాసిన వ్యాసం 'మొక్కై వంగనిది' ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలలో వ్యాసాలు, కవితలు చోటుచేసుకున్నాయి. లక్ష్యం: ధర్మస్థాపన ప్రయత్నాలలో భాగంగా రచయితగా తగినంత భాగస్వామ్యాన్ని అందించడం. **చిరునామా: పఠాన్ రసూల్ ఖాన్, తండ్రి: పఠాన్ ఖాశిం పీరా ఖాన్, పాండు పాత ఆసుపత్రి ఎదురు, కొనేటి వీధి, యర్రగొండ పాలెం- 523327, ప్రకాశం జిల్లా. దూరవాణి: 9397076152.**



**రసూల్ ముహమ్మద్ షేక్ :** గుంటూరు జిల్లా అమరావతి మండలం మునుగోడులో 1993 సెప్టెంబర్ 15న జననం. కలంపేర్లు: అబూ అనస్, బద్రుల్ ఇస్లాం. తల్లితండ్రులు: షేక్ ఇమాంబి, షేక్ బాన్‌సా. చదువు: బి.ఏ., ఎం.సి.ఏ., అరబ్బీ మాధ్యమంతో ఆలిమియత్, ఫజీలత్ చేశారు. తెలుగు, ఉర్దూ, హిందీ, అరబీ, ఆంగ్ల భాషల్లో ప్రవేశం. 2000లో 'అసూయ' గ్రంథాన్ని ఉర్దూ నుండి తెలుగులోకి అనువదించడంతో రచనా వ్యాసంగం అరంభమై. వివిధ పత్రికల్లో పలు ధార్మిక వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ప్రచురణలు: ఉర్దూ, అరబీ భాషల నుండి తెలుగులోకి అనువదించిన 28 ధార్మిక









గ్రంథాలు వెలువడ్డాయి. వీటిలో హదీసు కిరణాలు, ఇస్లామీయ ఆరాధనలు, ఖుర్‌ఆన్ సందేశం, ఖుర్ ఆన్ కథామాలిక లాంటి గ్రంథాలు గుర్తింపును తెచ్చిపెట్టాయి. బృహత్తర గ్రంథం 'అంతిమ దైవగ్రంథం ఖుర్‌ఆన్' (అనువాదం-వ్యాఖ్యానం) ప్రచురణలో సహకారం. లక్ష్యం: సత్య సందేశాన్ని పదిమందితో పంచుకోవడం. **చిరునామా: షేక్ ముహమ్మద్ అబ్దుల్ రసూల్, ఇంటి నం.16-2-862, అక్బర్‌బాగ్, సైదాబాద్, హైదరాబాద్ -500059. సంచారవాణి: 93473 86588**. Email: abuanas2007@gmail.com

**రసూల్ షేక్ :** శ్రీకాకుళం జిల్లా శ్రీకాకుళం జన్మస్థలం. రచనలు: మిత్ర బోధనామృతము.

**రవూఫ్ అబ్దుల్ షేక్ డాక్టర్ :** నల్గొండ జిల్లా నాగార్జునసాగర్ (హిల్‌కాలనీ)లో 1962 డిసెంబర్ 22న జననం. తల్లితండ్రులు: షేక్ సమీవున్నీసా, షేక్ నూర్ అహమ్మద్. చదువు: ఎం.బి.బి.యస్. వృత్తి: వైద్యం. 1978లో ఆంధ్రజ్యోతిలో ప్రచురితమైన 'నాగరికపుటడవి' కవితతో రచనా వ్యాసంగం ఆరంభం. వివిధ పత్రికలలో కవితలు, కథానికలు, కథలు, వ్యాసాలు చోటు చేసుకున్నాయి. రచనలు: 1.అంతర్నేత్రం, 2. ముఖచిత్రం, 3.విశాఖపట్నం, 4. కనురెప్పల కిటికీ రెక్కల మధ్య..., 5. పారిస్ నగరం, 6.కదిలే కాలం, 7.అంతస్సూత్రం, 8. సముద్రపుటలలు, 9.లాంగ్ మార్చ్ (2009), 10.మళ్ళీ మరో ప్రస్థానం (2010) కవితా సంపుటాలు; 11.మధుమేహాన్ని జయించడమెలా, 12.డయాబెటిస్ హెల్త్ గైడ్ (ఆంగ్లం). అవార్డులు: శ్రీశ్రీ అవార్డు (1984, విశాఖపట్నం), పోలవరపు కోటేశ్వరరావు కవితా పురస్కారం, జ్వాలాముఖి స్మారక కవితా పురస్కారం (2009, విజయవాడ) లక్ష్యం: సమ సమాజం. **చిరునామా: డాక్టర్ యస్.ఏ.రవూఫ్, ఇంటి నం.13-8-172, ఓల్డ్‌క్లబ్ రోడ్డు, నందిని లాడ్జి ప్రక్కన, కొత్తపేట, గుంటూరు-522001, గుంటూరు జిల్లా. సంచారవాణి: 98490 41167**. Email: ravufsa4@yahoo.co.in





**రియాజ్ మహమ్మద్ :** వరంగల్ జిల్లా ముత్యాలపల్లిలో 1970 జూన్ 24న జననం. తల్లి తండ్రులు: అహమద్‌బీ, అబ్బాస్. చదువు: ఎం.ఏ(పొలిటికల్ సైన్స్)., ఎం.ఏ (ఫిలాసఫీ)., ఎం.ఏ (ఎడ్యుకేషన్)., ఎం.ఫిల్. వృత్తి: అధ్యాపకులు. కలం పేర్లు: ఉజ్వల్, ఆజాద్. ఆంగ్లం, తెలుగులో ప్రవేశం. 1983లో ప్రపంచ శాంతి కాంక్షిస్తూ 'ఉగాది' శీర్షికతో రాసిన కవితతో రచనా వ్యాసంగం అరంభమై 1994లో 'వేకువ కోసం' కవిత ప్రచురితం

అయినప్పటి నుండి వివిధ పత్రికలు, సంకలనాలలో వ్యాసాలు, కవితలు చోటుచేసుకున్నాయి. రచనలు: 'భారతీయ ముస్లింల ముఖచిత్రం' (1998లో 'పుట్టుమచ్చ' కవి మహమ్మద్ అబ్దుర్ ఖాదర్ మొయినుద్దీన్‌తో కలసి). లక్ష్యం: సమాజం ప్రగతి దిశగా సాగే చైతన్యం కలుగచేయాలని. **చిరునామా: ఎం.డి రియాజ్, ఇంటి నం.2-7-496, ఎక్సైజ్ కాలనీ, హన్మకొండ, వరంగల్ జిల్లా. దూరవాణి: 98490 22931.**

**రియాజుద్దీన్ అహమద్ షేక్ :** అనంతపురం జిల్లా అనంతపురంలో1961 ఏప్రిల్ 30న జననం. తల్లితండ్రులు: ఖైరున్నీసా-మెహరున్నీసా, ఎస్. అల్లాబక్ష్. చదువు: ఎం.ఏ., యం.ఫిల్. ఉద్యోగం: ఉపాధ్యాయులు. 1985లో కళాశాల పత్రికలో 'అదృష్టం', 'సామాన్యుని వ్యధ' కవిత, వ్యాసం రాయడంతో రచనా వ్యాసంగం ఆరంభమైంది. అప్పటి నుండి వివిధ పత్రికలలో, కవితా సంకలనాలలో కవితలు, సాహిత్య వ్యాసాలు ప్రచురితమయ్యాయి. 'ఉమర్ అలీషా నాటకాలు-విశ్లేషణ', 'సాహిత్యం-సహజీవనం' (సాహిత్య విమర్శనా వ్యాసాలు) గుర్తింపు తెచ్చిపెట్టాయి. ఈ వ్యాసాలతోపాటుగా పలు ప్రసంగ వ్యాసాలు ఆకాశవాణిలో ప్రసారం అయ్యాయి. లక్ష్యం: ముస్లిం కవులు రచించిన తెలుగు నాటకాల విశిష్టతలను పదిమంది దృష్టికి తీసుకురావడం. **చిరునామా: షేక్ రియాజుద్దీన్ అహమద్, ఇంటి నం.7/502, రహమత్ నగర్, అనంతపురం-515001, అనంతపురం జిల్లా. సంచారవాణి: 94419 83007.**



**రుక్నుద్దీన్ కె. డాక్టర్ :** మహబూబ్‌నగర్ జిల్లా రాచూరులో 1947 మే రెండున జననం. తల్లితండ్రులు: చాంద్‌బీ, జహంగీర్ సాహెబ్. చదువు: యం.ఏ (తెలుగు)., యం.ఏ (సంస్కృతం)., పి.హెచ్‌డి. ఉద్యోగం: ఉస్మానియా విశ్వ విద్యాలయంలో అధ్యాపకులు. 1965లో 'పంచాయితీ రాజ్యం' పత్రికలో ప్రచురితమైన తొలి కవితతో రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటినుండి వివిధ పత్రికలు, కవితా-కథా సంకలనాలల్లో కవితలు, సాహిత్య-సమీక్షా- విమర్శనా వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో పలు ప్రసంగ వ్యాసాలు ప్రసారం అయ్యాయి. రచనలు: 1. విప్లవ ఢంకా (గేయాలు), 2.జానపదం-అలంకారం (సిద్ధాంత వ్యాసం), 3. విశ్వదర్శనం (కవితా సంపుటి), 4. మోదుగ పూలు (సామాజిక వ్యాసాలు), 5. కిన్నెర మెట్లు (జానపద పరిశోధక వ్యాసాలు), 6. శెలిమె (వ్యాస సంపుటి), 7. సూక్తి సుధ (అనువాద గ్రంథం), 8. ప్రయాణం (దీర్ఘ కవిత), 9. రుగ్వాణి (పద్య కావ్యం). 1993లో









రాసిన 'విశ్వ దర్శనం' కవితా సంపుటి గుర్తింపు తెచ్చిపెట్టింది. అవార్డులు -పురస్కారాలు: రాష్ట్ర ప్రభుత్వ ఉగాది కవి పురస్కారం (హైదరాబాద్), జ్యోత్స్న కళా పీఠం అవార్డు, స్వర్ణ కంకణ పురస్కారం, సరస్వతీ పీఠం అన్నా సాగర్ అవార్డు. లక్ష్యం: కావ్యం విశ్వశ్రేయ సాధకంగా మలచాలని, అది సామరస్య సహజీవన సాధకంగా ఉండాలన్నది. **చిరునామా: డాక్టర్ కె.రుక్నుద్దీన్, గాలిబ్ మంజిల్, ఇంటి నం.4-123/ఇ/56, స్వరూప్ నగర్, ఉప్పల్, హైదరాబాద్-39. సంచారవాణి: 94403 55758.** Email: drkruknuddin @yahoo.com.

**సాబిర్ హుసేన్ సయ్యద్ :** ప్రకాశం జిల్లా యర్రగొండపాలెంలో 1970 ఆగస్టు 12న జననం. తల్లితండ్రులు: సయ్యద్ ఫాతిమా బీ, సయ్యద్ బాషా హుసేన్. చదువు: బి.ఏ., డిప్లొమా ఇన్ ఆయుర్వేదిక్. వృత్తి: జర్నలిజం-వైద్యం. 1990లో విశాలాంధ్రలో కవిత ప్రచురితం కావడంతో రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికలలో కవితలు, వ్యాసాలు, కథలు చోటు చేసుకున్నాయి. రచనలు: 1. ఖిబ్లా (కవితా సంకలనం, 2006, సంపాదకత్వం), 2. నిప్పు (కవితా సంపుటి, 2007), 3. జంగ్ (కవితా సంకలనం, 2007, సంపాదకత్వం). 'నిప్పు' కవితా సంపుటి గుర్తింపు తెచ్చిపెట్టింది. లక్ష్యం: ఇస్లాం ప్రబోధిస్తున్న లౌకిక స్వభావాన్ని వివరిస్తూ విభిన్న జన సముదాయాల మధ్య సఖ్యత-సమైక్యత కోసం పాటుపడడం. **చిరునామా: సయ్యద్ సాబిర్ హుసేన్, అమ్మ ప్రజావైద్యశాల, ఫస్టువార్డు స్కూలు ఎదురు వీధి, వినుకొండ- 522647, గుంటూరు జిల్లా. సంచారవాణి: 96034 62053.**



**సాదిఖ్ ఎం. :** తూర్పుగోదావరి జిల్లా చంద్రమాంపల్లిలో 1938లో జన్మించారు. తల్లి తండ్రులు: కందికొండ పద్మరాజు, కందికొండ వెంకాయమ్మ. ఇరవై ఏండ్ల వయస్సులో ఇస్లాం స్వీకరించిన ఆయన ఎండి. సాదిక్‌గా తన పేరు మార్చుకున్నారు. ఆర్టీసి ఉద్యోగి. రచనలు: వెలుగుబాట (1993). వివిధ పత్రికలలో పలు ఆధ్యాత్మిక వ్యాసాలు వెలువరించారు. ధార్మిక ప్రసంగాలు చేశారు. ఆయన వెలువరించిన 'వెలుగుబాట' పలు ముద్రణలకు నోచుకుంది. చివరివరకు రచనా పరంగా, ప్రసంగాల ద్వారా ధార్మిక ప్రచారంలో నిమగ్నమైన ఎండి. సాదిఖ్ 1995 జూన్ 16న కన్నుమూశారు.

**సాగర్ జయ్యాది డాక్టర్ :** కడప జిల్లా కడపలో 1941 ఏప్రిల్ నాల్గున జననం. తల్లి తండ్రులు: రొఖయాబీ, ఎన్నెస్ అబ్దుల్ ఖాలిద్. పూర్తిపేరు ఎన్నెస్ ఖాదిర్ హుస్సేన్ అయినప్పటికి 'డాక్టర్ సాగర్ జయ్యాది' పేరుతో స్థిరపడ్డారు. కలంపేర్లు: ఇండియన్ ముస్లిమ్, సాగర్ జయ్యాది. చదువు: ఎస్ఎస్‌యల్‌సి., రాష్ట్ర భాషాప్రవీణ, యూనాని వైద్యంలో డిప్లొమా.



వృత్తి : వైద్యం. ఉర్దూ, తెలుగు, హిందీ భాషాల్లో మంచి ప్రవేశం. 1972లో 'లలిత ప్రతానని' కవితల సంపుటి ద్వారా తెలుగు సాహిత్య రంగ ప్రవేశం. 1972 నుండి రాసిన కవితలు, వచన కవితలు, పద్యాలు పలు పత్రికలలో ప్రచురితం. రచనలు: 1. లలిత ప్రతానాని (కవితా సంపుటి, 1988), 2. పరిమళ వీచికలు (హల్కూ, 1994), 3.అనంత తరంగణి (హల్కూ పద్యాలు), 4. తెల్లవారలేదు (కవితా సంపుటి, 1997), 5. సూఫి ధాగే (వచన కవిత్వం, 2004), 6. హిరోంకా తాజ్ (వచనం, 2006), 7. ఆకలి రంగు (తెలుగు గజళ్ళు, 2007), 8. వెలుగు వాసన (కవితా సంపుటి, 2008). 1974 నుండి 2007 వరకు ఉర్దూలో వివిధ సాహిత్య ప్రక్రియల్లో మొత్తం పది గ్రంథాలు, 2005లో హిందీలో మరో గ్రంథం ప్రచురించారు. పలు సాహిత్య సంస్థల నుండి అవార్డులు-పురస్కారాలు, సన్మానాలు అందుకున్నారు. లక్ష్యం: మనిషి మనసును తాకే రచనలు చేయాలన్నది. **చిరునామా: డాక్టర్ సాగర్ జయ్యాది, ఇంటి నం.20/369, మస్తాన్‌వలి వీధి, కవప-516001, కడప జిల్లా. సంచారవాణి: 98851 59960.**

**సైదా సాహెబ్ షేక్ :** చిత్తూరు జిల్లా పలమనేరు నివాసి. ఉద్యోగం : ఉపాధ్యాయులు. కవి సైదన్నగా విఖ్యాతులు. రచన: శ్రీ శంకరపురా స్వామి పూజా మహిమ (బుర్రకథ).

**సైఫ్ అలీ గోరే సయ్యద్ :** 1978 జనవరి ఒకటిన ఖమ్మం జిల్లా ఖమ్మంలో జననం. తల్లితండ్రులు: హనీఫున్నీసా బేగం, సయ్యద్ సయీద్. చదువు: ఎం.ఏ(లిట్)., డిప్లొమా ఇన్ మల్టీమీడియా. ఉద్యోగం: జర్నలిస్ట్. చిన్ననాటి నుండి కవితలు రాయడం ఆరంభం. వివిధ పత్రికలు, సంకలనాలలో కవితలు, వ్యాసాలు, సమీక్షలు ప్రచురితం. రాష్ట్రంలోని కవులు, రచయితల వివరాలను, నిక్షిప్తం చేసేందుకు www. poetsinda.com వెబ్‌సైట్ ఏర్పాటు చేశారు. లక్ష్యం: ఆలోచింప చేయగల రచలను చేయడం, ప్రోత్సహించడం. **చిరునామా : సయ్యద్ సైఫ్ అలీ గోరే, తండ్రి పేరు సయ్యద్ సయీద్, ఇంటి నం. 7-6-66, పరకంబండ వీధి, ఖమ్మం-507001, ఖమ్మం జిల్లా. సంచారవాణి: 99121 85829**. Email:postsaif@qmail.com



**సాజిదా సికిందర్ :** మహబూబ్‌నగర్ జిల్లా కల్వకుర్తిలో 1967 డిసెంబర్ 12న జననం. తల్లితండ్రులు: జహీరా బేగం, ఎండి. మొయినుద్దీన్. కలంపేరు: సికిందర్. చదువు: బి.ఏ. కవిసమ్మేళనాలకు, ప్రసంగాలకు పరిమితమైన రచనలు 2006లో స్వయంగా









ఆరంభించిన 'మాహి' మాసపత్రికలో తొలిసారిగా చోటు చేసుకున్నాయి. 'కవాతు' కవితా సంకలనంలో (2008) ప్రచురితమైన కవిత 'నీవెవరు?' గుర్తింపు నిచ్చింది. ప్రస్తుతం 'మలుపు' (2009) మాసపత్రికకు సంపాదకత్వం వహిస్తున్నారు. లక్ష్యం: బాధిత ప్రజల పక్షంగా రచనలు-కార్యాచరణ. **చిరునామా: సాజిదా సికిందర్, ఇంటి నం. 1-10-5/27, యస్.యస్ గుట్ట, మహబూబ్‌నగర్ - 509001, మహబూబ్‌నగర్ జిల్లా. సంచారవాణి: 98481 95084.**

**సలాం అబ్దుల్ షేక్ :** గుంటూరు జిల్లా తుమ్మల చెర్వులో షేక్ అబ్దుల్ సలాం 1938లో జన్మించారు. తల్లితండ్రులు: షేక్ మస్తాన్ సాహెబ్, షేక్ సిలార్‌బి. చదువు: ఎం.ఏ., ఎం.ఇడి., ఎల్ఎల్.బి. చిన్నతనం నుండి మేధావిగా పరిగణించబడి (ఆయనను పివి నరసింహారావు సిఫారస్సు మీద) ఢిల్లీలోని అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కళాశాలలో అడ్మిషన్ పొందారు. ఆకస్మికంగా తండ్రి మరణించడంతో అందివచ్చిన అవకాశాన్ని వినియోగించుకోలేక పోయారు. తొలుత రాష్ట్ర హైకోర్టు ఉద్యోగంలో చేరి కొంత కాలం తరువాత స్వస్థలం వచ్చి ఉపాధ్యాయునిగా చేరి ప్రధానోపాధ్యాయునిగా 1972 వరకు పనిచేశారు. మంచి సాహిత్యాభిలాషి. తెలుగు, ఆంగ్ల భాషలలో పట్టుగల వ్యక్తి. రాజకీయాలు ప్రధానాంశంగా 'ఆధునిక భారతం' రచనను తొలుతగా చేశారు. ఆ తరువాత శ్రీశ్రీ సాహిత్యం పట్ల మక్కువ పెంచుకున్న ఆయన 'చలం గారి శ్రీశ్రీ' అను పుస్తకాన్ని ప్రచురించారు. ఆ గ్రంథం ఆయనకు ఎనలేని కీర్తి తెచ్చి పెట్టింది. ఈ గ్రంథాన్ని స్వయంగా 'శ్రీశ్రీ త్రూది ఐస్ ఆఫ్ చలం' పేరుతో ఆంగ్లంలోకి తర్జుమా చేశారు. ఈ రచన తరువాత రాష్ట్రంలోని శ్రీశ్రీ సాహిత్యాభిమానులు, ఆయనను 'పల్నాటి శ్రీశ్రీ' అని ప్రస్తావిస్తూ రావడంతో ఆయన పేరు 'పల్నాటి శ్రీశ్రీ' గా స్థిరపడింది. ఈ పుస్తకాన్ని చదివిన శ్రీశ్రీ ఆయనను ప్రశంసిస్తూ మద్రాసు నుండి 1981 డిసెంబరు 29న ఆంగ్ల దినపత్రిక ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో లేఖ రాశారు. ఆ తరువాత 1982 మే 22న సలాం రచనలను, ఆయన కృషిని కొనియాడుతూ శ్రీశ్రీ స్వయంగా లేఖ రాశారు. ఆంగ్లంలో 'ఐడియాస్ బిహైండ్ యాక్షన్స్' గ్రంథాన్ని వెలువరించారు. డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ తాత్విక భావజాలాన్ని సమీక్షిస్తూ మరో గ్రంథాన్ని వెలువరించారు. చివరిక్షణం వరకు సాహిత్యవ్యాసంగాన్ని కొనసాగిస్తూ, పల్నాడు చరిత్రమీద పరిశోధన చేస్తూ, చరిత్ర ప్రాధాన్యత గల ప్రతి అంశాన్ని పరికిస్తూ, ప్రతి ప్రాంతాన్ని సందర్శిస్తూ అనారోగ్యాన్ని ఏమాత్రం లెక్క చేయకుండా సమాచార



సేకరణలో గడిపారు. ఆ విధంగా సాగిన పరిశోధన పలితంగా 'కన్నెగంటి హనుమంతు', 'పల్నాడు చరిత్ర' అను పరిశోధనాత్మక గ్రంథాలను రచించారు. పల్నాడు మీద అపార ప్రేమాభిమానాలు గల ఆయనను పల్నాడు చరిత్ర విషయంలో 'నడయాడు గ్రంథాలయం'గా పరిశోధకులు పరిగణించేవారు. సోనియా గాంధీ దేశీయత-విదేశీయత మీద ముమ్మరంగా చర్చ జరుగుతున్న సమయంలో 'సోనియా దేశీయత' గ్రంథాన్ని వెలువరించారు. ఈ గ్రంథంలో రాజ్యాంగాన్ని, దేశీ-విదేశీ చట్టాలను ఉటంకిస్తూ ముందుకు తెచ్చిన సాధికారిక వాదన ఫలితంగా 'సోనియా దేశీయత' చిన్న గ్రంథమైనా ప్రామాణికికమైనదిగా పరిగణించబడింది. ఆయన పరిశోధనాంశాలను అందరికి సులభంగా అర్థమయ్యే సరళమైన భాషలో వివరించడం మూలంగా, విద్యార్థులకు మాత్రమే కాకుండా సామాన్య పాఠకులకు, ప్రజలకు కూడా 'సలాం మాష్టారు'గా ఆయన చేరువయ్యారు. పరిశోధన, సాహిత్య కార్యక్రమాల నిర్వాహకులకు వ్యయప్రయాసకోర్చి అన్నివిధాల చేదోడుగా నిలచిన ఆయనను సాహితీమిత్రులు, చరిత్ర పరిశోధకులు 'సాహితీ మహారాజు' అని ప్రేమగా పిలుచుకున్నారు. చివరిక్షణం వరకు రచనా వ్యాసంగాన్ని, పల్నాడు మీద పరిశోధనలను కొనసాగిస్తూ ప్రజలకు, చరిత్ర పరిశోధకులకు, సాహిత్యాభిమానులకు, పాత్రికేయులకు, సాహితీ మిత్రులకు సమాచారపరంగా ప్రయోజనకరంగా నిలచిన షేక్ అబ్దుల్ సలాం గుంటూరు జిల్లా పిడుగురాళ్ళలో 2008 అక్టోబరు 10న కన్నుమూశారు. (సమాచారం: షేక్ అబ్దుల్ సలాం కుమారుడు షేక్ సిలార్, (జర్నలిస్ట్) 22-12-2008, నరసరావుపేట మరియు 'ఇండియా' మాసపత్రిక నవంబర్, 2008)

**సలాం అబ్దుల్ షేక్ :** షేక్ అబ్దుల్ సలాం ప్రకాశం జిల్లా కరేడు గ్రామంలో 1948 జూలై ఒకటిన ఎంఎ.మజీద్, ఖాతూన్‌బీలకు జన్మించారు. బి.కాం చదివిన సలాం రాష్ట్ర ప్రభుత్వ పంచాయితీ రాజ్ ఇంజనీరింగ్ విభాగంలో వర్క్స్ ఇన్స్‌పెక్టర్‌గా ప్రకాశం జిల్లా గుడ్లూరులో పదవీ విరమణ చేశారు. విద్యార్థిగా ప్రతి ఏడాది



కళాశాల మ్యాగజైన్‌లలో కవితలు, వ్యాసాలు నాటికలు రాస్తూ తన రచనావ్యాసంగానికి శ్రీకారం చుట్టారు. 2001లో 'వార్త' దినపత్రికలో 'గురు పూజోత్సవం' శీర్షికతో ప్రచురితమైన కవితతో రచనా ప్రస్థానం ఆరంభమైంది. ఆనాటి నుండి కవిమిత్రుల నుండి లభించిన ప్రోత్సాహంతో షేక్ సలాం రాసిన కవితలు రాష్ట్రంలోని ప్రముఖ తెలుగు పత్రికలలో ప్రచురితం అయ్యాయి, రేడియోల్లో ప్రసారం అయ్యాయి. 'పిఎంకె.ఆర్ట్స్' (ఒంగోలు) సాంస్కృతిక సంస్థ ఆయనను 'కవిమిత్ర' పురస్కారంతో గౌరవించింది. 'మానవత మంట కలుస్తున్న నేటి సామాజిక పరిస్థితుల నుండి బయటపడే విధంగా ప్రజలను చైతన్యవంతుల్ని







చేసే దిశగా కవిత్వం రాయాలన్నది నా లక్ష్యం' అని ప్రకటించిన షేక్ అబ్దుల్ సలాం 2009 నవంబరు 8న కాకినాడలో కన్నుమూశారు. (సమాచారం : షేక్ అబ్దుల్ సలాం సోదరులు ఎం.ఎ. సాలార్, 10-10-2008, వినుకొండ, మరియు ఇండియా మాసపత్రిక, డిసెంబర్ 2009)

**సలీం యం.ఏ :** నల్గొండ జిల్లా నల్గొండలో 1945 జూన్ ఒకటిన జననం. తల్లితండ్రులు:



అమీనా బేగం, ఎం.ఏ రహీం. కలంపేరు: 'దళిత్ సలీం'. చదువు: యం.కాం., యల్‌యల్.బి. ఉద్యోగం: విశ్రాంత అధ్యాపకులు. తెలుగు, ఇంగ్లీషు పత్రికల్లో, సావనీర్‌లలో వ్యాసాలు ప్రచురితం. ఆంగ్లలోని ఉపయుక్త వ్యాసాలను, సమాచారాన్ని తెలుగులో అనువదించి వెలువరించడం పట్ల ఆసక్తి. లక్ష్యం: దళిత-బహుజన, మైనార్టీల ఐక్యత, అభివృద్ధి కోసం రచయిత, వక్తగా నిరంతరం కృషిచేయడం. **చిరునామా : ఎం.ఏ సలీం, ప్లాట్ నం. 405, ఇంటి నం. 14-1-426, ఆగాపురా, హైదరాబాద్-500 001. దూరవాణి : 040-2480 0134.**

**సలీం సయ్యద్ :** ప్రకాశం జిల్లా త్రోవగుంటలో 1961 జూన్ ఒకటిన జననం. తల్లితండ్రులు: అన్వర్ బీ, జాఫరుల్లా సాహెబ్. చదువు: యం.యస్సీ (టెక్). ఉద్యోగం: ఆదాయపన్ను శాఖలో డిప్యూటీ కమీషనర్ (హైదరాబాద్). కలం పేరు: సలీం. ప్రపథమంగా 1980లో రాసిన 'మనిషి' కథ ఆంధ్రభూమిలో ప్రచురితం. అప్పటి నుండి పలు కథలు-



కథానికలు (160), కవితలు (120) వివిధ తెలుగు పత్రికలు, కవితా సంకలనాలలో చోటు చేసుకున్నాయి. ఈ కథలలో కన్నడం (20), హిందీ (10), మరాఠీ (4), ఆంగ్ల (20) భాషల్లో అనువదించబడి ఆయా భాషా పత్రికలలో ప్రచురితం అయ్యాయి. చాలా కవితలు పలు భాషల్లో వెలువడ్డాయి. రచనలు: 1. స్వాతి చినుకులు (1996), 2. నిశ్శబ్ద సంగీతం (1999), 3. రూపాయి చెట్టు (2004), 5. చదరపు ఏనుగు (2006), 6. రాణీగారి కథలు (2008) 7. ఒంటరి శరీరం (2009), కథా సంపుటాలు; 8. నీలోకి చూసిన జ్ఞాపకం (1999), 9. ఆకులు రాలే దృశ్యం (2005), కవితా సంపుటాలు; 10. జీవన స్మృతులు (2001), 11. వెండి మేఘం (2003), 12. కాంచన మృగం (2004), 13. కాలుతున్న పూలతోట (2008), 14. 'ఓషన్ అండ్ అదర్ స్టోరీస్' (ఆంగ్లంలో కథాసంపుటి, 2010). నవలల్లో 'వెండి మేఘం' బహుళ పాఠకాదరణ పొంది హిందీ,

మరాఠి, ఒరియా, మళయాళం, ఆంగ్ల భాషల్లో వెలువడగా 'కాలుతున్న పూలతోట' కూడా హిందీ, మళయాళం, కన్నడం, ఆంగ్లంలో ప్రచురితం అయ్యాయి. పురస్కారాలు-అవార్డులు: పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి 'సాహితీ పురస్కారం' (2005), ధర్మనిధి పురస్కారం (2002). ఉత్తమ నవలా రచయిత గౌరవ పురస్కారం (విశాలాంధ్ర స్వర్ణోత్సవాలు, 2003), భాషా పురస్కారం (అధికారభాషా సంఘం, హైదరాబాద్, 2003), మాడభూషి రంగాచారి స్మారక పురస్కారం (2004), ఢిల్లీ తెలుగు అకాడమీ పురస్కారం (2005), రాష్ట్రీయ వికాస్ శిరోమణి పురస్కారం (ఢిల్లీ, 2005), పులికంటి కథా సాహితీ సత్కృతి (2005) బండారు ఈశ్వరమ్మ అవార్డు (2006), శారదాంబ అవార్డు, రచనా కథా పీఠం అవార్డు, కొవ్వలి సాహితీ పురస్కారం (2009), ఉగాది పురస్కారం (2007), వాసిరెడ్డి సీతాదేవి నవలా పురస్కారం (2007), చాసో కథా పురాస్కారం (2008). జాతీయ -అంతర్జాతీయ స్థాయి 'కథా-నవల' పోటీలలో పలుమార్లు విజేత, పలు బహుమతులు లభ్యం. లక్ష్యం: సమాజాన్ని పట్టి పీడిస్తున్న రుగ్మతల వికృతచేష్టల పట్ల ప్రజలను జాగురూకుల్ని చేయాలన్న చిన్న ప్రయత్నం. **చిరునామా: సయ్యద్ సలీం, ఫ్లాట్ నం.306, జెబి అపార్ట్‌మెంట్స్, దోమలగూడ, హైదరాబాద్-29. సంచారవాణి: 98493 86327.** Email: saleem_652003@yahoo.co.in

**సమద్ ఎస్ ఎ :** కడప జిల్లా నందలూరులో 1935 జూలై 10న జననం. విద్యార్హతలు: ఎం.ఏ. ఉద్యోగం : రాష్ట్ర ఎక్సైజ్ శాఖ. 1982 ప్రాంతంలో చిత్తూరు జిల్లా తిరుపతి నగరంలోని భవాని నగర్ నివాసి. కడప జిల్లాలో చాలా కాలం ఎక్సైజ్ సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌గా బాధ్యతలు నిర్వహించారు. 1982లో హైదరాబాద్‌లో జరిగిన 'ఆంధ్రప్రదేశ్ ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనం' కార్యక్రమం ఆహ్వాన కమిటి కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించడం మాత్రమే కాకుండా ప్రత్యేక సంచిక 'తెలుగు దివ్వెలు' ప్రచురించడంలో ప్రముఖ పాత్ర వహించారు. ఈ ప్రత్యేక సంచికలో ఆయన రాసిన 'ముస్లిం తెలుగు రచయితలు : నేటితరం' అను సవివరణాత్మక వ్యాసం ప్రచురితం. రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న సుమారు 50 మంది ముస్లిం తెలుగు రచయితలు పాల్గొన్న ఈ సమ్మేళనంలో 30 మంది రచయితలు రాసిన వ్యాసాలతో 'తెలుగు దివ్వెలు' రూపొందింది. 1982 మార్చి 20, 21 తేదిలలో రెండు రోజుల పాటు వివిధ సాహిత్య కార్యక్రమాలు, కవితా గోష్ఠులతో సాగిన మొట్టమొదటి కార్యక్రమం కనుక ఆనాటి ముఖ్యమంత్రి భవనం వెంకట్రామ్, మంత్రివర్యులు, అధికార భాషాసంఘం అధ్యక్షులు, ఇతర పెద్దలు ఈ కార్యక్రమంలో పాల్గొని విజయవంతం చేశారు. (సమాచారం: షేక్ అలీ, కావూరు,22-01-2010).









**సమ్దాని హుసేన్ షేక్ :** తూర్పుగోదావరి జిల్లా గోపాలపురంలో 1953 డిసెంబరు మూడున జననం. తల్లితండ్రులు: జహరున్నీసా బేగం, మదీనా షరీఫ్. చదువు: బి.యస్సీ., పిజిడిసియం., పిజిఐఆర్‌పియం. ఉద్యోగం: గియాజుద్దీన్ బాబూఖాన్ ట్రస్ట్ (జిబికె ట్రస్ట్) (హైదరాబాద్). 1980 నుండి వ్యాసాలు రాస్తున్నప్పటికి 2007లో ఉర్దూ నుండి తెలుగులోకి అనువదించిన 'దళిత సమస్య-ఇస్లాం' గ్రంథం గుర్తింపును అందించింది. పత్రికలలో స్వతంత్ర వ్యాసాలు, అనువాద వ్యాసాలు ప్రచురితం. లక్ష్యం: ధర్మ సంస్థాపన. **చిరునామా: షేక్ హుస్సేన్ సమ్దాని, ఇంటి నం.147/3 ఆర్‌టి, విజయనగర్ కాలనీ, హైదరాబాద్-500052. సంచార వాణి: 98665 56836.** Email: shsamdani@rediffmail.com



**సమీవుల్లా ఖాన్ పఠాన్ :** ఖమ్మం జిల్లా కల్లూరులో 1966 మే ఐదున జననం. తల్లి తండ్రులు: సకినాబీ, బహర్ అలీ ఖాన్. చదువు: యం.ఏ (హిందీ)., బి.ఇడి. ఉద్యోగం: ఉపాధ్యాయులు. 1990లో 'గోరి లోని గాఢాంధకారం' ధార్మిక వ్యాసంతో ఆరంభమై వివిధ పత్రి కల్లో వ్యాసాలు, అనువాద వ్యాసాలు, కవితలు, కథానికలు చోటు చేసుకున్నాయి. లక్ష్యం: సత్య సందేశ ప్రచారం. **చిరునామా: పి. సమీవుల్లా ఖాన్, ఇంటి నం. 8-4-347, నిజాం పేట, ఖమ్మం 507001, ఖమ్మం జిల్లా. సంచారవాణి: 94406 54325, 95735 47479**. Email: pskhan@gmail.com



**సర్దార్ బాషా షేక్ :** కృష్ణా జిల్లా నూజివీడులో 1961 ఏప్రిల్ తొమ్మిదిన జననం. తల్లి తండ్రులు: షేక్ సకినాబీ, షేక్ తురాబ్. కలంపేరు: అల్‌ఫతా. చదువు: యస్‌యస్‌సి. ఉద్యోగం: విజయకృష్ణా సూపర్ మార్కెట్, విజయవాడ. 1980లో నాస్తిక మిత్రలో ప్రచురితమైన 'నేను నాస్తికుడ్ని' కవితతో ఆరంభించి వివిధ పత్రికలలో కవితలు, సాహిత్య విమర్శలు చోటుచేసుకున్నాయి. 'మూల్ నివాసి టైమ్స్'లో వచ్చిన 'నేను మూలవాసిని' కవిత, 'అంకుర్' (ఢిల్లీ) పత్రికలో ప్రచురితమైన 'లాల్ జంగ్' (హిందీ కవిత) గుర్తింపు ఇచ్చాయి. లక్ష్యం: సమ సమాజం. **చిరునామా: షేక్ సర్దార్ బాషా (అల్‌ఫతా), ఇంటి నం.41-1/4-4, ద్వారకానగర్, కృష్ణలంక, విజయవాడ-520013. సంచారవాణి: 99856 23693 (పిపి).**



**సర్వర్ ముహమ్మద్ :** కరీంనగర్ జిల్లా ఓదెల మండలం పొత్కపల్లి (ఆర్ఎస్)లో 1948 ఆగస్టు 15న జననం. తల్లితండ్రులు: అఫ్జల్‌బి, ముహమ్మద్ అబ్దుల్ కరీం. కలంపేరు: అబుల్ ఫౌజాన్. చదువు : ఎం.ఏ(ఇస్లామిక్ స్టడీస్)., ఎం.ఏ(ఉర్దూ). ఉద్యోగం : విశ్రాంత రాష్ట్ర ప్రభుత్వ రెవిన్యూ శాఖ అధికారి. 1983లో గీటురాయి వారపత్రికలో 'సమీపిస్తున్న భయంకర సన్నివేశం' వ్యాసం రాయడం ద్వారా రచనా వ్యాసంగం



ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికలలో ధార్మిక, చారిత్రక వ్యాసాలు, కథానికలు ప్రచురితం. ఉర్దూ నుండి తెలుగులోకి, అలాగే తెలుగు నుండి ఉర్దూలోకి కూడా పలు గ్రంథాలను అనువదించారు. స్వతంత్ర రచనలు: 1.మత సామరస్యం ఔరంగజేబు, 2. ముస్లింల సమగ్ర జీవితం; అనువాద గ్రంథాలు: 3. ప్రవక్త సహచరుల సందేశ సరళి, 4. మానవ సభ్యతా సంస్కృతుల పై ఇస్లాం ప్రభావం, 5. ఇస్లాం సుశిక్షణా వ్యవస్థ, 6. బర్జఖ్ (పితృలోకం), 7. లైంగిక సంబంధాలు-ప్రకృతి నియమాలు,8. ఇస్లాం ధ్యేయం ఏమిటి?, 9. వివాహ శుభాకాంక్షలు, 10. దాంపత్య జీవితం విచ్ఛిన్నమైనప్పుడు-ఇస్లాం స్త్రీకిచ్చిందేమిటి?, 11. బాలికల సామూహిక సంహారం, 12. మానవుని ఆర్థిక సమస్య-ఇస్లామీయ పరిష్కారం, 13. మహాప్రవక్తల సందేశ సరళి-మన బాధ్యత, 14. ఇస్లాం పై విమర్శలు-సమాధానాలు, 15. మహనీయ మహమ్మద్ మరియు భారతీయ ధార్మిక గ్రంథాలు (2010), 16. షహీద్ అష్ఫాఖుల్లా ఖాన్ (తెలుగు నుండి ఉర్దూలోకి అనువాదం, 2010). ఈ గ్రంథాలలో 'మత సామరస్యం-ఔరంగజేబు', 'ఇస్లాంలో పరమత సహనం', 'షహీద్ అష్ఫాఖుల్లా ఖాన్' గుర్తింపు తెచ్చి పెట్టాయి. లక్ష్యం : భారతీయులందర్ని సర్వమానవ సౌభ్రాతృత్వ పునాదుల మీద ఏకీకృతం చేయడం. **చిరునామా : ముహమ్మద్ సర్వర్, ఇంటి. నం. 7-2-1038, కశ్మీర్ గడ్డ లోకాలిటీ, మంకమ్మతోట, కరీంనగర్-505001, సంచారవాణి: 99638 67432.**

**సత్యాగ్ని హుస్సేన్ :** కడప జిల్లా రాయలపంతుల పల్లెలో 1943 జూన్ ఒకటిన జననం. తల్లితండ్రులు: షేక్ బషీరా బీ, షేక్ ఇమాం సాహెబ్. తల్లితండ్రులు పెట్టిన పేరు షేక్ హుస్సేన్ కాగా సాహిత్య గురువు పుట్టపర్తి నారాయణచార్యులు పెట్టిన కలం పేరు 'సత్యాగ్ని హుస్సేన్' అసలు పేరుగా స్థిరపడింది. చదువు: బి.ఏ. వృత్తి: జర్నలిజం-రాజకీయాలు (ప్రస్తుతం రాష్ట్ర శాసనమండలి సభ్యులు). ఉన్నత పాఠశాల విద్యార్థిగా కవిత్వం-నాటకరంగం మీద ప్రత్యేక ఆసక్తి. స్వయంగా నాటికలు రచించి, నటించి ప్రదర్శించి ఉత్తమ









నాటక రచయిత, నటుడిగా బహుమతులు అందుకున్నారు. 1968-70 వరకు వెలువడిన 'చక్రవర్తి' (సామాజిక-సాంస్కృతిక పక్షపత్రిక) సంపాదకునిగా వ్యవహరించారు. జర్నలిస్టుగా, కవి-రచయితగా రాష్ట్రంలోని వివిధ పత్రికలలో వ్యాసాలు, కథలు, కవితలు, కథానికలు చోటు చేసుకున్నాయి. నాటికలు-నాటకాలు రాయడం, నటించడం-ప్రదర్శించడం మాత్రమే కాకుండా చలనచిత్ర రంగంలో కూడా పలు చిత్రాలకు అసోసియేట్-అసిస్టెంట్ డైరక్టర్‌గా వ్యవహరించారు. రచనలు: 1. భగ్న వీణ (గేయ కావ్యం, 1965), 2. అగ్ని సరస్సు (కథా సంపుటి, 1987), 3. పాచికలు (కథా సంపుటి, 1988), 4. మజ్నూషా (చారిత్రక నాటకం, 1990), 5. సత్యాగ్ని గీతాలు (2000). ఈ గ్రంథాలలో దళిత ప్రజానీకం వెతలను వివరిస్తూ రాసిన 'అగ్ని సరస్సు' కవితా సంపుటి, ముస్లిం మహిళల మనస్సును, వేదనలను వెల్లడిస్తూ రాసిన 'పాచికలు', బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో శిఖరాయమానంగా చెప్పుకోదగ్గ 'ఫకీర్లు -సన్యాసుల' ప్రజాపోరాటానికి నాయకత్వం వహించిన వారిలో అగ్రగణ్యుడు, ఫకీర్ల మహానాయకుడు 'మజ్నూషా ఫకీర్' పోరాట జీవితాన్ని 'మజ్నూషా' పేరిట 1990లో రాసిన చారిత్రక నాటకం గుర్తింపును తెచ్చిపెట్టాయి. మంచి నటుడిగా ఖ్యాతిగడించిన సత్యాగ్ని హుస్సేన్ 'మజ్నూషా' చారిత్రక నాటకాన్ని రచించడం మాత్రమే కాకుండా మజ్నూషా పాత్రను స్వయంగా పోషించి రాష్ట్రంలో ప్రదర్శనలు ఇచ్చారు. ఈ నాటిక ఆకాశవాణిలో కూడా పలు ప్రసారాలకు నోచుకోగా అది కాస్తా బాగా ప్రాచుర్యం పొందిన కారణంగా 2007లో 'మజ్నూషా' పునర్ముద్రణయ్యింది. సాహితీ-సాంస్కృతిక సంస్థలను ఏర్పాటు చేసి కవులు -రచయితలను అన్నివిధాలుగా ప్రోత్సహిస్తున్నారు. లక్ష్యం: ప్రజలను చైతన్యవంతుల్ని చేయడం. **చిరునామా : షేక్ హుస్సేన్, ఇంటి నం. 7-1-34, ఎన్‌జీవో కాలనీ, కడప-516001, కడప జిల్లా. సంచారవాణి: 094404 11877.**

**సత్తార్ షేక్ :** నెల్లూరు జిల్లా అనంతసాగరంలో 1968 మే ఆరున జననం. తల్లితండ్రులు: షేక్ సిలార్ బి, షేక్ దస్తగిరి సాహెబ్. చదువు: బి.ఏ. వృత్తి: వైద్యం. 1984 నుండి రాస్తున్నా 2002 ఏప్రిల్ 18 'వార్త' దినపత్రికలో ప్రచురితమైన 'నా రాజ్యం తప్పిపోయింది' కవితతో మంచి ప్రాచ్యుర్యం లభించింది. అప్పటి నుండి రాష్ట్రంలోని వివిధ పత్రికలలో, కవితా సంకలనాలలో పలు కవితలు చోటు చేసుకున్నాయి. ఈ కవితల్లో 'తాళి తెంచినోడ నీకు ఆలి ఎక్కడుందిరా? ప్రముఖుల, ప్రశంసలు అందుకుంది. లక్ష్యం: సమసమాజ స్థాపన ధ్యేయంగా ప్రజలను రచనల ద్వారా చైతన్యవంతుల్ని చేయడం. **చిరునామా: షేక్ సత్తార్, చాణుక్యపురి, ఎకె నగర్ (పోస్టు), నెల్లూరు-524004, నెల్లూరు జిల్లా. సంచారవాణి: 94414 42932.**



**షఫీ అహమ్మద్ ముహమ్మద్** : ఖమ్మం జిల్లా చంద్రగొండలో 1967 నవంబరు 22న జననం. తల్లితండ్రులు: ఆశియా బేగం, ముహమ్మద్ మౌలానా. కలంపేరు: యం.డి సైఫుల్లా. చదువు: బిఎస్సీ. వృత్తి: జర్నలిజం (వార్త దినపత్రిక, విజయవాడ). 1988లో 'గీటురాయి' వార పత్రికలో వ్యాసం ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలలో, కవితా సంకలనాలల్లో కవితలు, వ్యాసాలు, సమీక్షా వ్యాసాలు, చోటు చేసుకున్నాయి. రచనలు: ఆంధ్రప్రదేశ్‌లో ముస్లిం రిజర్వేషన్లు (2005). ఈ గ్రంథం మంచి ప్రాచుర్యాన్ని తెచ్చి పెట్టింది. లక్ష్యం: ఇస్లామీయ మార్గాన సమాజ చైతన్యం, సర్వతోముఖాభివృద్ధి. **చిరునామా: యం.డి షఫీ అహమ్మద్, ఇంటి నం. 40-1-172, లబ్బీపేట, హుసైనీ స్ట్రీట్, విజయవాడ-10, కృష్ణా జిల్లా. సంచారవాణి: 99484 61699, 93964 29916**. Email: news.shafi@gmail.com.



**షహానాజ్ బేగం** : వరంగల్ జిల్లా హన్మకొండలో 1976 జూన్ 26న జననం. తల్లితండ్రులు: చాంద్ సుల్తానా, ఇక్బాల్ మొయినుద్దీన్. కలంపేరు: వెన్నెల. చదువు: బిఎస్సీ. 1997లో 'తాడు బొంగరం లేని జీవితం' వ్యాసం 'గీటురాయి' వారపత్రికలో ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికల్లో వ్యాసాలు చోటు చేసుకున్నాయి. లక్ష్యం: సత్య సందేశ పరిచయం. **చిరునామా: షహానాజ్ బేగం, ఇంటి నం.14-4-74, మండి బజార్, వరంగల్, వరంగల్ జిల్లా. సంచారవాణి: 99089 53499.**



**షెహనాజ్ బేగం పఠాన్** : అనంతపురం జిల్లా అనంతపురంలో 1953 జూలై రెండున జననం. తల్లితండ్రులు: ఖుర్షీద్, ఎం.ఏ అజీజ్ ఖాన్. కలంపేరు: షెహనాజ్. చదువు: బి.ఏ. వృత్తి: రాజకీయాలు (ప్రస్తుతం అనంతపురం మున్సిపల్ కార్పోరేషన్ కార్పొరేటర్). తెలుగు, ఉర్దూ భాషల్లో ప్రవేశం. ఉన్నత పాఠశాల విద్యార్థిగా కథలను అల్లి చెప్పడం ఆరంభించగా 1981లో ఆంధ్రభూమి వారపత్రికలో 'త్యాగం' శీర్షికన కథ ప్రచురితమైనప్పటి నుండి ఇప్పటివరకు పలు పత్రికల్లో, కథా సంకలనాల్లో రెండు వందలకు పైగా కథలు, కథానికలు చోటుచేసుకున్నాయి. ఈ కథలలో 'రెండు దారులు', 'ఇదెక్కడి న్యాయం', 'మబ్బుచాటు నక్షత్రం', 'అమ్మ సమాధి', కథలు ప్రాచుర్యాన్ని తెచ్చిపెట్టాయి. పలు కథలు కన్నడం, ఉర్దూ భాషల్లోకి అనువదించిబడి ఆయా









బాషా పత్రికల్లో ప్రచురితం అయ్యాయి. ఉర్దూలోకి తర్జుమా చేసిన పలు తెలుగు కథలు ప్రముఖ ఉర్దూ పత్రికలలో వెలువడ్డాయి. రచనలు : 1. మౌన పోరాటం (నవలిక, 1991), 2. అనుమానం కాటేసిన వేళ (కథా సంపుటి, 1997), 3. శేషప్రశ్న (కథా సంపుటి,2004). అవార్డులు-పురస్కారాలు: బీనాదేవి రాష్ట్రస్థాయి అవార్డు (అనంత కళాపీఠం, 1991), అనంత ఆణిముత్యం అవార్డు (పెనుగొండ, 2000), వాసిరెడ్డి ధర్మనిధి పురస్కారం (పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం, 2006). లక్ష్యం: మంచి కథలు రాయాలని. **చిరునామా : పఠాన్ షెహనాజ్, ఇంటి నం. 27, స్టేట్ బ్యాంక్ కాలనీ, అనంతపురం-515001, అనంతపురం జిల్లా. సంచారవాణి: 93462 63070, 98492 29786.**

**షహనాజ్ బేగం షేక్** : నల్గొండ జిల్లా కోదాడలో 1975 జూలై ఐదున జననం. తల్లితండ్రులు: మహమూదా బేగం, అబ్దుల్ మియా. చదువు: బి.ఏ., హిందీ పండిట్. వృత్తి : జర్నలిజం. 1995 నుండి రాసిన పలు కవితలు, వ్యాసాలు, కథలు వివిధ పత్రికల్లో, అలాగే వివిధ కవితా సంకలనాల్లో ప్రచురితం. ముస్లిం మహిళలు ధరిస్తున్న పర్దా మీద వస్తున్న విమర్శల నేపథ్యంలో రాసిన 'నేనొక్కత్తినే' కవిత, ఆంధ్రజ్యోతిలో ప్రచురితమైన 'గుడియా' లాంటి కవితలు వివిధ పత్రికలకు రాస్తున్న పలు కథనాలు, సాహిత్య-సమీక్షా వ్యాసాలు, నిర్వహిస్తున్న రెగ్యులర్ ఫీచర్స్ కాలమ్స్ గుర్తింపు తెచ్చిపెట్టాయి. లక్ష్యం: సత్యాన్ని సత్యంగా ప్రజలు-పాఠకుల ఎదుట ఉంచడం. **చిరునామా: షేక్ షహనాజ్, ఇంటి నం. 3-7-255, మన్సూరాబాద్, ఎల్బీనగర్ మున్సిపాలిటీ, హైదరాబాద్-68, రంగారెడ్డి జిల్లా. సంచారవాణి: 92462 13493**. Email: sahayaa@in.co



**షహనాజ్ ఫాతిమా** : కరీంనగర్ జిల్లాలో సిరిసిల్లాలో 1965 నవంబర్ 23న జననం. తల్లితండ్రులు : జులేఖా, ఖాజా బద్రుద్దీన్. చదువు: బియస్సీ,, విద్వాన్., టిటిసి. ఉద్యోగం: ఉపాధ్యాయురాలు. 1979లో 'ప్రభవ' మాసపత్రికలో 'రానిఊహలు'శీర్షికన తొలి కవిత రాసినప్పటి నుండి వివిధ సంకలనాల్లో, పత్రికల్లో చోటుచేసుకున్నాయి. ఆమె రాసిన 'కరీంనగర్ జిల్లాలో మహిళా సాధికారత' పరిశోధనా వ్యాసం మంచి గుర్తింపు తెచ్చిపెట్టింది. కవితలలో 'ఔరత్', 'ఆత్మాభిమానం', 'నా వూరు' కవితలు ప్రముఖుల ప్రశంసలు అందుకున్నాయి. రచనలు: 1. కెరటాలు (కవితా సంకలనం, 2004), 2. మౌన శబ్దాలు (నానీలు, 2006), 3. చెలిమ (కవితా సంకలనం, 2007). పురస్కారాలు: మహిళా దినోత్సవ పురస్కారం (కరీంనగర్ 2006),



మానేరు టైమ్స్ పురస్కారం (2006), అప్టా సత్కారం (2006). లక్ష్యం: సత్సమాజ నిర్మాణంలో పాల్గొనడం. సత్సాహిత్యాన్ని ప్రజలకు అందించడం. **చిరునామా: షహనాజ్ ఫాతిమా, ఇంటి నం. ఎ-99, ఎల్.ఎం.డి కాలనీ-505527, తిమ్మాపూర్ మండలం, కరీంనగర్ జిల్లా. సంచారవాణి: 94403 70137**

**షాజహానా :** ఖమ్మం జిల్లా పాల్వంచలో 1974 జూన్ 14న జన్మించారు. తల్లితండ్రులు: యాకూబీ, డాక్టర్ దిలావర్. చదువు: ఎం.ఏ (తెలుగు)., ఎంఫిల్. 'తెలుగులో ముస్లింవాద సాహిత్యం-ఒక పరిశీలన' అను అంశం మీద పరిశోధన చేస్తున్నారు. 2004లో 'వతన్' ముస్లిం కథల పుస్తకాన్ని వెలువరించారు. 2005లో స్వీయ కవితా సంకలనం 'నఖాబ్' ప్రచురించారు. 2006లో 'అలవా' కవితా సంకలనాన్ని, 2009 మిని కవితలతో 'చాంద్ తారా' అను శీర్షికన చిరు పుస్తకాన్ని కవి స్కైబాబతో కలసి తెచ్చారు. రంగవల్లి స్మారక సాహిత్య పురస్కారం, సంస్కృతి అవార్డు (న్యూఢిల్లీ) లభించాయి. నేషనల్ బుక్ ట్రస్ట్ ప్రత్యేక ఆహ్వానం మీద జర్మనీలో జరిగిన సాహిత్య సదస్సులో పాల్గొన్నారు. పలు కవితలు హిందీ, ఇంగ్లీష్, జర్మనీ భాషలలో అనువదించబడి ఆయా భాషా పత్రికలలో, సంకనాల్లో చోటు చేసుకున్నాయి. 2009లో రష్యాలో జరిగిన అంతర్జాతీయ సాహిత్యసదస్సులో పాల్గొన్నారు. **చిరునామా: షాజహాన, ఇంటి నం.6-3-609/1/ఏ, ఆనందనగర్ కాలనీ, ఖైరతాబాద్, హైదరాబాద్-5000 004, సంచారవాణి: 98854 20027, 99859 21379.**

**షమీం షేక్ :** కడప జిల్లా బలపనూరులో 1982 జూలై 31న జననం. తల్లితండ్రులు: షేక్ హజిరాం బీ, షేక్ దస్తగిరి సాహెబ్. కలం పేరు: షమీం. చదువు: ఎమెస్సీ (బయో టెక్నాలజీ), ఎమ్మెస్సీ (బయో ఇన్‌ఫర్ మ్యాటిక్స్). గత రెండు సంవత్సరాలుగా తాను రాసిన కవితలను అక్షర బద్దం చేసి తొలిసారిగా 'ప్రేమ కెరటాలు' కవితా సంపుటిని 2009లో వెలువరించారు. **చిరునామా: షేక్ షమీం, పోస్టు బాక్స్ నం.001, సింహాద్రిపురం (పోస్టు)-516 484, కడప జిల్లా.**

**షమీవుల్లా షేక్ డాక్టర్ :** అనంతపురం జిల్లా హిందూపురంలో 1972 జూన్ ఐదున జననం. తల్లితండ్రులు: షేక్ మెహరూన్, షేక్ అమీర్ జాన్. కలం పేరు: షమీవుల్లా. చదువు: యం.ఏ., పిహెచ్.డి., టిపిటి. వృత్తి : అధ్యాపకులు. విద్యార్థిగా కవిత్వం రాయడం ఆరంభించగా 1989లో తొలికవిత 'జ్ఞాపకం' ప్రచురితం అయ్యింది. అప్పటి నుండి వివిధ పత్రికల్లో, వివిధ కవితా సంకలనాలల్లో కవితలు, సాహిత్య విమర్శనా వ్యాసాలు చోటు చేసుకున్నాయి. ఆకాశవాణిలో పలు కవితలు, సాహిత్య వ్యాసాలు ప్రసారం కాగా









కొన్ని కవితలు ఇతర భాషల్లోకి తర్జుమా అయ్యి ఆయా భాషా పత్రికల్లో ప్రచురితమయ్యాయి. 'మైనార్టీ కవిత్వం-తాత్విక నేపథ్యం' శీర్షికతో 2005లో గ్రంథం వెలువడింది. రచనలు: 1.మైనార్టీ కవిత్వం-తాత్విక నేపథ్యం (1986 నుండి 98 దాకా వచ్చిన మైనార్టీ కవిత్వాన్ని విశ్లేషించి తాత్విక నేపథ్యాన్ని అంచనా వేసిన సిద్ధాంత గ్రంథం, 2005), 2. సుభాషిత ప్రభాసం (2008), 3. సూర్యోదయానంతరం (కవితా సంపుటి, 2010). అవార్డులు-పురస్కారాలు: రంజనీ-కుందుర్తి అవార్డు (హైదరాబాద్), కళాప్రపూర్ణ డాక్టర్ చిలుకూరి నారాయణ స్మారక అవార్డు (1996, అనంతపురం), ఆచార్య తూమాటి దోణప్ప పలనాడు పరిశోధన బంగారు పతకం (2002, అనంతపురం) ఉత్తమ కవి అవార్డు (2007, హిందూపురం). లక్ష్యం: సాహిత్యం ద్వారా సామాజిక చైతన్యం. **చిరునామా: డాక్టర్ షేక్ షమీవుల్లా, ఇంటి నం.26-4-319, త్యాగరాజ నగర్, హిందూపురం-515201, అనంతపురం జిల్లా. సంచారవాణి: 94411 78415.**

**షంషేర్ అహ్మద్ షేక్ :** ప్రకాశం జిల్లా కురిచేడులో 1952 జూన్ 17న జననం. తల్లి తండ్రులు: మహబూబీ, షేక్ చత్తుమియా సాహెబ్. చదువు: ఎం.ఏ., గాంధియన్ ఎకనమిక్స్‌లో డిప్లొమా. ఉద్యోగం: రాష్ట్ర రెవిన్యూ శాఖలో 'అడిషనల్ జాయింట్ కలక్టర్' (కృష్ణాజిల్లా). విద్యార్థి దశ నుండి కవిత్వం పట్ల ఆసక్తి చూపినా 1969లో విశాలాంధ్ర దినపత్రికలో 'కార్మిక కిరీటి' కవిత ప్రచురితమైంది. అప్పటినుండి రాసిన పలు కవితలు, గీతాలు, వ్యాసాలు వివిధ పత్రికల్లో, కవితా సంకలనాల్లో చోటు చేసుకున్నాయి. ఆయన



రాసిన గీతాల్లో 'జలక్రాంతి', 'అక్షర సంక్రాంతి', 'చింతలో నిశ్చింత' ప్రబోధ గీతాల క్యాసెట్టుగా, 'షిర్డిసాయి సంకీర్తన మాల' భక్తిమాల క్యాసెట్‌గా విడుదల అయ్యాయి. కవితల్లో 'గాలిగాడు', 'రక్తాన్ని కొలవకు', 'వికలాంతరంగులు' కవితలు గుర్తింపు తెచ్చి పెట్టాయి. పలు కవితలు ఇతర భాషల్లోకి అనువదించబడి ఆయా భాషా పత్రికల్లో ప్రచురితం రచనలు: 1. కెంపు గుండె (కవితా సంపుటి, 2005), 2. గానుగెద్దు రంకె (2007), 3. సచార కమిటీ నివేదిక-ఒక పరిశీలన (2008). పలు సాహిత్య- సాంస్కృతిక సంస్థల ద్వారా సన్మానాలు-సత్కారాలు అందుకున్నారు. అవార్డులు-పురస్కారాలు: తెలుగు భాషా పురస్కారం (రాష్ట్ర అధికార భాషా సంఘం, 2009, హైదరాబాద్). లక్ష్యం: తెలుగు అధికార భాషగా సామాన్య ప్రజలకు చేరువయ్యేలా చేయాలన్నది. **చిరునామా: షేక్ షంషీర్ అహమ్మద్, ఇంటి నం.6-260(6), మారుతీ నగర్, 2వ లైను, ఒంగోలు-523002, ప్రకాశం జిల్లా. సంచారవాణి: 9490409966.**

**షంషుద్దీన్ ముహమ్మద్ :** ఖమ్మం జిల్లా ఖమ్మం జన్మస్థలం. తల్లి తండ్రులు: లాల్‌బీ, మహబూబ్ అలీ. కలంపేరు: కౌముది. చదువు: సాహిత్యరత్న (హిందీ). ఉద్యోగం: హిందీ పండితులు. రచనలు: జ్వాలాపథం, సమాంతర రేఖలు, అమృత పథం, నల్ల బంగారం, కళంకిని, విజయ, రంగభూమి, ధన వంచిత, స్వేచ్ఛాపథం, అసిధారా, ఇంకా పలు సాహిత్య-సమీక్షా వ్యాసాలు, విమర్శలు, కవితలు ప్రచురితమయ్యాయి.

**షంషుద్దీన్ షేక్ :** నెల్లూరు జిల్లా కలిచేడులో 1973 జూలై ఐదున జననం. తల్లితండ్రులు: షేక్ జైబున్నీసా, షేక్ దాదా సాహెబ్. కలంపేరు: సూర్య షంషుద్దీన్. చదువు: బి.ఏ (మ్యాథ్స్)., డి.ఇ.ఇ.ఇ. వృత్తి: ఉపాధ్యాయులు. తొలిసారిగా 2009లో 'ఎదురు చూపు' కవిత ప్రచురితం కావడంతో రచనా వ్యాసంగం ఆరంభమై అప్పటి నుండి వివిధ పత్రికలలో కవితలు, కథలు, వ్యాసాలు, వ్యంగ చిత్రాలు చోటు చేసుకున్నాయి. లక్ష్యం: సామాజిక రుగ్మతల నుండి సమాజానికి విముక్తి కల్గించేందుకు ప్రజలను చైతన్య వంతుల్ని చేయడం. **చిరునామా: షేక్ షంషుద్దీన్, ఇంటి నం. 25/940, భక్తవత్సల నగర్, ఎన్.జీ.వో కాలనీ, ఏకె నగర్ (పోస్టు), నెల్లూరు-4, నెల్లూరు జిల్లా. సంచారవాణి: 92488 01257.** Email: suryaschoolnellore @gmail.com.



**షరీఫా షేక్ :** కృష్ణా జిల్లా మచిలీపట్నంలో 1964 అక్టోబర్ ఒకటిన జననం. తల్లితండ్రులు: మస్తాన్ బీ, మస్తాన్ సాహెబ్. కలంపేరు: వెన్నెల. చదువు: ఎం.ఏ. వృత్తి: ఉపాధ్యాయురాలు. 2001లో 'ఇస్లాంలో స్త్రీ స్థానం' ధార్మిక వ్యాసం 'గీటురాయి' వారపత్రికలో ప్రచురితం. అప్పటి నుండి వివిధ పత్రికల్లో ప్రధానంగా ధార్మిక వ్యాసాలు, కథానికలు చోటు చేసుకున్నాయి. లక్ష్యం: ఇస్లాం సందేశాన్ని ప్రజలకు అందజేయడం. **చిరునామా: షేక్ షరీఫా, 39-3-19/3, మసీదు వీధి, లబ్బీపేట, బందర్ రోడ్, విజయవాడ-10, కృష్ణా జిల్లా. సంచారవాణి: 94909 88786.**



**షరీఫ్ మహమ్మద్ షేక్ :** కడప జిల్లా వేంపల్లిలో 1980 ఏప్రిల్ 18న జననం. తల్లి తండ్రులు: నూర్జహాన్, షేక్ రాజా సాహెబ్. కలంపేరు: వేంపల్లి షరీఫ్. ఎస్.యమ్.డి షరీఫ్. చదువు: బి.ఏ., బిపిఆర్., ఎంసిజె., ఎంఫిల్. ఉద్యోగం: సాక్షి టీవి (హైదరాబాద్). 1999లో వార్తలో రాసిన 'పరిశీలన' కథతో ఆరంభమై వివిధ పత్రికలు, కవితా-కథా సంకలనాల్లో కథలు, కథానికలు, బాల సాహిత్య కథలు చోటు చేసుకున్నాయి. ఆ కథల్లో









'జీపొచ్చింది', 'రజాక్ మియా సేద్యం', 'పలక-పండగ', 'జుమ్మా' కథలు గుర్తింపు తెచ్చాయి. 'జుమ్మా' కథ (2007 మే, ఆదివారం ఆంధ్రజ్యోతి) ఆంగ్ల, హిందీ, మైథిలీ భాషా పత్రికలలో ప్రచురితమై జాతీయ స్థాయిలో అత్యుత్తమ ప్రాంతీయ కథల సరసన చేరింది. అఖిల భారత స్థాయిలో 'మ్యూజ్ ఇండియా' వెబ్‌సైట్ నిర్వహించిన ప్రాంతీయ అనువాద కథల పోటీలలో 'జుమ్మా'కు ప్రత్యేక గుర్తింపు లభించింది. లక్ష్యం: పది మంది పది కాలాలపాటు గుర్తుంచుకునే కథలు రాయడం. **చిరునామా : షేక్ మహమ్మద్ షరీఫ్, ఇంటి నం.13/303-ఇ4, గండిరోడ్డు, వేంపల్లె-516329, కడప జిల్లా. సంచారవాణి: 90102 14996.** Email: shariffvempalli@gmail.com.

**షరీఫ్ సాలార్ ఎం. :** తూర్పు గోదావరి జిల్లా కాకినాడలో 1938 జూలై ఐదున జన్మించారు. తల్లితండ్రులు: అమ్మాజీ, మహమ్మద్ హైస్సేన్, చదువు: ఎస్.ఎల్.సి. రాష్ట్ర ప్రభుత్వ సర్వే అండ్ లాండ్ రెవిన్యూ శాఖలో సర్వేయర్‌గా పనిచేసి, 1996లో ఉద్యోగ విరమణ చేశారు. ఆయన సోదరులు అహమ్మద్ అలీ (కాకినాడ) వెలువరించిన ఆధ్యాత్మిక ఆంగ్ల గ్రంథాలను తెలుగులోకి అనువదించారు. అనువాదాలు: 1.సిలువే శరణ్యమా? 2.గీతా ప్రామాణిక వాస్తవాలు-ఖుర్అన్ దృక్కోణం, 3. పౌలు వాస్తవికత, 4. ఆ ప్రవక్త 5. మేధావుల సందేశాలకు సమాధానాలు. ఈ మేరకు పలు గ్రంథాలను అందించిన మహమ్మద్ సాలార్ షరీఫ్ 2006 డిసెంబరు 12న కాకినాడలో కన్నుమూశారు.

**షాజిక్ మౌల్వీ :** 1938 జూలై నాటి 'భారతి' లో 'ప్రాచీన అరబ్ నివాసులు హిందువులా?' వ్యాసం ప్రచురితం అయ్యింది.

**షిరాజ్ ఖాన్ ఎం.ఏ.కె :** 1942 అక్టోబర్ 12న నెల్లూరు జిల్లా గూడూరులో హబీబ్ ఖాన్, గౌసున్నీసాలకు జన్మించారు. అధ్యాపకులైన షిరాజ్ ఖాన్ 1963 నుండి నాటికలు-నాటకాలు రాయడం ఆరంభించారు. ఆ క్రమంలో నిరంతరం రచనా వ్యాసంగాన్ని కొనసాగించిన ఆయన రచనలు రాష్ట్రంలోని పలు పత్రికలో ప్రచురితం. ఆంగ్లం నుండి తెలుగులోకి, తెలుగు నుండి ఆంగ్లంలోకి పలు గ్రంథాలను తర్జుమా చేశారు. 1982లో తొలిసారిగా 'శాంతి-ఓ-శాంతి' శీర్షికతో రాసిన వ్యాసాలు గీటురాయి వారపత్రికలలో ప్రచురితం అయ్యాయి. ఆ తరువాత గీటురాయిలో ధారావాహికంగా ప్రచురితమైన 'విశ్వసించిన వారే', 'ప్రళయం' వ్యాసాలు ఆయనకు ఖ్యాతి తెచ్చిపెట్టాయి.



ప్రముఖ రచయిత డాక్టర్ బాగిల్ రాసిన 'డైలాగ్' (ఒక క్రైస్తవునికి ముస్లింలకు మధ్యన జరిగిన సంవాదం) ను తెలుగులోకి అనువాదం చేసి ప్రచురించారు. ఇస్లాం ధర్మం మీద వస్తున్న విమర్శలకు సమాధానంగా 2007లో 'పాపం-పరిహారం-రక్షణ' అను పరిశోధనాత్మక గ్రంథాన్ని స్వయంగా వెలువరించారు. 'సాదృశ్య మతధర్మాల సమీక్ష పై గ్రంథాలు ప్రచురించడం, సామాజిక, నైతిక, ధార్మిక, మానసిక రుగ్మతలకు సంబంధించిన సమస్యల మీద ధార్మికపరంగా పరిష్కారాలు సూచిస్తూ గ్రంథాలు రాయడం' తన ప్రధాన లక్ష్యమని ప్రకటించిన షిరాజ్ ఖాన్ 2009 ఆగస్టు 15న నెల్లూరులో కన్నుమూశారు. (సమాచారం : ఎం.ఏ.కె షిరాజ్ ఖాన్‌తో ఇంటర్వ్యూ : 15-12-2008, నెల్లూరు)

**సిద్దయ్య కవి ఎస్. :** గుంటూరు జిల్లా తెనాలి తాలూకా అంగలకుదురు గ్రామంలో 1929 సెప్టెంబరు 29న జన్మించారు. చిన్నవయస్సులోనే మంచి విద్వత్తును ప్రదర్శించిన ఆయన చాలా కాలం చిలకలూరిపేటలో ఉన్నారు. చివరకు బిడ్డల ఉద్యోగాలరీత్యా నెల్లూరు వెళ్ళారు. స్వయంగా మంచి గాయకుడు. పలు సన్మానాలు, సత్కారాలను అందుకున్నారు. శ్రావ్యమైన కంఠతో పద్యగానం చేయడంలో సుప్రసిద్ధులుగా ప్రజాభిమానం పొందారు. పలు గ్రంథాలను ప్రచురించారు. ఎక్కడ ఉన్నా తనదైన ముద్రతో సాహిత్య సౌరభాలను పంచుతూ కవిగా ప్రఖ్యాతిగాంచారు. రచనలు: అమరసింహుడు (పద్య కావ్యం,1964), బుద్ధ హృదయము (పద్యకావ్యము,1967), పతంగిని, రెడ్డిప్రభ, సుధీర, విజ్ఞాన భాస్కరం గ్రంథాలను వెలువరించారు.



**సికిందర్ :** పశ్చిమగోదావరి జిల్లా భీమవరంలో 1964 డిసెంబర్ ఏడున జననం. తల్లితండ్రులు: షానవాజ్ బేగం, యం.వై మొహిద్దీన్. అసలు పేరు : యం.బి మొహిద్దీన్. కలంపేరు: సికిందర్. చదువు: బిఎస్సీ. వృత్తి: రచయిత-పాత్రికేయులు. 1980లో అపరాధ పరిశోధన మాసపత్రికలో ఒక డిటెక్టివ్ కథ రాయడం ద్వారా రచనా రంగ ప్రవేశం. అప్పటి నుండి అపరాధపరిశోధన మాసపత్రికతో పాటుగా వివిధ పత్రికలలో కథలు, కవితలు, నవలలు, సీరియల్స్ ప్రచురితం అయ్యాయి. 'నైటింగేల్ ఎట్ మాస్క్' కవిత గుర్తింపు తెచ్చి పెట్టింది. 'ఆంధ్రభూమి' దినపత్రిక, 'ఈవారం' వారపత్రిక, 'సాక్షి' దినపత్రికల్లో ప్రస్తుతం పలు శీర్షికలు నిర్వహిస్తున్నారు. 'ఈటీవి'లో వచ్చిన 'మార్గదర్శి' ప్రోగ్రాంలో హిందీ చలన చిత్ర నటుడు









అమితాబచ్చన్ కోసం రెండు ఎపిసోడ్లకు స్క్రిప్ట్ సమకూర్చారు. అమెరికా పెళ్ళి సంబంధాలు ప్రధానాంశంగా రాసిన నాటకం 'హెన్ కౌంటర్' రాష్ట్రంలో పలు ప్రదర్శనలకు నోచుకుంది. రచనలు: 1.కుట్ర (నవల), 2.కుతంత్రం (నవల). లక్ష్యం: అందిపుచ్చుకున్న విజ్ఞానాన్ని పది మందితో పంచుకోవడం. **చిరునామా: సికిందర్, ఇంటి నం. డి-12, సౌత్ ఎండ్ పార్క్, ఎల్.బి నగర్, జి.ఎస్.ఐ పోస్టు, హైదరాబాద్-060. సంచారవాణి: 92473 47511.**
Email: sikanderwrites@rediffmail.com

**సికిందర్ వి. :** చిత్తూరు జిల్లా తిరుపతి నివాసి. వృత్తి : పాత్రికేయులు. వివిధ పత్రికలలో కవితలు, గేయాలు, వ్యాసాలు, మిని కథలు ప్రచురితం. చిత్తూరు నుండి వెలువడిన 'తెలుగు తేట' వారపత్రిక సంపాదకులుగా వ్యవహరించారు.

**సిలార్ సాహెబ్ షేక్ :** ప్రకాశం జిల్లా కంబం శివారు మిట్టమీద పల్లె స్వగ్రామం. 1954లో 'మేఘ సందేశం' అను గ్రంథాన్ని వెలువరించారు.

**సిలార్ వై ఎస్ :** కడప జిల్లా మద్రి మండలం శ్రీనివాసపురం జన్మస్థలం. తల్లితండ్రులు: మహబూబీ, ఎల్లటూరు పెద్ద సిద్దప్ప. రచనలు: బస్టాప్, సమాజంలో మరో సమిధ, వెట్టిచాకిరి, చచ్చిపో, కుట్ర, నేను వేశ్యను కాను, సమాజంలో భారతీయం, మన మతం, విష బిందువులు, విలేఖరి, మార్పు, వారసులు, షిర్డీ సాయిబాబా (నాటకాలు).

**సిరాజుద్దీన్ మహమ్మద్ :** వరంగల్ జిల్లా నర్సంపేట్ తాలూకా రంగాపురంలో 1953 డిసెంబర్ ఐదున జననం. తల్లితండ్రులు: మెహరున్నీసా బేగం, ముహమ్మద్ ఖాజా మొయినొద్దీన్. కలం పేరు: ముసి. చదువు: బి.ఏ. ఉద్యోగం: రెవిన్యూశాఖ (వరంగల్). 1973 నుండి రచనా వ్యాసంగం పట్ల ఆసక్తి కనపర్చినా 1990లో 'పరమపదసోపానం' కథ 'ఉదయం' లో ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికల్లో, కవితా సంకలనాల్లో కవితలు, కథలు చోటు చేసుకున్నాయి. రచనలు:1. ప్రపంచ శాంతి (కవితా సంపుటి,1995), 2.యుద్ధం (కవితా సంపుటి,2005). విశ్వశాంతి కోసం మానవాళి ఏం చేయాలన్న విషయం ప్రధానాంశంగా రూపొందిన 'ప్రపంచశాంతి పండుగ' కార్యచరణను సూచించడంతో ఐక్యరాజ్య సమితి ప్రశంసలు లభించాయి. 'మనిషెక్కడ ఉన్నాడు' 'విశ్వం నిండా విహరిద్దాం' కవితలు 'ఆద్మీ కహాఁ హై', 'విశ్వభర్‌మే ఉడాన్ భరేంగే' శీర్షికన హిందీలోకి తర్జుమా చేయబడి హిందీ పత్రికలలో, సాహిత్య ఆకాడమీ (ఢిల్లీ) అధికారిక పత్రికల్లో ప్రచురితం అయ్యాయి. ప్రపంచశాంతి దిశగా ప్రజలలో ఆలోచనలను రెకెత్తించడానికి సాగిస్తున్న రచనా వ్యాసంగం, అందుకు తగిన కార్యాచరణ



అంతర్జాతీయ స్థాయి గుర్తింపును తెచ్చి పెట్టింది. లక్ష్యం: శాంతి...శాంతి...శాంతి, అందునా ప్రపంచ శాంతి. **చిరునామా: ముహమ్మద్ సిరాజుద్దీన్, ఇంటి నం. 24-2-113, దర్గా ఖాజీపేట, వరంగల్-506004, వరంగల్ జిల్లా. సంచారవాణి: 99497 10085, దూరవాణి: 0870-2430805.**

**సుబహాన్ అబ్దుస్ కె.యం ః** నెల్లూరు జిల్లా నెల్లూరు పట్టణంలో 1956 జూలై ఒకటిన జననం. తల్లితండ్రులు: ఖాజా బీబి, మియా జాన్. చదువు: ఇంటర్. ఉద్యోగం: ఉపాధ్యాయులు. 1983లో రాసిన 'ప్రజల రక్త మాంసాలతో...' కవిత 'రాడికల్ మార్చ్' పత్రికలో ప్రచురితం అయినప్పటి నుండి వివిధ పత్రికల్లో, సంకలనాల్లో పలు వ్యాసాలు, కథలు, గేయాలు, కవితలు చోటుచేసుకున్నాయి. పిల్లల



విద్యాభ్యాసంలో సృజనాత్మకను పెంపొందించాలన్న లక్ష్యంతో బాలల కోసం రాసిన పలు కథలు, ఇస్లామిక్ వ్యవస్థ-చరిత్ర ఔన్నత్యాన్ని వివరిస్తూ వివిధ కోణాల నుండి రాసిన వ్యాసాలు, 'గీటురాయి' వారపత్రికలో ధారావాహికంగా ప్రచురితం. 'ఖిలాఫత్-రాజరికం', 'ఔరంగజేబు మత ఛాందసవాది కాదు', 'మానవజాతికి అభ్యుదయానికి ఇస్లాం అత్యవసరం' లాంటి వ్యాసాలు గుర్తింపు తెచ్చిపెట్టాయి. ఉర్దూ, తెలుగులో పాటలు రాయడం శ్రావ్యంగా పాడటం అభిరుచి. ఈ మేరకు పలు టివీ ఛానెల్స్, ఆకాశవాణిలో స్వయంగా రాసి పాడిన పాటలు ప్రసారం అయ్యాయి. రచనలు: 1. విజయానికి ఏకైక మార్గం ఇస్లాం (2008), 2. హిందూ ధర్మగ్రంథాల్లో ప్రవక్త మహమ్మద్ (2009), 3. ఇస్లాం మానవజాతికి అత్యవసరం (2010), ఇస్లామీయ ఉద్యమం-స్థబ్దత (2010). లక్ష్యం: ప్రపంచంలో శాంతి-సంక్షేమ సమాజ స్థాపనకు ఇస్లామీయ ప్రాంపంచిక జీవన విధానం ఒక్కటే శాస్త్రీయమైనదన్న వాస్తవాన్ని ప్రచారం చేయడం. **చిరునామా: కె.యం.అబ్దుస్ సుబహాన్, ఇంటి నం. 25-1-1991, ప్రగతి నగర్, 'ఏ' బ్లాక్, 8వ వీధి, నెల్లూరు-4, నెల్లూరు జిల్లా. సంచారవాణి: 94907 78602.**

**సుభాని మహబూబ్ షేక్ ః** గుంటూరు జిల్లా గుంటూరులో 1961 మే 31న జననం. తల్లితండ్రులు: షేక్ పాతిమూన్, సులేమాన్. చదువు: బి.కాం., బి.ఎల్.ఐ.ఎస్సీ., ఎం.ఏ. ఉద్యోగం: గ్రంథాలయాధికారి (జిల్లా గ్రంథాలయం, గుంటూరు). 1977లో 'ఇజాలు' కవిత ఆంధ్రభూమిలో ప్రచురితం అయినప్పటి నుండి వివిధ పత్రికలలో, సంకలనాలలో కవితలు, వ్యాసాలు చోటు చేసుకున్నాయి.'దృశ్యం', 'కనుమరుగు అయిపోతున్న మనిషి',









'ఉగ్రవాదమా, నీదేమతం?', 'మన్నించు తల్లి' లాంటి కవితలు గుర్తింపు తెచ్చిపెట్టాయి. పురస్కారం: తెలుగు భాషా పురస్కారం (రాష్ట్ర అధికార భాషా సంఘం, 2008), లక్ష్యం: సాహిత్యం ద్వారా సామాజిక సేవ. **చిరునామా: ఎస్.ఎం. సుభాని, ఇంటి నం.9-7-24, మొదటి అంతస్తు, సమతా ఆసుపత్రి వెనుక, రైలుపేట, గుంటూరు-522001, గుంటూరు జిల్లా. సంచారవాణి: 94907 76184.**

**సుగం బాబు యం.కె. ః** గుంటూరు జిల్లా గుంటూరు నగరంలో 1944 ఏప్రిల్ ఒకటిన జననం. తల్లితండ్రులు: సకినాబీబి, ఫరీద్ ఖాన్. తల్లితండ్రులు పెట్టిన పేరు మహబూబ్ ఖాన్ కాగా అదికాస్తా 'సుగంబాబు' గా పేరు స్థిరపడింది. చదువు: బి.ఏ (తెలుగు). వృత్తి: జర్నలిస్టు-రచయిత. తెలుగు, హిందీ, ఆంగ్ల భాషల్లో ప్రవేశం. పలు చలన చిత్రాలకు



దర్శకుడిగా, రచయితగా వ్యవహరించారు. 1963 డిసెంబర్‌లో 'భారతి' మాసపత్రికలో 'మట్టి బొమ్మ' కవిత ప్రచురణతో రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికల్లో, సంకలనాల్లో కవితలు, కథానికలు, సాహిత్య వ్యాసాలు చోటుచేసుకున్నాయి. తెలుగు సాహిత్య లోకంలో 'పైగంబర్ కవులు'గా సుప్రసిద్ధులైన ఐదుగురిలో ఒకరైన సుగంబాబు 2003లో తెలుగు సాహిత్యంలో 'రెక్కలు' అను నూతన ప్రక్రియను ఆరంభించి ఐదు ఎడిషన్లు వెలురించారు. తొలిసారిగా హిబ్రూ విశ్వవిద్యాలయం (ఇజ్రాయిల్) కు చెందిన ఆచార్య సుర్మన్ డేవిస్ ఆంగ్ల భాషలో 'వింగ్స్' పేరిట వాటిని అనువదించి వెలువరించినప్పటి నుండి తెలుగులోనే కాకుండా జాతీయ స్థాయిలో 'రెక్కలు' ప్రక్రియ పాఠకాదరణ పొంది, అది కన్నడం, హిందీ భాషా సాహిత్యంలో ప్రత్యేక స్థానం సంపాదించుకుంది. రచనలు: చరలో సెలయేరు (1968), విప్లం (1969), పైగంబర్ కవులు (1971), సూరీడు (పాటల పుస్తకం, 1971), లెనిన్...లెనిన్ (1984), రెక్కలు (2003). ఈ గ్రంథాలలో 'సూరీడు' ఖ్యాతి తెచ్చిపెట్టింది. లక్ష్యం: మనిషి తన పరిధులను ఎరిగి మసలుకున్నప్పుడు మాత్రమే శాంతిగా-సౌఖ్యంగా జీవిచంగలడన్న విషయం ఎరుకపర్చాలని. **చిరునామా: ఎం.కె సుగం బాబు, ఫ్లాట్-502, సాయితేజ ఎన్‌క్లేవ్, సూరారం ఎక్స్ రోడ్స్, వెంకట్రామ్ నగర్, హైదరాబాద్-550055. సంచారవాణి: 93925 17348.**

**సుహైల్ అహమ్మద్ ఆదిల్ ః** హైదరాబాద్‌లో 1975 ఆగస్టు 24న జననం. తల్లి తండ్రులు: అఖ్తర్ ఫైజ్ సిద్ధిఖా, ఫాయఖ్ అహమ్మద్ ఫైజ్. కలంపేరు: సాద్. చదువు: ఎం.ఏ (ఇస్లామిక్ స్టడిస్)., ఎం.ఏ (ఉమన్ స్టడీస్)., బి.ఇడి., ఆలీం. ఉద్యోగం: ఉపాధ్యాయులు. ఉర్దూ, తెలుగు, అరబ్బీ, హిందీ, ఇంగ్లీషు భాషల్లో ప్రవేశం. 1991లో రాసిన 'ఇస్లాంలో జంతు సంరక్షణ' వ్యాసం 'ఈనాడు' దినపత్రికలో ప్రచురితం అయినప్పటి



నుండి వివిధ పత్రికల్లో, సంకలనాల్లో, సావనీర్లల్లో వ్యాసాలు చోటుచేసుకున్నాయి. పలు ఉర్దూ గ్రంథాలను తెలుగులోకి అనువదించారు. అనువాద గ్రంథాలు: 1.హజ్ పరమార్థం, 2. దైవ సాన్నిధ్యం పొందడమెలా?, 3. మేరాజ్ (యాత్ర-సందేశం), 4. దిక్సూచి, 5. హజ్రత్ ఉమర్ (రజి), 6. హజ్రత్ ఉస్మాన్ (రజి), 7. హజ్రత్ అలీ (రజి), 8. సమాధుల సందర్శన, 9. తావీజులు-తాయెత్తులు, 10. దైవ ప్రవక్త (స) దాంపత్య జీవితం, 11. సంపూర్ణ నమాజ్, 12. ఖుర్‌అన్‌తో ఇంటర్వ్యూ (2010), 13. ధర్మ సంస్థాపన (2010). లక్ష్యం: ఉర్దూ భాషలో ఉన్న ఇస్లామియా ధార్మిక సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేయడం. **చిరునామా: సుహైల్ అహమ్మద్ ఆదిల్, ఇంటి నం. 18-1-350/ 22/175, గుల్షన్-యే-ఇక్బాల్ కాలనీ, అక్బర్ రోడ్, కేశవగిరి (పోస్టు), బండ్లగూడ మండలం, హైదరాబాద్-500005. సంచారవాణి: 93999 07243**..

**సుల్తాన్ పాషా ఎం :** మహబూబ్‌నగర్ జిల్లా కొల్హాపూర్ జన్మస్థలం. పుట్టినతేది: 06-08-1950. తల్లితండ్రులు: ఆషా బేగం, ఖాశిం. చదువు: ఎం.ఎ., బి.ఓ.ఎల్. అప్పటిలో హైదరాబాద్‌లోని ప్రభుత్వ ఉన్నత పాఠశాల (పీల్‌ఖానా) లో తెలుగుపండితులుగా ఉద్యోగం. రచనలు: గేయాలు.

**మహమ్మద్ తహసీన్ అలీ డాక్టర్ :** కరీంనగర్ జిల్లా ఉప్పల్‌లో 1952 మార్చి ఒకటిన జననం. తల్లితండ్రులు: ఇఫాతున్నీసా బేగం, మహమ్మద్ హుస్సేన్. చదువు: ఎం.ఏ (హిందీ), ఎం.ఏ (సైకాలజీ)., పిహెచ్.డి. ఉద్యోగం: అధ్యాపకులు. 1973లో 'ఇక్కడే ఉండి పోవాలని ఉంది' కవిత ప్రచురితం అయినప్పటి నుండి వివిధ పత్రికల్లో, సంకలనాల్లో కవితలు, కథలు, వ్యాసాలు ప్రచురితం. 2004లో వెలువడిన 'నిర్ణయం' కథానిక మంచి గుర్తింపు తెచ్చిపెట్టింది. లక్ష్యం: బహు భాషల్లో ఉన్న ఉత్తమ సాహిత్యాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేయడం. **చిరునామా: డాక్టర్ మహమ్మద్ తహసీన్ అలీ, ఇంటి నం.3-137/3, పరిమళ కాలనీ, వడ్డెపల్లి-506370, వరంగల్ జిల్లా, సంచారవాణి: 99636 11016.**



**తాజుద్దీన్ అహ్మద్ మహమ్మద్ :** ఖమ్మం జిల్లా తెల్లెలపాడు లో 1957 మే ఐదున జననం. తల్లితండ్రులు: అమీనా బేగం, అబ్దుల్ నబి. చదువు: ఎం.ఏ., విద్వాన్., సాహిత్య రత్న., శాస్త్రి., ఆచార్య. ఉద్యోగం: అధ్యాపకులు. 1976 నుండి హిందీలో రాస్తున్నా,









1983లో రాసిన 'స్పెషాలిటీ' తెలుగు కవిత 'పండిత భారతి' పత్రికలో ప్రచురితమైనప్పటి నుండి ఇటు తెలుగు అటు హిందీ భాషల్లో రాసిన కవితలు, సాహిత్య-శాస్త్రీయ వ్యాసాలు ఆయా భాషా పత్రికల్లో, సంకలనాల్లో చోటు చేసుకున్నాయి. రచనలు: 1. పర్యావరణ పరిరక్షణ (1999), 2. నీరు-మీరు (2000), 3. నావ కథ, 4. అక్షరగీతి (2001), 5 విశ్వం దాని కథ (2002), 6. రైతన్నా..ఓ రైతన్నా (2007), 7. లోకం మెచ్చిన బాట (2008). అవార్డులు: కవిరాజు త్రిపురనేని స్మారక అవార్డు. లక్ష్యం: సామాజిక చైతన్యం. **చిరునామా : ఎండి. తాజుద్దీన్, జడ్‌పిహెచ్‌ఎస్, రుద్రంపూర్-507119, ఖమ్మం జిల్లా. సంచారవాణి: 98482 07512, 95332 01149.**

**ఉమర్ అలీషా :** విశాఖపట్నం జిల్లా విశాఖపట్నంలో 1955 సెప్టెంబర్ 21న జననం. తల్లితండ్రులు: రజియా బేగం, ఖాదర్ బాషా. చదువు: బి.ఏ (ఇంగ్లీషు)., ఎం.ఏ (తెలుగు)., ఏయంఐఇ. 1967 నుండి 'ఈశ్వర తత్వం' ప్రధాన అంశంగా పద్యశతకం రాశారు. అప్పటి నుండి వివిధ పత్రికలలో ఆధ్యాత్మిక, సాహిత్య సమీక్షా వ్యాసాలు, విమర్శనా వ్యాసాలు, పద్యాలు, కవితలు ప్రచురితమయ్యాయి. ఆకాశవాణి, దూరదర్శన్‌లో సాహిత్య ప్రసంగవ్యాసాలు విస్తారంగా ప్రసారం అయ్యాయి. లక్ష్యం: సమాజంలోని ప్రతి ఒక్కరిలో సమాజ శ్రేయోకాంక్షను మరింతగా పెంపొందించాలి. **చిరునామా : ఉమర్ అలీషా, బీచ్ రోడ్, కంచర వీధి, విశాఖపట్నం-1, విశాఖపట్నం జిల్లా. సంచారవాణి: 90324 92606.**



**ఉమర్ అలీషా డాక్టర్ :** తూర్పుగోదావరి జిల్లా పిఠాపురంలో 1966 ఆగస్టు రెండున జననం. తల్లితండ్రులు: జహెరా బేగం, మొహిద్దీన్ బాద్షా చదువు: బిహెచ్‌యంఎస్. వృత్తి: వైద్యం. 1989 నుండి ఆధ్యాత్మిక వ్యాసాలు రాస్తున్నారు, 'తత్వజ్ఞానం' మాసపత్రికలో వ్యాసం ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలలో ఆధ్యాత్మిక వ్యాసాలు చోటుచేసుకున్నాయి. ఆకాశవాణి, దూరదర్శన్, భక్తి టీవి ఛానెల్స్‌లో పలు ఆధ్యాత్మిక ప్రసంగ వ్యాసాలు ప్రసారం. రచనలు: 1. విజ్ఞానజ్యోతి (120 ఆధ్యాత్మిక వ్యాసాల సంపుటి, 2007), 2. తత్వ దర్శనం (1992 నుండి 2010 వరకు ఇచ్చిన ఆధ్యాత్మిక ప్రసంగాల ఆరు సంపుటాలు). వీటిలో 'విజ్ఞానజ్యోతి' గ్రంథం 'కాస్మిక్ విజడమ్' పేరుతో



ఆంగ్లంలోకి అనువాదమై 2008లో వెలువడింది. 1996 నుండి 'తత్వజ్ఞానం' ఆధ్యాత్మిక మాసపత్రిక సంపాదకులుగా వ్యవహరిస్తున్నారు. అవార్డులు- పురస్కారాలు: డాక్టర్ రామినేని పురస్కారం (హైదరాబాద్, 2006), 'భరతమాత ముద్దు బిడ్డ' అవార్డు (మదర్ ఇండియా ఇంటర్నేషనల్, 2010), గ్లోబల్ హెల్త్ అండ్ ఎద్యుకేషనల్ ఫౌండేషన్ అవార్డు (న్యూఢిల్లీ, 2010), కిన్నెర అర్ట్ థియేటర్స్ ఉగాది పురస్కారం (హైదరాబాద్,2010) లక్ష్యం: సర్వమత సామరస్యం. ప్రజల మధ్య సధ్భావన-సదవగాహన పెంపొందించడం ద్వారా సమాజంలో ఐక్యతాభావనను, శాంతిని సుస్థిరం చేయడం. **చిరునామా : డాక్టర్ ఉమర్ అలీషా, ఇంటి నం. 11.3.42, ప్రధాన రహదారి, పిఠాపురం-533450, తూర్పుగోదావరి జిల్లా, దూరవాణి: 08869-251769, 98489 24599.** Email: dr_umaralisha@yahoo.com.

**ఉమర్ అలీషా మౌల్వీ :** మౌల్వీ ఉమర్ అలీషా 1885 ఫిబ్రవరి 28న, తూర్పుగోదావరి జిల్లా పిఠాపురంలో జన్మించారు. తల్లితండ్రులు: చాంద్‌బీబి, మౌల్వీ మొహిద్దీన్ బాద్షా. చదువు: ఉన్నత పాఠశాల విద్యానంతరం తండ్రి, ఇతర పండితుల వద్ద విద్యాభ్యాసం చేశారు. తెలుగు, ఉర్దూ, అరబ్బీ, పర్షియన్, హిందీ, సంస్కృత భాషలలో పట్టు సంపాదించిన ఆయనకు ఆంగ్ల భాషతో పరిచయం ఉంది. చిన్నతనంలోనే మంచి విద్వత్తు ప్రదర్శిస్తూ 14వ ఏట నుండి కవిత్వం చెప్పడం మొదలెట్టిన ఉమర్ అలీషా 18వ ఏటనే నాటకాలు రాయడం ఆరంభించి, 1905 ప్రాంతంలో 'మణిమాల' (గద్య-పద్యాత్మక నాటకం) వెలువరించారు. చిన్నతనం నుండి రచనా వ్యాసంగంలో నిమగ్నమైన ఉమర్ అలీషా అసంఖ్యాకంగా రాశారని తెలుస్తుంది. డాక్టర్ ఉమర్ అలీషా మొత్తం మీద 108 గ్రంథాలు రాశారని ఆంధ్ర విశ్వవిద్యాయలం హిందీ విభాగానికి చెందిన ఆచార్య యస్.యం ఇక్బాల్ ప్రకటించారు. 1970లో డాక్టర్ ఉమర్ అలీషా మీద పరిశోధనా పత్రం సమర్పించేందుకు, సమాచార సేకరణ జరుపుతున్న సమయంలో, మౌల్వీ



చేతిరాతలో ఉన్న పలు గ్రంథాలను తాను చూచినట్టు 2005 ఆగష్టు 6న 'అక్షరశిల్పులు' కూర్పరితో ప్రొఫెసర్ ఇక్బాల్ స్వయంగా చెప్పారు. 1926-28లలో డాక్టర్ ఉమర్ అలీషా తెలుగులోకి అనువదించిన ఉమర్ ఖయ్యూం రుబాయిలను 'ఉమర్ ఖయ్యూం రుబాయీల అనుశీలన' అను శీర్షికతో 1980లో నాగార్జున విశ్వవిద్యాలయంలో సిద్దాంత వ్యాసం సమర్పించిన డాక్టర్ షేక్ మహమ్మద్ ముస్తఫా (కడప) 'అరవై ఏళ్ళల్లో దాదాపు 50 కృతులు...రచించార'ని వెల్లడించారు. మౌల్వీ ఉమర్ అలీషాతో పరిచయమున్న పిఠాపురం నివాసి, ప్రముఖ కవి డాక్టర్ అవంత్స సోమసుందర్, 2007 సెప్టెంబర్ 14న మాట్లాడుతూ ఉమర్ అలీషా అసంఖ్యాకంగా గ్రంథాలు రాసినా, వెలువరించినా అవన్నీ ప్రస్తుతం లభ్యం







కావడం లేదన్నారు. ప్రస్తుతం ఉమర్ అలీషా రాసిన మొత్తం పుస్తకాలలో 23 గ్రంథాలు మాత్రమే అందుబాటులో ఉన్నాయని మౌల్వీ మునిమనువడు డాక్టర్ ఉమర్ అలీషా (పిఠాపురం) తెలిపారు. మౌల్వీ ఉమర్ అలీషా 1.అనసూయాదేవి, 2.కళ, 3.చంద్రగుప్త 4.ప్రహ్లాద లేక దానవవధ, 5.మణిమాల, 6.మహాభారత కౌరవరంగము, 7.విచిత్ర బిల్హణీయము, 8.విషాద సౌందర్యము (నాటకాలు), 1.నరకుని కాంతాపహరణ, 2.బాగ్దాదు మధువీధి, 3.విశ్వామిత్ర (ఏకాంకికలు), 1.వరాన్వేషణ అను ప్రహసనం, 1.ఖండ కావ్యములు, 2.తత్త్వ సందేశము, 3.బర్హిణి దేవి, 4.బ్రహ్మ విద్యావిలాసము, 5.మహమ్మద్ రసూల్ వారి చరిత్ర, 6.సూఫీ వేదాంత దర్శనము, 7. స్వర్గమాత, 8.హాలీ (పద్యగ్రంథాలు) రచించారు. ఆ తరువాత 1.ఈశ్వరుడు, 2.మహమ్మద్ వారి చరిత్ర, 3.సాధన పథము (గద్యములు), 1.తారామతి, 2.పద్మావతి, 3.శాంత (నవలలు), 1.ప్రభాత కథావళి (కథల సంగ్రహము) లను వెలువరించారు. డాక్టర్ ఉమర్ అలీషా బహుభాషా పండితుడు కావడం వలన ఇతర భాషల నుండి తెలుగులోకి అనువాదం చేసిన గ్రంథాలలో 1. ఉమర్‌ఖయ్యామ్, 2.ఖురాన్ -ఏ-షరీఫ్, 3. గులిస్తా ప్రధానమైనవి. ఆయనకు వైద్యశాస్త్రంలో కూడా అనుభవం ఉన్నందున 1.'ఇలాజుల్ గుర్‌భా' అను వైద్య గ్రంథాన్ని (అనువాదం) వెలువరించారు. ఈ రచనలే కాకుండా ఆయన సృజించిన వందకు పైగా వ్యాసాల సంపుటి, హిందీలో ఆయన చేసిన ఉపన్యాసాల సంగ్రహం, ఆంగ్ల ఉపవ్యాసాల సంగ్రహం వేర్వేరుగా ఉన్నాయని, ఇవికాక 'మదాల', 'మనద్దాస్ అలీ', 'ఉరుమత్తూరు చక్రవర్తి', 'శ్రీ మద్వాల్మీకి రామాయణము' అను గ్రంథాలను కూడా ఉమర్ అలీషా రచించినట్టు డాక్టర్ మహమ్మద్ ముస్తఫా, డాక్టర్ యస్.యం.ఇక్బాల్ లాంటి పరిశోధకుల ద్వారా తెలుస్తుంది. 1924లో All India Oriental Conference 'పండిట్' బిరుదుతో సత్కరించింది. అలీఘర్ విశ్వవిద్యాలయం 'మౌల్వీ' బిరుదునిచ్చి గౌరవించింది. ఫ్రాన్స్ దేశానికి చెందిన ఆర్యన్ విశ్వవిద్యాలయం(Aryan University of France) Professor in Hindu-Muslim Culture అవార్డును అందించి గౌరవించింది. ఉమర్ అలీషా విద్వత్తును గుర్తించి 1936లో ACADEMIA INTERNATIONAL AMERICANA ఆయనను DOCTOR LITIERARUM (DOCTOR OF LITERATURE) తో గౌరవించింది. ఉమర్ అలీషాకు మౌల్వీ, బ్రహ్మరుషి, ఆశుకవి, మహాకవి లాంటి బిరుదులు సాహిత్యలోకం నుండి లభించాయి. ఆయనకు పూల కిరీటాలు, సింహతలాటాలు, గజారోహణలు, కనకాభిషేకాలతో లెక్కలేనన్ని సన్మానాలు జరిగాయి. కవి, రచయిత, అనువాదకుడు, సంస్కర్త, ఆధ్యాత్మికవేత్త, రాజకీయనాయకుడు, ప్రజాప్రతినిధిగా ప్రజా జీవితాలను ప్రభావితం చేసిన మౌల్వీ ఉమర్ అలీషా బహుముఖ ప్రజ్ఞాశాలిగా పేరుగడించారు. చివరివరకు సాహిత్య- ఆధ్యాత్మిక రంగాలతో మమేకమైపోయి గడిపిన మౌల్వీ ఉమర్ అలీ షా 1945 జనవరి 23న పశ్చిమగోదావరి జిల్లా నరసాపురంలో కన్నుమూశారు.

**ఉస్మాన్ ఖాన్ ముహమ్మద్ (పాషా) :** ఖమ్మం జిల్లా నల్లముడి జగన్నాథపురంలో 1968లో జననం. తల్లితండ్రులు: వజీరున్నిసా బేగం, ముహమ్మద్ గౌస్ ఖాన్. కలంపేరు: సంధ్య, కారుణ్య. చదువు: 5వ తరగతి. వృత్తి: వ్యాపారం. ఉర్దూ, అరబిక్, హిందీ, తెలుగు భాషల్లో ప్రవేశం. 1988లో 'ఉదయం' దినపత్రికలో రాసిన 'ప్రతి మొగ్గను వికసించనీయండి' ప్రచురితం అయినప్పటి నుండి వ్యాసాలు కథలు, కవితలు వివిధ పత్రికల్లో చోటు చేసుకున్నాయి. తెలుగు పత్రికల్లో (ఆంధ్రజ్యోతి దినపత్రిక, నది మాసపత్రిక) ధార్మిక అంశాల మీద కాలమ్స్ నిర్వహిస్తున్నారు. ఉర్దూ, అరబిక్ భాషల్లో వచ్చిన సాహిత్యాన్ని తెలుగులోకి అనువదించి పలు గ్రంథాలను వెలువరించారు. 'గీటురాయి' వారపత్రిక (హైదరాబాద్) లో 1. ద ట్రెంచెస్, 2. వేగుచుక్క 3. ఆశాకిరణం, 4. దేవతలు, 5. పూలరేకు (ధార్మిక నవలలు) ధారావాహికంగా ప్రచురితం అయ్యాయి. వీటిలో 'ద ట్రెంచెస్' గుర్తింపు తెచ్చి పెట్టింది. మంచి వక్త. ఆకాశవాణి, దూరదర్శన్, టివీ ఛానెల్స్‌లలో పలు ధార్మిక ప్రసంగాలు (110) ప్రసారం అయ్యాయి. రచనలు: స్వతంత్ర గ్రంథాలు: 1. ఇస్లాం మార్గం (వ్యాససంపుటి), అనువాద గ్రంథాలు: 1. సత్యాన్వేషణ, 2. దాంపత్య నియమాలు, 3. మేరాజ్ సందేశం, 4. కందకం సంకేతాలు, 5. మిలాదున్నబి, 6. హజ్రత్ ఇమామ్ హుసైన్ (రజి), 7. ఉమ్మడి కుటుంబం, 8. రమ్‌జాన్ సత్కార్యాల సమాహారం, 9. రమ్‌జాన్ శుభాలకు అర్హులు, 10. మగువల మాటలు, 11. పరిస్థితులు -బాధ్యతలు, 12. తల్లితండ్రులు -సంతానం హక్కులు, 13. హదీసు పరిమళం (నాలుగు సంపుటాలు). ఈ గ్రంథాలలో 'ఇస్లాం మార్గం', 'హదీసు పరిమళం' బహుళ పాఠకాదరణ పొందాయి. లక్ష్యం: ఎలాంటి అసమానతలు, వివక్ష లేని, దైవ భీతి పునాదుల మీద ఏర్పడే ఒక సుందర సత్సమాజ నిర్మాణం కోసం ధార్మిక-సాహిత్య సేవ. **చిరునామా: ముహమ్మద్ ఉస్మాన్ ఖాన్, ఇంటి నం.1-153, నల్లముడి జగన్నాథపురం-507115, ముల్కాలపల్లి మండలం, ఖమ్మం జిల్లా. దూరవాణి: 08744-276315, సంచారవాణి: 9912580645.**



**ఉస్మాన్ సయ్యద్ :** హైదరాబాద్‌లో 1967లో జననం. తల్లి తండ్రులు: యూసుఫ్‌బి, సయ్యద్ యూఖూబ్ అలీ. చదువు: 9వ తరగతి. వృత్తి: ఎలక్ట్రిషియన్. చిన్నప్పటి నుండి కవితలను రాయడం పట్ల ఆసక్తి చూపుతూవచ్చినా 1978 నుండి మాత్రమే వివిధ పత్రికల్లో, సంకలనాల్లో ప్రచురితం కావడం ఆరంభమైంది. రచనలు: 'కవితా రాణి (కవితా సంపుటి, 1988), సూర్యవాణి (కవితా సంపుటి 1989)' లక్ష్యం: అసమానతలను తొలగింపుకు









ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయాలి. **చిరునామా: సయ్యద్ ఉస్మాన్, ఇంటి నం.263-512/ 92, బాపూనగర్, అంబర్‌పేట, హైదరాబాద్-13.**

**వలి సాహెబ్ షేక్ డాక్టర్ :** గుంటూరు జిల్లా బొల్లాపల్లి మండలం గుమ్మనంపాడులో 1976 జూన్ ఐదున జననం. తల్లితండ్రులు: షేక్ ఖాశింబి, షేక్ పెద్ద సైదా సాహెబ్. చదువు: బి.ఏ., డి.యస్. వృత్తి: వైద్యం. 2002లో రాష్ట్రంలోని మైనార్టీ ప్రజానీకం స్థితిగతుల మీద రాసిన తొలి వ్యాసం 'సైద్ధాంతిక బులిటిన్'లో ప్రచురితం అయినప్పటి నుండి కవితలు, వ్యాసాలు, కథానికలు వివిధ పత్రికల్లో, కవితా సంకలనాల్లో చోటుచేసుకున్నాయి. లక్ష్యం: సత్సమాజం దిశగా ప్రజలను జాగృతపర్చడం. **చిరునామా: డాక్టర్ షేక్ వలి సాహెబ్, ఇంటి నం. 36272 చైతన్యనగర్, యర్రగొండపాలెం-523327, ప్రకాశం జిల్లా. సంచారవాణి: 94418 19330.**



**వలి షేక్ :** తూర్పుగోదావరి జిల్లా ధవళేశ్వరంలోని కారు బజారు నివాసం. రచనలు: శ్రీమతి లక్ష్మీ.

**వలీ మస్తాన్ షేక్ కురిచేడు :** గుంటూరు జిల్లా వినుకొండలో 1958 మే పదిన జననం. తల్లి తండ్రులు: జాన్ బీ, షేక్ షైదా సాహెబ్. కలం పేరు: స్టార్ వలి, చదువు: ఏడవ తరగతి. వృత్తి: దర్జీ. 1978లో దర్జీల బ్రతుకుల మీద రాసి, పాటకట్టి పదిమందిలో పాడడంతో రచనా వ్యాసంగం ఆరంభమై పలు కవితలు, పాటలు, గేయాలు రాసి రాష్ట్రంలోని పలు ప్రాంతాలలో పాడి విన్పించారు. రచనలు: ఆవలి గట్టు (కవితా సంపుటి, 2010). లక్ష్యం: చీకటిలో మగ్గుతున్న బాధిత ప్రజానీకం వికాసం. **చిరునామా : షేక్ మస్తాన్ వలి (స్టార్ వలి), ఇస్లాం పేట, తిమ్మామపాలెం రోడ్డు, వినుకొండ -522647, గుంటూరు జిల్లా. సంచారవాణి: 94415 02990 (పిపి).**



**వలి ఎస్.ఎమ్ :** సయ్యద్ మస్తాన్ వలి 1935లో గుంటూరు జిల్లా, దుర్గి మండలం నాగులవరం గ్రామంలో జన్మించారు. తల్లితండ్రులు: సయ్యద్ ఖాశింబి, సయ్యద్ మీరా సాహెబ్. చదువు: బి.ఏ (ఆంగ్లం). జర్నలిజం డిప్లొమా చేశారు. ప్రభుత్వ ఉద్యోగం చేస్తూ రచనా వ్యాసాంగం వైపు మొగ్గుచూపారు. రాష్ట్రంలోని పలు ప్రముఖ తెలుగు, ఆంగ్ల దినపత్రికలకు వివిధ అంశాల మీద అసంఖ్యాకంగా వ్యాసాలు రాశారు. 1969లో నాగులవరం నుండి గుంటూరు వచ్చి స్థిరపడ్డారు. జర్నలిజం మీద ఆసక్తితో పలు పత్రికలలో

వివిధ హోదాలలో బాధ్యతలు నిర్వహించారు. ఆయన రాసిన 'ఈనాడు ఏనాడు నిజం రాయదు' వ్యాసం అప్పట్లో సంచలన సృష్టించింది. 1976 ఎమర్జన్సీ సమయంలో మానవహక్కుల ఉల్లంఘన ప్రధానాంశంగా 'సంకెళ్ళలో భారత దేశం' గ్రంథాన్ని వెలువరించి ప్రభుత్వ ఆగ్రహానికి గురయ్యారు. అరెస్టు నుండి తప్పించుకోడానికి ఎనిమిది మాసాలు అజ్ఞాతంగా గడపాల్సి వచ్చింది. చలన చిత్రాలకు మాటలు, పాటలు రాశారు. హాస్యనటుడు రాజబాబు నటించిన 'ఎవరికి వారే యమునా తీరే' సినిమాకు



కథ రాయడమే కాకుండా మాటలు కూడా సమకూర్చారు. ఆకాశవాణిలో కొంత కాలం పలు బాధ్యతలను నిర్వహించారు. గుంటూరు జిల్లాలో మాత్రమే కాకుండా రాష్ట్రంలోని పలు ప్రాంతాల నుండి వెలువడిన తెలుగు, ఆంగ్ల చిన్నపత్రికలకు మార్గదర్శకం వహించడం మాత్రమే కాకుండా ఆ పత్రికల మనుగడ కోసం వివిధ అంశాల మీద వ్యాసాలు రాసి పంపి సహకారం అందించారు. ఆర్థిక అవసరాల కోసం చాలా మందికి 'ఘోస్టు రైటర్'గా రచనలు అందించారు. మాటపూర్వకంగా గాని, రాతపూర్వకంగా గాని ఎవరి మెహర్బానీ కోసం కాకుండా నిర్భయంగా, నిష్కర్షగా తన అభిప్రాయాలను ప్రకటిస్తూ వచ్చిన ఆయన రాష్ట్ర జర్నలిస్టులకు, రచయితలకు 'ఎస్.ఎంవలి'గా పరిచయం. పెద్దపత్రికలు, చిన్నపత్రికలు అని కాకుండా అవసరంలో ఉన్న ప్రతి ఒక్కరికి ఏ సమయంలోనైనా సీనియర్ రచయిత, జర్నలిస్టుగా సమాచార సహకారం అందించిన సయ్యద్ మస్తాన్ వలి 2007 అక్టోబరు 29న గుంటూరులో కన్నుమూశారు. (సమాచారం: ఎస్.ఎం.వలి కుమారుడు, సయ్యద్ మీరా హుస్సేన్, న్యాయవాది, 06-08-2008, హైదరాబాద్.)

**వజీర్ రహమాన్ :** కాకినాడ. చదువు: ఎం.ఎ. రచనలు: ఎచటకి పోతావీరాత్రి?. కవిగా చలం, సాహసి, గేయకవితలు.

**వాహెద్ అబ్దుల్ :** పశ్చిమ గోదావరి జిల్లా గుండుగొలనులో 1966 జూలై24న జననం. తల్లితండ్రులు: నూర్జహాన్, ముహమ్మద్ షఫీ. కలం పేర్లు: వాహెద్, ఇబ్నె షఫి, రఫీఖ్, చదువు: బి.ఎస్సీ. వృత్తి: జర్నలిజం. ప్రస్తుతం 'హెచ్.ఎం. టీవీ'లో (హైదరాబాద్) బాధ్యతల నిర్వహణ. ఆంగ్లం, హిందీ, ఉర్దూ, అరబిక్, తెలుగు భాషలలో ప్రవేశం. 1988లో తొలి సారిగా 'జనత' దినపత్రికలో ప్రచురితమైన వ్యాసం ద్వారా రచనా రంగ ప్రవేశం. అప్పటినుండి వివిధ పత్రికల్లో సామాజిక- రాజకీయ-ధార్మిక వ్యాసాలు, కవితలు, కథానికలు ప్రచురితం. 1988లో హైదరాబాద్ వచ్చి 'గీటురాయి' వారపత్రికలో 20 ఏండ్ల పాటు సహాయ సంపాదకులుగా బాధ్యతలను నిర్వహణ. ఈ పత్రికలో వారం వారం ప్రత్యేకంగా







'కవర్‌పేజీ కథనం' శీర్షికన రాసిన, 'ప్రత్యేక కథనం' శీర్షికలతో సమకాలీన సమస్యలు-అంశాల మీద వ్యాసాలు అందించారు. అలాగే మాత్రా చందస్సులతో ప్రతివారం రాసిన 'వారెవా' పాఠకులను ఆకట్టుకున్నాయి. ఆకాశవాణి, దూరదర్శన్, టివి ఛానెల్స్‌లో పలు ధార్మిక,



సామాజిక ప్రసంగాలు ప్రసారం. 'సంస్కృతి టివి'లో ఇస్లాం విభాగం నిర్వాహకునిగా బాధ్యతల నిర్వహణ. రచనలు: 1. మానవసేవ, 2. టెర్రరిజం-ఇస్లాం బోధనలు, 3. సామాజిక న్యాయం ఇస్లాంలోనే సాధ్యం, 4. ఇస్లాం ఉగ్రవాదానికి వ్యతిరేకం, 5. మానవుల్లో సోదర భావం, 6. శాంతి ఎలా స్థాపితం అవుతుంది?, 7. నిన్ను నీవు తెలుసుకో, 8. స్వీయ సంస్కరణ, 9. బాల శ్రామికులు, 10. మానవులంతా ఒక్కటే, 11. ఉమ్మడి కుటుంబం-ఇస్లాం, 12. బహు భార్యత్వం - ఎప్పుడూ? ఎందుకు?, 13. యదార్థాల అద్దంలో కామన్ సివిల్ కోడ్ (ఉర్దూ నుండి అనువాదాలు) 14. అంతరిక్ష అధ్యయనం-దివ్య ఖురాన్, 15. స్ప్రింగ్ బోర్డు (ఆంగ్లం నుండి అనువాదాలు). లక్ష్యం: సామాజిక ప్రయోజనం. ప్రతి పదార్థ వివరణతో ఖుర్‌ఆన్ గ్రంథాన్ని పూర్తిగా అనువదించాలన్నది. **చిరునామా: అబ్దుల్ వాహెద్, సందేశ భవనం, లక్కడ్ కోట్, ఛత్తా బజార్, హైదారాబాద్- 500002, సంచారవాణి: 93465 02954, 93944 86084.**

**యాకూబ్ షేక్ డాక్టర్ :** ఖమ్మం జిల్లా కారేపల్లి మండలం రొట్టమాకు రేవులో జననం. తల్లితండ్రులు: హురూన్ బీ, షేక్ ముహమ్మద్. కలంపేరు: యాకూబ్. చదువు: బి.కాం., ఎం.ఏ(తెలుగు)., టిపిటి., యం.ఫిల్., పిహెచ్.డి. ఉద్యోగం: అధ్యాపకులు.



(అన్వరులూం డిగ్రీ కళాశాల, హైదరాబాద్). 1984లో ప్రజాశక్తి దినపత్రికలో 'నేను' కవిత ప్రచురితం కావడంతో రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికలలో, సంకలనాలలో కవితలు, గేయాలు, సాహిత్య-విమర్శనా వ్యాసాలు, కథలు చోటు చేసుకున్నాయి. పలు కవితలు ఆంగ్లం, హిందీ, తమిళం, కన్నడం, మళయాళం, ఫ్రెంచ్ భాషల్లో అనువాదమై ఆయా భాషా పత్రికల్లో స్థానం సంపాదించుకున్నాయి. 'ప్రవహించే జ్ఞాపకం (కవిత, 1992), తెలంగాణా సాహిత్య విమర్శ (2008), తెలుగు సాహిత్య విమర్శలో రా.రా మార్గం (పరిశోధనా వ్యాసం, 1991), మంచి గుర్తింపు తెచ్చిపెట్టాయి. ఉర్దూ, హిందీ, కొంకణి, కశ్మీరి భాషల్లోని కవితలను, గేయాలను తెలుగులోకి అనుదించారు. హిందీ టీవీ సీరియల్స్ 'మహాభారతం' (1988 -1989), టిపూ సుల్తాన్ (1989), పరమ వీరచక్ర (1989) లను 'ఉదయం' దినపత్రికలో

ప్రచురణ కోసం తెలుగులోకి అనువదించారు. గుజరాత్ ఘటనల సందర్భంగా ' సెక్యులర్ డెమాక్రటిక్ లిటరరీ కల్చరల్ ఫోరం' (హైదరాబాద్) ఏర్పాటు చేసి 'గుజరాత్ గాయం' కవితా సంకలనం తీసుకరావడంలో ప్రధానపాత్ర నిర్వహణ. పలు కవితా సంపుటాలు, విమర్శనా గ్రంథాలకు, సాహిత్య వ్యాస సంపుటాలకు, ప్రముఖ కవుల కవితా సంపుటాల ప్రచురణకు సంపాదకులుగా వ్యవహరించి పలు గ్రంథాలను వెలువరించారు. గాయకుడు-వక్త. అవార్డులు-పురస్కారాలు: రంజని-కుందుర్తి అవార్డు (1989), ఎస్‌విటీ దీక్షితులు అవార్డు (1993), అమిలినేని లక్ష్మి రమణ స్మారక ధర్మనిధి పురస్కారం (తెలుగు విశ్వవిద్యాలయం, 1998), కెసి గుప్తా సాహిత్య పురస్కారం (2000), డాక్టర్ సి నారాయణ రెడ్డి సాహిత్య పురస్కారం (2003), నూతలపాటి గంగాధరం సాహిత్య అవార్డు (2003), ఉత్తమ కవిత్వం అవార్డు (తెలుగు విశ్వవిద్యాలయం, 2004), రాష్ట్ర ఉత్తమ కవి (1998,2002), ఆంధ్రప్రదేశ్ మాదిగ సాహిత్య వేదిక అవార్డు (1998), ఉమ్మడి శెట్టి కవితా పురస్కారం (అనంతపురం, 2010). రచనలు: 1. సరిహద్దు రేఖ (కవితా సంపుటి, 2002), 2. ప్రవహించే జ్ఞాపకం (కవితా సంపుటి, 1992), 3. ఎడతెగని ప్రవాహం (కవితా సంపుటి, 2009), 4. తెలంగాణా సాహిత్య విమర్శ (2008), 5. తెలుగు సాహిత్య విమర్శలో రా.రా మార్గం (పరిశోధనా వ్యాసం, 1991). లక్ష్యం: సాహిత్యం సమాజ హితం కోరుతుంది. సాహిత్యకారునిగా నేనూ సమాజహితం కోరుతూ, సంఘజీవిగా మసలుతూ, మనిషిలో మనిషితనం పెంచేందుకు రచనలు తొడ్పడాలన్నది. **చిరునామా: డాక్టర్ యాకూబ్, సూఫిఘర్, ఇంటి నం. 1-7-28, రోడ్ నం. 17, చైతన్యపురి, హైదరాబాద్-500060. సంచారవాణి: 98491 56588.** Email: kaviyakoob@yahoo.com.

**యూసుఫ్ అలీ అస్కరి :** నల్గొండ జిల్లా నల్గొండలో 1948 జూలై పదిన జననం. తల్లితండ్రులు: ఖదీజతుల్‌కుబ్రా, ముహమ్మద్ మహబూబ్ అలీ అస్కరి. కలంపేరు: యూసుఫ్ అస్కరి. చదువు: బి.ఏ., బి.యల్. వృత్తి: విశ్రాంత రాష్ట్ర ప్రభుత్వ అధికారి. 1990లో 'నీలగిరి' మాసపత్రికలో 'సత్యమేవ జయతే' వ్యాసం ప్రచురితమైనప్పటి నుండి వివిధ పత్రికలలో, సావనీర్లలో సామాజిక-ధార్మిక అంశాల మీద వ్యాసాలు ప్రచురితం అయ్యాయి. స్థానిక మాసపత్రిక 'చీకటి వెలుగులు' మాసం మాసం ఏదోఒక సమకాలీన అంశం మీద విశ్లేషణాత్మక వ్యాసం ప్రచురితం అవుతుంది. లక్ష్యం: ప్రచారం అవుతున్న అవాస్తవాలను పూర్వపక్షం చేస్తూ ప్రజానీకానికి నిజాలు తెలియచేయడం. **చిరునామా: ముహమ్మద్ యూసుఫ్ అలీ అస్కరి, ఇంటి నం. 5-8-115, రహమత్ నగర్, నల్గొండ-508001, నల్గొండ జిల్లా.**









**యూసుఫ్ బాబ షేక్ :** నల్గొండ జిల్లాలో 1972 మార్చి 2న జననం. కలం పేరు: 'స్కైబాబ'. 'జల్‌జలా' ముస్లింవాద కవిత్వం (కవితా సంకలనం, 1998) వెలువరించారు. 2002లో అన్వర్‌తో కలసి 'అజా' కవితా సంకలనం, 2004లో 'వతన్' పేరిట కథానికల సంకలనం ప్రచురించారు. 2005లో 'జగనేకి రాత్' స్వీయ కవితల సంపుటి, కవయిత్రి షాజహానాతో కలసి 'అలావా' (2006) కవితా సంకలనం, 2009లో 'చాంద్‌తారా' (మిని కవితలు) ప్రచురించారు. పలు వ్యాసాలు, కథలు, కథానికలు, కవితలు వివిధ పత్రికలలో ప్రచురితం అయ్యాయి. ఆ కవితలలో కొన్ని హిందీ, ఆంగ్ల భాషల్లోకి తర్జుమా చేయబడి ఆయా భాషా పత్రికలలో, సంకలనాలలో చోటు చేసుకున్నాయి. 'చమన్' మాసపత్రికకు సంపాదకత్వం బాధ్యతలు నిర్వహించారు. **చిరునామా: స్కైబాబ, ఇంటి నం. 6-3-609/1/ఏ, ఆనందనగర్ కాలనీ, ఖైరతాబాద్, హైదరాబాద్-500 004, సంచారవాణి: 98854 20027, 99859 21379.**

**ఘోరి యూసుఫ్ :** 1951లో నల్లగొండ జిల్లా నల్లగొండలో జననం. విద్య: ఎం.ఏ (ఉర్దూ). వృత్తి: పాత్రికేయులు. కవితలు, గేయాలు, వ్యాసాలు వివిధ పత్రికలలో ప్రచురితం అయ్యాయి. రాష్ట్రంలో వెలువడిన వివిధ కవితా, కథా సంకలనాలలో ఆయన రచనలు చోటు చేసుకున్నాయి. రాష్ట్రంలో తెలుగులో రాస్తున్న కవులు, రచయితలను ఒకచోట చేర్చాలన్న లక్ష్యంతో 1982లో 'ఆంధ్రప్రదేశ్ ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనం' బాధ్యతలను చేపట్టి విజయవంతంగా నిర్వహించారు. ఈ సందర్భంగా 'ఆంధ్రప్రదేశ్ ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనం' వెలువరించిన ప్రత్యేక సంచిక 'తెలుగు దివ్వెలు' తయారీలో ప్రముఖ పాత్ర వహించడం మాత్రమే కాకుండా ఆ సంచికలో 'దక్కనీ ఉర్దూలో తెలుగు పదాలు' శీర్షికతో వ్యాసం రాశారు. ఈ సమ్మేళనం నిర్వహణలో ప్రధాన భాగస్వామ్యాన్ని స్వీకరించిన ఆయన సమ్మేళనం ఆహ్వాన కమిటి కార్యదర్శిగా బాధ్యతలను సమర్థవంతంగా నిర్వహించారు.



**జమ్రుద్ బాషా షేక్ :** గుంటూరు జిల్లా బాపట్లలో 1956 జూన్ ఒకటిన జననం. తల్లితండ్రులు: మైమున్నీసా బేగం, షేక్ జాఫర్ బాషా. చదువు: ఎం.కామ్., ఎల్ఎల్.బి. వృత్తి : న్యాయవాది. 1974 నుండి ప్రదర్శనా యోగ్యమైన నాటికలు, నాటకాలు రాసి ప్రదర్శించడంతో రచనా వ్యాసంగం ఆరంభమైంది. అప్పటినుండి పలు నాటికలు, నాటకాలు రచించి, స్వయంగా వాటిలో నటించి, ఆ నాటకాలు, నాటికలకు దర్శకత్వం



వహించి ప్రదర్శించారు. నాటికలలో 'ఏ వార్నింగ్, విస్ఫోటనం, ఎంగిలాకులు, జన్మభూమి, అమ్మకానికో తండ్రి' నాటికలు రాష్ట్రం అంతటా ప్రదర్శితమై నాటక రచయితగా మంచి గుర్తింపు తెచ్చిపెట్టాయి. లక్ష్యం: సామాజిక చైతన్యం, సమాజ సేవా భావాలను ప్రజలలో కలుగజేయడం. **చిరునామా: షేక్ జమ్రుద్ బాషా, న్యాయవాది, ఇంటి నం. 4-3-24, యాదవపాలెం, బాపట్ల-522101, గుంటూరు జిల్లా. సంచారవాణి: 93469 1008.**

**జరీనా బేగం డాక్టర్ :** కడప జిల్లా కడపలో 1958 జూలై రెండున జననం. తల్లితండ్రులు : ఖతీజాబి, ఖాజా మొహిద్దీన్. చదువు: ఎమెస్సీ (బాటనీ)., పిహెచ్.డి. ఉద్యోగం: అధ్యాపకులు. (ప్రభుత్వ మహిళా డిగ్రీ కళాశాల, వడ్డేపల్లి). 1982లో ఆంధ్రజ్యోతి దినపత్రికలో ప్రచురితమైన 'స్వార్థానికి మూలం' కవిత ద్వారా రచనా వ్యాసంగం ఆరంభం. అప్పటి నుండి వివిధ పత్రికల్లో, కవితా సంకలనాల్లో కవితలు, మినీ కవితలు, సాహిత్య వ్యాసాలు, కథలు చోటు చేసుకున్నాయి. ఈ కవితల్లో 'తుది యాత్ర' 'టి బాయ్ పవన్' కవితలు గుర్తింపు తెచ్చిపెట్టాయి. ఆకాశవాణిలో 'విజయ పథం' శీర్షికన పలు రేడియో ప్రసంగాలు. అవార్డులు -పురస్కారాలు: మానసా సాహిత్య అవార్డు (విజయవాడ, 2006), ఎక్స్‌రే సాహిత్య అవార్డు (విజయవాడ, 2007). జాతీయ సమగ్రత అవార్డు (2006). రచనలు: 1. ప్రతి బింబాలు (కవితా సంపుటి, 2008). లక్ష్యం: భావి యువలోకానికి దిశానిర్దేశనం చేయగల రచనలు చేయడం. **చిరునామా: డాక్టర్ జరీనా బేగం, లెక్చరర్, ఇంటి నం. 2-10-512, టీచర్స్ కాలనీ, వడ్డేపల్లి, వరంగల్-506370, వరంగల్ జిల్లా. సంచారవాణి: 9989615703**. Email:gzareena@yahoo.co.in









# అనుబంధం : 1

(అందుబాటులో ఉన్న వివిధ గ్రంథాలలో ప్రస్తావించబడిన కవులు, రచయితలు, అనువాదకుల పూర్తి వివరాలు లభించలేదు. ఆ కారణంగా ఆయా రచయితలు-కవులు రాసిన కవిత/వ్యాసం/కథానికల శీర్షికల తోపాటుగా ఆయా గ్రంథాలు, ఆ గ్రంథాల ప్రచురణకర్తల వివరాలను పట్టికల రూపంలో పొందుపర్చాను.)

## గుజరాత్ గాయం (కవితలు)

(లౌకిక ప్రజాస్వామిక సాహిత్య సాంస్కృతిక వేదిక, హైదరాబాద్, 2002)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | ఎం.ఎ అజీజ్ | ఫ్యాసిస్ట్ హిందూ మతోన్మాదం |
| 02. | అహమ్మద్ ఎస్ | కన్నవారి జాడ కోసం |
| 03. | ఇషాక్ అహమ్మద్ | రక్తపు హోలి |

## జంగ్ (కవితా సంకలనం)

(సంపాదకులు: సయ్యద్ సాబిర్ హుసేన్, ముస్లిం రచయితల సంఘం, ఆం.ప్ర, 2007)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | ఎం.ఎ బాసిత్ | అయినా నేనొక నవాబును |
| 02. | షేక్ నాసర్ వలి | అన్నం దొంగ |

## కవాతు (కవితా సంకలనం)

(సంపాదకుడు: షేక్ కరీముల్లా, ప్రచురణ: ముస్లిం రచయితల సంఘం, ఆంప్ర, 2008

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | ఫరీదాబాను | నాకో చిన్న అనుమానం |
| 02. | రుబినా సుల్తానా | భయం గుప్పెట్లో |
| 03. | సయ్యద్ అమీర్ | ఖబర్దార్ |
| 04. | గౌసియా రెహమాన్ | దువాః |
| 05. | షేక్ నాసర్ వలి | లెక్కలు |
| 06. | సయ్యద్ ఫిరోజ్ | వాడేంటి బద్మాష్‌గాడు |

## షాయర్ (కవితా సంకలనం)

(సంపాదకులు: జిలుకర శ్రీనివాస్, మరికొందరు, హైదరాబాద్, డిసెంబర్ 2006)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | ఖదిర్ | దావత్ |
| 02. | షేక్ పీరా బోరెవాలా | అబ్బా హు అక్బర్ |







## జల్‌జలా (ముస్లింవాద కవిత్వం)

(సంపాదకులు : సైబాబ, ప్రచురణ: నీలగిరి సాహితి, నల్గొండ, 1998)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | ఆజం | వూండెడ్ వ్యాలీ |
| 02. | అఫ్రీన్ | చమన్ |
| 03. | గులాం మహమ్మద్ | కష్మకష్ |
| 04. | సమి ఖాద్రి | ఫిర్‌బీ హం ఏక్ నహీ |
| 05. | షెహనాజ్ ఆజం | బట్టేబాజ్ |
| 06. | బాజి | మిలాద్ |
| 07. | అబ్బాస్ | కనురెప్పల స్వప్నం |
| 08. | ఎం.డి యాకూబ్ పాషా | ఒక ఇతిహాసం-ఒక వారసత్వం |
| 09. | ఖాజా | అదా హి చంద్రమా ... |
| 10. | ఎంటి ఖాన్ | ఘెట్టో |

## కవయిత్రుల కవితా మార్గం

(రచన: శిలాలోలిత, ప్రచురణ: సాహితీ స్రవంతి, హైదరాబాద్ 2006)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | రజియా బేగం | అలాగే అన్నారు (కవిత) ఆంధ్రజ్యోతి, 25.12.1992 |

## ప్రేమ (101 కవితలు)

(స్పృహ సాహితీ సంస్థ, హైదరాబాద్, 2004)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | గౌస్ | ఆకాశం ఆకుమీద. |

## మైనార్టీ కవిత్వం-తాత్విక నేపథ్యం

(రచన: డాక్టర్ ఎస్.సమీవుల్లా, మెహరున్నీసా ప్రచురణలు, హిందూపురం, 2005)

| క్రమసంఖ్య | కవి/రచయిత | సంకలనం / కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | జావెద్ | కవిత, ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 03.8.1993 |
| 02. | అలీ ముహమ్మద్ | వేదనా సౌరభాలు |
| 03. | మహబూబ్ | సమతా |
| 04. | జబీర్ బాషా | వ్యాసం, అంధ్రభూమి, 4.5.1997 |
| 05. | షేక్ ఖాశిం | కోడి కూసింది, స్త్రీ అంటేనే (కవితలు) |
| 06. | సిఎన్ఎఫ్ షరీఫ్ | పౌర స్మృతి, కర్నూలు, 1997 |
| 07. | సర్తాజ్ | సీమ సాహితి (11/12/1996) |
| 08. | నస్రీన్ బేగం | ఆంధ్రజ్యోతి వారపత్రిక, దీపావళి సంచిక, 1997 |
| 09. | డి.ఎస్ బషీర్ | ముని వాహనుడు-ఒకపరిశీలన (పరిశోధనాగ్రంథం) షా అండ్ షా పబ్లికేషన్స్,కర్నూలు, 1995 |
| 10. | ఎండి మహబూబ్ అలి | ఆధునిక కవిత్వం, వస్తు-రూప పరిణామం1 అముద్రిత ప్రరిశోధనా గ్రంథం, ఉస్మానియా, 1992 |
| 11. | పాపా సాహెబ్ టి | రాణి సంయుక్త (పద్యం) |
| 12. | మహబూబ్ సాహెబ్ టి | వేంకటేశ్వర శతకం, వృక్షవిలాపం (పద్యం) బనగానపల్లె, కర్నూలు, 1994 |
| 13. | హుస్సేన్ సాహెబ్ పి | ఈశ్వర సంప్రాసనము, వనపర్తి, 1994 |
| 14. | అబ్దుల్ ఖాదర్ సాహెబ్, అబ్దుల్ గఫార్ ఖురేషి షా ముహమ్మద్ | భారతీయ ముస్లింల వెనుకబాటుతనం-ముస్లింల పాత్ర, జగత్కరుణ ప్రచురణలు రాయచోటి, 1991 |
| 15. | మౌలానా ఎండి. యూసుఫ్ ఇస్లాహి | ఇస్లామియా జీవనసరళి (అనువాదం) |
| 16. | మున్నీ జావెద్ | (కవిత) ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 07.01.1994 |







## **అలావా** (ముస్లిం సాంస్కృతిక కవిత్వం)

(సంపాదకులు: షాజహానా, స్కైబాబ, ప్రచురణ: నసల్ కితాబ్‌ఘర్, 2006)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | షేక్ పీరా బోరేవాలా | మై బోరేవాలా |
| 02. | ఎస్ సిరాజుద్దీన్ | అలావా నుండి పిలుస్తున్నాం |
| 03. | హుస్సేన్ | జాన్‌పాడ్ సైదా దర్గా |
| 04. | షంషాద్ బేగం | ప్రాణమున్న లాష్ |
| 05. | దస్తగిరి అహమ్మద్ | కవి మర్యాదస్థుడు |
| 06. | ఎస్ యూసుఫ్ అలీ | జనాజా |
| 07. | ఎం. యూసుఫ్ అలీ | బుద్దమ్మ |
| 08. | షేక్ జహంగీర్ | మూలవాసి |
| 09. | ఎస్ఎం షంషుద్దీన్ | మసోరా |
| 00. | ఆసిఫా కౌసర్ | రాజ్య వృక్షం |
| 11. | ముచ్చెర్ల ఇబ్రహీం | మత వ్యాపారం |
| 12. | ఇలియాజ్ | ఇఫ్తార్ విందు |

## **అజా** (గుజరాత్ ముస్లిం కవిత్వం)

(సంపాదకులు: అన్వర్, స్కైబాబ, ప్రచురణ: దర్దే పబ్లికేషన్స్, హైదరాబాద్ 2002)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | ఇషాఖ్ అహమ్మద్ | నరహంతక వైరస్, రక్త వర్ణ చిత్రం |
| 02. | షఫీ | అల్లాహ్ సాక్షిగా |
| 03. | అబ్బాస్ | ఖామోస్, ఉన్నీస్‌బీస్ |
| 04. | బాసిత్ | వాడే మా మైనారిటీ |
| 05. | షేక్ హాజీ నూరాని | స్వర్గం నుంచి ఎహషాన్ జాఫ్రి కా పరివార్ |
| 06. | షాహిర్ | ఒకే చెట్టు పువ్వులం |

## ఖిబ్లా (కవితా సంకలనం)

(సంపాదకులు: షేక్ కరీముల్లా, ప్రచురణ:ముస్లిం రచయితల సంఘం-ఆంధ్రప్రదేశ్, వినుకొండ, 2006)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | ఫరీదాబాను | మేం బానిసలం కాము |
| 02. | సయ్యద్ అమీర్ | మనం ముస్లింలమేనా? |
| 03. | మౌలానా నూరుల్లా ఖాద్రి | అవస్థ |

## మా బోనులో మరో సింహం (కవితలు)

(సంకలనం : కొమరన్న, ప్రచురణ: కాకతీయ లిటరరీ అసోసియేషన్, వరంగల్, 2004)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | షేక్ అబ్దుల్ ఖాదర్ | ఈ రిజర్వేషన్ ... |
| 02. | షేక్ మహబూబ్ ఖాన్ | కబోధి పక్షులు |

## వతన్ (ముస్లిం కథలు)

(సంపాదకులు : స్కైబాబ, ప్రచురణ: నసల్, కితాబ్‌ఘర్, హైదరాబాద్, 2004)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | జాకెరా | మున్నీ మా కీ కహానీ |
| 02. | యాస్మీన్ బేగం | బుర్ఖా |
| 03. | ఎమ్.ఎస్ బేగం | దిల్ ఔర్ జిందగీ |
| 04. | ఎస్ సికిందర్ బాషా | వివక్ష |
| 05. | నూరుల్లా | గరీబ్ జిందగి |
| 06. | వలి హుసేన్ | 'బద్ జన్వర్' |







## నాయిన (కవితా సంకలనం)

(సంపాదకులు: అన్వర్, ప్రచురణ: సృజనలోకం, వరంగల్, 2006)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | షేక్ నసీరుద్దీన్ (ఎం.కాం విద్యార్థి, కెయూ, వరంగల్) | నాన్న |

## ముల్కి (కొలుపుల దస్తర్)

(సంపాదకులు: వేముల ఎల్లయ్య, స్కైబాబ, హైదరాబాద్, 2003-2004)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | అబ్బాస్ | నిప్పుల గుండం (కవిత) |
| 02. | ముచ్చర్ల ఇబ్రహీం | మత వ్యాపారం (కవిత) |
| 03. | ఎస్. అహమ్మద్ | ఖులా (కవిత) |

## చమన్ (ముస్లిం సామాజిక వేదిక)

(సంపాదకులు: స్కైబాబ, హైదరాబాద్, డిసెంబర్, 2006)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | ఎం. యూసుఫ్ అలీ | జనాజా (కవిత) |
| 02. | బిలాల్ | ఉర్దూ రానివారు ముస్లింలు కాదంటారా? (వ్యాసం) |
| 03. | ఎస్. అహమ్మద్ | ఖులా (కవిత) |

## సెల్యూట్ ది గ్రేట్ (మాసపత్రిక)

(సంపాదకులు: జి.ఏ రహీం, హైదరాబాద్, నవంబర్ 2005)

| క్రమసంఖ్య | కవి/రచయిత | కథ/ కవితా/ వ్యాసం శీర్షిక |
|---|---|---|
| 01. | పి కరీమున్నీసా | ఉపవాసాల ఆవశ్యకత (వ్యాసం) |
| 02. | పి. అజీస్ | దైవత్వానికి పెన్నిధి- ప్రేమ, మానవతే (వ్యాసం) |

# అనుబంధం : 2

**ముస్లిం కవులు-రచయితలు పంపాల్సిన సమాచారం కోసం**

**'ఇండియా' మాసపత్రిక ద్వారా కవులు, రచయితలకు అందచేసిన నమూనా పత్రం**

**(ఈ నమూనా పత్రం 'ఇండియా' ఏప్రిల్, మే 2008 సంచికలలో ప్రచురితం)**

01. పేరు ..............................................................................

02. కలం పేరు/పేర్లు ....................... ..............................................

03. పుట్టిన తేది ......................... వయస్సు .......................................

04. పుట్టిన గ్రామం .................................... జిల్లా ...............................

05. తల్లితండ్రులు ...................... .................................... .............

06. ప్రస్తుత నివాసం ................................ ....................... .................

07. విద్యార్హతలు: ..........................

08. చిరునామా ......................... (డోర్.నం., పిన్ కోడ్, ఫోన్ / సెల్ నం, యస్‌టికోడ్, ఇ-మెయిల్ ఐడితో సహా సంపూర్ణ చిరునామా)

09. ఉద్యోగం / వృత్తి / వ్యాపకం .................................. కార్యాలయం పూర్తి చిరునామా...........................................................................

10. కుటుంబం వివరాలు : భార్య / పిల్లల ............... అన్నదమ్ములు / అక్కచెల్లెళ్ళు ...........................(ఐచ్ఛికం)

11. సాహిత్యరంగ ప్రవేశం చేసిన సంవత్సరం ...........ప్రచురితమైన తొలి రచన ......... సంగ .......ఎవరి ప్రోత్సాహం / మార్గదర్శకం .........ప్రేరణ ...........

12. ప్రచురితమైన : 1. కవితల సంఖ్య ....2. కథలు / కథానికలు ......3. వ్యాసాలు ......4. కథా / కవితా / వ్యాస సంపుటాల సంఖ్య .....5. గ్రంథాల సంఖ్య .....

13. మీకు ఇష్టమైన / ఖ్యాతి తెచ్చిపెట్టిన రచన : ఏమిటీ ..... ఎప్పుడు రాశారు... రచనాంశం (సంక్షిప్తంగా) ............. ఎలాంటి గుర్తింపు లభించింది .........

14. మీ రచనలేమైనా ఇతర భాషలలోకి అనువాదం అయ్యాయా? అయితే ఆ వివరాలు ............................







15. వ్యక్తులు, సంస్థలు-సంఘాలు పెట్టిన పోటీలలో మీరు పాల్గొన్నారా ? ఆ వివరాలు తెలపండి. సంస్థ పేరు........ఎక్కడ........ఏ సంవత్సరం........స్థాయి ఏమిటీ.............. ఫలితమేమిటి....................

16. లభించిన అవార్డులు / బిరుదులు ............ప్రకటించిన సంస్థలు ............. ఎక్కడ .........ఎప్పుడు.........

17. లభించిన పురస్కారాలు : ప్రకటించిన సంస్థలు .......... ఎక్కడ .............. ఎప్పుడు ..................

18. సన్మానాలు / సత్కారాల వివరాలు.......... ఏ సంస్థ / సంఘం ......ఎక్కడ ..... ....... ఎప్పుడు .................

19. మీ రచనలను ప్రశంసించిన / ప్రోత్సహించిన వ్యక్తులు, సంఘాలు, సంస్థలు :

20. ఒక కవి / రచయితగా మీరు నిర్దేశించుకున్న లక్ష్యం - గమ్యం ఏంటీ ?

21. పరిచయం ఉన్న ఇతర కవులు / రచయితల పూర్తి చిరునామా..............., ఫోన్ నం ...................... లేదా సెల్ నం...................................

22. ఇవికాక మరేదైన సమాచారాన్ని తెలియచేయాలని భావించినా తెలియచేయవచ్చు.

**నోట్ :** ఈ పత్రాన్ని నమూనాగా మాత్రమే ఇవ్వడం జరిగింది. ప్రశ్నల రూపంలో కోరిన సమాచారాన్ని మరో పేపరు మీద రాసి రెండు పాస్‌పోర్టు సైజు ఫోటోలతో పాటుగా కవి / రచయిత సంతకం చేసి క్రింది చిరునామాకు పంపాలి. ఈ సమాచారాన్ని '**డైరెక్టరీ**' గా మాత్రమే కాకుండా '**ఇండియా**' మాసపత్రిక పరిచయ వ్యాసాల రూపంలో గాని, మరే రకంగా గాని ప్రచురించే అవకాశం ఉంది.

**ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్,**

**శివప్రసాద్ వీధి, కొత్తపేట, వినుకొండ - 522 647**

**గుంటూరు జిల్లా.**

**సెల్ : 94402 41727, 9396429722**

# అనుబంధం : 3

**(తెలుగులో రాసిన/రాస్తున్న ముస్లిం కవులు-రచయితల సమాచారాన్ని పంపాల్సిందిగా కోరుతూ పత్రికలకు విడుదల చేసిన ప్రకటన)**

గత తొమ్మిదేండ్లుగా 'భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ముస్లిం జన సముదాయాల పాత్రను' వివరిస్తూ పలు చరిత్ర గ్రంథాలను ప్రచురించి పాఠకులకు అందించిన 'ఆజాద్ హౌస్ ఆఫ్ పబ్లికేషన్స్' తెలుగులో సాహిత్య సృష్టి గావించిన/గావిస్తున్న ముస్లిం కవులు, రచయితల, అనువాదకుల వివరాలతో కూడిన 'డైరక్టరీ' రూపొందించాలని సంకల్పించింది.

ఈ ప్రయత్నం మూడేండ్ల క్రితం చేసినా తగిన ప్రచారం, సంబంధితుల నుండి తగినంత స్పందన లేకపోవటంతో అప్పట్లో ఆ ప్రయత్నాన్ని విరమించుకున్నాం. గత కొద్ది కాలంగా పలువురు పెద్దలు, మిత్రులు రాష్ట్రంలోని కవులు, రచయితల వివరాలతో కూడిన డైరక్టరీ రూపొందించాల్సిన అవసరముందంటూ, ఆ ప్రయత్నం మళ్ళీ చేయమని సూచిస్తున్నారు.

ఆ సలహా/సూచనల మేరకు రాష్ట్రంలోని ముస్లిం కవులు, రచయితలు, అనువాదకులు తమ వ్యక్తిగత, వృత్తి, ప్రవృత్తి, సాహిత్య రంగాలలో వ్యక్తిగత కృషిని -ప్రగతిని, ఆయా రంగాలలో క్రియాశీలక భాగస్వామ్యాన్ని, ప్రచురితమైన గ్రంథాలు, అవి ఇతర భాషలలో అనువాదమై ఉంటే ఆ విశేషాలను, అలాగే లభించిన అవార్డులు, పురస్కారాలు, అభినందనలు, జరిగిన సన్మానాలు తదితర వివరాలను సవివరంగా పేర్కొంటూ, రెండు పాస్‌పోర్టు సైజు ఫోటోలతో సహా సమగ్ర సమాచారాన్ని, బయోడేటా రూపంలో 2008 మే30 లోగా ఈ క్రింది చిరునామాకు అందేలా పంపించగలరు.

రాష్ట్రంలోని వివిధ పత్రికలలో తమ గురించి, తమ రచనల గురించి ప్రచురితమైన పరిచయ వ్యాసాలు, సమీక్షా వ్యాసాలు, తమ గ్రంథాలు, ఆ గ్రంథాల మీద వచ్చిన సమీక్షల జిరాక్స్ కాపీలను కూడా పంపితే కవుల-రచయితల పరిచయాలు సమగ్రంగా రూపొందించడానికి వీలుంటుంది. గడువు తేదీ కంటె ముందుగా వివరాలు అందితే డైరక్టరీ ప్రచురణ సౌలభ్యంగా ఉంటుందని మిత్రులు గ్రహించగలరు.

ఈ డైరక్టరీని రాష్ట్రంలోని ప్రభుత్వ-ప్రభుత్వేతర ప్రముఖ గ్రంథాలయాలకు, విశ్వవిద్యాలయాలకు, సాహితీ సంస్థలకు సమాచార వ్యవస్థలకు 'ఉచితంగా' అంద చేయాలన్నది మా నిర్ణయం.'

**మార్చి, 2008**

**సయ్యద్ నశీర్ అహమ్మద్,** **వినుకొండ.**









## సంప్రదించిన గ్రంథాలు-పత్రికలు

**తెలుగు గ్రంథాలు:**


01. **తెలుగు సాహిత్యం : ముస్లింల సేవ** (సిద్ధాంత గ్రంథం), డాక్టర్ షేక్ మస్తాన్, కరీమా పబ్లికేషన్స్, గుంటూరు, 1991.

02. **తెలుగు వైతాళికులు**, ప్రచురణః ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1979.

03. **మైనార్టీ కవిత్వం-తాత్త్విక నేపథ్యం**, డాక్టర్ యస్. షమీఉల్లా, మెహరున్నీసా ప్రచురణలు, సికింద్రాబాద్, 2005.

04. **సమగ్ర ఆంధ్ర సాహిత్యం**, ఆరుద్ర, ప్రజాశక్తి బుక్ హౌస్, విజయవాడ, 1989.

05. **మన రచయితలూ-రచయిత్రులూ** (పరిచయ వేదిక) రచయిత : భాషాప్రవీణా కె.యస్.ఆర్.కె.వి.వి.ప్రసాద్, నల్లజర్ల, 2005.

06. **సంప్రదాయ కవుల వాఙ్మయ చరిత్ర,** సంపాదకులు :డాక్టర్. యన్. రామచంద్ర, సాహితీ మిత్రమండలి, ప్రొద్దుటూరు, 2007

07. **కడప జిల్లా సాహితీమూర్తులు**, రచన-సంకలనం: డి.కె చదువులబాబు, ప్రజాహిత ప్రచురణలు, హైదరాబాద్, 2007.

08. **రసానందం**, కంచర్ల పాండురంగ శర్మ, వినుకొండ.

09. **వినుకొండ చరిత్ర**, షేక్ కరీముల్లా, వినుకొండ.

10. **పశ్చిమగోదావరి**, ప్రత్యేక సంచిక, నేషనల్ ఇంటిగ్రేషన్ ఫోరం, పెనుగొండ, 1981

11. **కవిరాజ విరాజితము**, ప్రత్యేక సంచిక, పెనుగొండ, 1982.

12. **వెలుగు దివ్వెలు, (ఆంధ్రప్రదేశ్ ముస్లిం తెలుగు రచయితల సమ్మేళనం,** హైదరాబాద్, ప్రత్యేక సంచిక, 1982.)

13. **పుట్టుమచ్చ**, ఖాదర్ మొహియుద్దీన్, కవిత్వం ప్రచురణలు – 11, విజయవాడ, 1991.

14. **జల్‌జలా**, ముస్లింవాద కవిత్వం, సంపాదకులు : స్కైబాబ, నీలగిరి సాహితి, నల్గొండ, 1998.

15. **అజా**, గుజరాత్ ముస్లిం కవిత్వం, సంపాదకులు : అన్వర్, స్కైబాబ, దర్గీ పబ్లికేషన్స్, హైదరాబాద్, 2002

16. **ముస్లిం వాద తాత్విక సిద్ధాంతం–సాహిత్యం**, ఖాజా, హేలిప్రింట్ మీడియా, హైదరాబాద్, 2005

17. **అలావా**, (ముస్లిం సాంస్కృతిక కవత్వం) సంపాదకులు : షాజహానా, స్కైబాబ, నసల్, కితాబ్‌ఘర్ – 4, 2006

18. **గుజరాత్ గాయం**, కవితా సంకలనం, లౌకికప్రజాస్వామిక సాంస్కృతిక వేదిక, హైదరాబాద్, 2002

19. **నాయిన**, కవితా సంకలనం, సంపాదకులు : అన్వర్, సృజనలోకం, వరంగల్, 2006.

20. **జంగ్**, ముస్లిం రిజర్వేషన్ కవిత్వం, సంపాదకుడు : సయ్యద్ సాబిర్ హుసేన్, ముస్లిం రచయితల సంఘం, వినుకొండ, 2007

21. **ఖిబ్లా,** ఇస్లాంవాద కవితా సంకలనం, సంపాదకులు : ఎం.డి ఉస్మాన్ ఖాన్ తదితరులు, ముస్లిం రచయితల సంఘం, వినుకొండ, 2006.

22. **వతన్**, (ముస్లిం కథలు), సంపాదకులు : స్కైబాబా, నసల్ కితాబ్‌ఘర్, హైదరాబాద్, 2004.

23. **మా బోనులో మరో సింహం**, సంపాదకులు : కొమ్రరన్న, కాకతీయ విశ్వ విద్యాలయం లిటరరీ అసోసియేషన్, వరంగల్, 2008.

24. **ఆంధ్రప్రదేశ్‌లో ముస్లిం రిజర్వేషన్లు**, రచన–కూర్పు : మహమ్మద్ షఫీ అహమ్మద్, ముస్లిం సంక్షేమ సంఘాల సమాఖ్య, విజయవాడ, 2005

25. **కవాతు**, ఉగ్రవాదం పై నిరసన కవిత్వం, సంపాదకులు : షేక్ కరీముల్లా, ముస్లిం రచయితల సంఘం, వినుకొండ, 2008.









26. **ఈ దశాబ్ది కవిత**, సంపాదకులు: డాక్టర్ ఎస్.వి సత్యనారాయణ, పెన్నా రామకృష్ణా, విశాలాంధ్ర ప్రచురణలు, హైదరాబాద్, 2008

27. **సాహితీ సౌరభం** (సీమ ఆధునిక కవితా సంకలనం), సం॥ డాక్టర్ ఎన్.రామచంద్ర, సాహితీ మిత్రమండలి, ప్రొద్దుటూరు, 2004.

28. **షాయర్**, పోయిట్రీ బులిటిన్–1, హైదరాబాద్, డిసెంబరు 2006.

29. **కవయిత్రుల కవితా మార్గం**, శిలాలోలిత, సాహితీ స్రవంతి, హైదరాబాద్,2006.

30. **కర్నూలు కథ**, ఎం.హరికృష్ణ, కర్నూలు బుక్‌ట్రస్ట్, కర్నూలు, 2005

31. **ఊరి చివర**, అఫ్సర్, పాలపిట్ట బుక్స్, హైదరాబాద్, 2009

32. **ప్రకాశం జిల్లా రచయితల సంఘం ద్వితీయ సభల ప్రత్యేక సంచిక**, 19851

33. **బాల సాహిత్య నిర్మాతలు**, కూర్పు: రెడ్డి రాఘవయ్య, మొదటిభాగం, 2002


## తెలుగు పత్రికల సంచికలు:


01. **భారతి** మాసపత్రిక

02. **ఆంధ్రపత్రిక** దినపత్రిక

03. **ఆంధ్రజ్యోతి** దినపత్రిక

04. **సాక్షి** దినపత్రిక

05. **ఆంధ్రప్రభ** దినపత్రిక

06. **ఆంధ్రభూమి** దినపత్రిక

07. **సెల్యూట్ ది గ్రేట్** మాసపత్రిక (హైదరాబాద్)

08. **ఇండియా** మాసపత్రిక (వినుకొండ)

09. **గీటురాయి**, వారపత్రిక (హైదరాబాద్)


## ఆంగ్ల గ్రంథాలు :


01. Who's Who of Indian Writers, Sahithya Akademi, New Delhi, 1961


◆◆◆

## కృతజ్ఞతలు

### అక్షరశిల్పులు

(ముస్లిం కవులు-రచయితల సంక్షిప్త పరిచయం)

గ్రంథ ప్రచురణకు అవసరమగు సమాచార సేకరణ నిమిత్తం విడుదల చేసిన ప్రకటనను ప్రచురించి ఎనలేని సహకారం అందించిన సంపాదకులకు, ప్రచురణకర్తలకు, పాత్రికేయులకు కృతజ్ఞతలు.

**దినపత్రికలు**

సాక్షి, ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి, సూర్య, వార్త, విశాలాంధ్ర, ఈనాడు, ప్రజాశక్తి, ఆంధ్రప్రభ, నేటినిజం, ప్రజాతంత్ర

**వారపత్రికలు**

గీటురాయి (హైదరాబాద్) ప్రజాపత్రిక (రాజమండ్రి), జనమిత్ర (యానాం), మరోపోరాటం (మహబూబాబాద్), మాహి (మహబూబ్‌నగర్), మనభూమి (విశాఖపట్నం), ప్రజాతంత్ర (హైదరాబాద్)

**పక్షపత్రికలు**

తెలుగు తోరణం (విజయవాడ), ఇస్లామిక్ వాయిస్ (హైదరాబాద్)

**మాసపత్రికలు**

బహుజన కెరటాలు (ఒంగోలు), ప్రజాసాహితి (విజయవాడ), నెలవంక (పాలకొల్లు), స్త్రీవాద పత్రిక భూమిక (హైదరాబాద్), వీక్షణం (హైదరాబాద్), భావవీణ (గుంటూరు), ఇండియా (గుంటూరు), కలం సాక్షి (విజయవాడ), వెలుగు కిరణాలు (పెడన), దర్గా (బాపట్ల)

**త్రైమాసపత్రికలు**

సాహిత్య నేత్రం (కడప), నూర్జహాన్ (హైదరాబాద్), రమ్యభారతి (విజయవాడ)

**ఉర్దూ పత్రికలు**

సియాసత్ (హైదరాబాద్), ఏతెమాద్ (హైదరాబాద్)







## ధన్యవాదాలు

### అక్షర-శిల్పులు

గ్రంథ ప్రచురణకు ఆర్థిక-హార్థికంగా సహకారమందించిన మిత్రులకు

**హృదయపూర్వక ధన్యవాదాలు.**

**సయ్యద్ సలీం**
(ప్రముఖ రచయిత, హైదరాబాద్)

**షేక్ లతీఫ్ సాహెబ్ (లతీఫ్ కుట్టీ)**
(సంచాలకులు, కుట్టీ విద్యా సంస్థలు, నెల్లూరు)

**డాక్టర్ ఉమర్ అలీషా**
(విశ్వ విజ్ఞాన విద్యా ఆధ్యాత్మిక పీఠం, పిఠాపురం)

**సయ్యద్ మీరా హుస్సేన్**
(న్యాయవాది, హైదరాబాద్)

